# A DESCRIPTIVE CATALOGUE

OF THE

# TELUGU MANUSCRIPTS

IN THE

## GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS


BY

MAHĀMAHŌPĀDHYĀYA VIDYĀVĀCASPATI

S. KUPPUSWAMI SASTRI, M.A., I.E.S.

PROFESSOR OF SANSKRIT AND COMPARATIVE PHILOLOGY, PRESIDENCY COLLEGE AND CURATOR, GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS


(*Prepared under the orders of the Government of Madras*)

---

**Volume IV—Prabandhas—*continued***

**DVIPADAKĀVYAS**

---


MADRAS:

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS

1936

# CONTENTS

PRABANDHAS—*cont.*

*Dvipadakāvyas.*

# A DESCRIPTIVE CATALOGUE

OF THE

# TELUGU MANUSCRIPTS.

## VOLUME IV.

---

## CLASS I. PRABANDHAS (*continued*).

### DVIPADA KĀVYAS.

---

### No. 942. ఉత్తరరామాయణము.

### UTTARARĀMĀYAṆAMU.

Substance, paper. Size, $12\frac{1}{8} \times 8$ inches. Pages, 548. Lines, 21 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, not good and full of mistakes.

Complete

A Prabandha in Dvipada metre describing the story of the Uttarakāṇḍa of the Vālmīki Rāmāyaṇa. The authors Kācabhūvibhu and Viṭṭhabhūvibhu were the sons of Gōnabuddhabhūvibhu, who wrote in Telugu the first six Kāṇḍas of the Vālmiki Rāmāyaṇa in the Dvipada metre but died before translating the Uttarakāṇḍa. This work has been dedicated to Gōnabuddhabhūvibhu (father of the two authors), who was the son of Annamāmba and Kannabhūpati.

A note on the fly-leaf of the MS. in the hand of C. P. Brown runs as follows :—

"Translation in Dwipada metre of the Uttara Ramayan.

A new and correct edition prepared under the superintendence of C. P. Brown."

**Beginning :**

శ్రీనాథచరణరాజీవశేఖరుఁడు
భానుకోటిప్రభాభాసమానుండు

*     *     *     *

గోనవంశాన్వయకువలయప్రియుఁడు
నానాప్పుగోవగ(క)న్నక్షితీంద్రునకు

ననుకూలనైయున్నయన్నమాంశికకుఁ
దనయుఁడు సాహిత్యతత్త్వకోవిదుఁడు
దానప్రసిద్ధుండు ధర్మశీలుండు
భూనుతుండగుగోనబుద్ధభూవిభుఁడు

* * * *

తెలుఁగున నొప్పగా ద్విపదరూపమున
నలిఁబూర్వరామాయణము మున్నుచెప్పి
సకలేశుఁడగురామచంద్రువర్తనము
సకలంబు రచియించి సకలపుణ్యముల
సకలలోకులుఁ దన్నుసన్నుతిసేయ
నకలంకమహిమల నందెదఁగాక
యని నిశ్చయముచేసి యంతరంగమునఁ
దనయిష్టదేవతాధ్యానంబు సేయ

* * * *

పీతాంబరంబొప్పఁ బృథులనీలాభ్ర
భాతిమే నమరంగఁ బంకజోదరుఁడు
భానుకోటిప్రభాభాసితుండగుచు
మానసంబునఁ దోఁచి మహితవాక్యముల
నీవు నాకెంతయు నెఱయ భక్తుఁడవు
నీవు పుణ్యుండవు నీవు మాన్యుఁడవు
గావున నీభక్తి కైకొంటిమేము
నీవింక మముఁగూడి నెమ్మి నేతెమ్ము
నీవాంఛితార్థంబు నిర్వహింపంగ
నీవరనందను ల్నిపుణమానసులు
వారి నియోగింపు వారు నీకోర్కి-
గారవంబునఁ జేయఁగలవారు మీఁద
ననిపలికి విచ్చేసె నాదేవునాజ్ఞఁ
మనమున ధరియించి మముఁ బిలిపించి
యాంతతప్రీతితో నా తెఱంగెల్ల
మాతోడ వినిపించి మముఁగటాక్షించి

* * * *

నాకులదీపకు ల్నాగుణాన్వితులు
నాకీర్తివర్ధను ల్నాకూర్మిసుతులు

గాన నాపూనినకథయెల్లజనులు
మానుగాఁగొనియాడ మధురవాక్యముల
నెమ్మిఁ జెప్పఁడు మీరు నిపుణులై యనుచు
మమ్ముఁబంచిన మేము మాతండ్రిప్రతిన
చిరకీర్తు లెసఁగంగఁ జెల్లింపఁగనుట
పరమధర్మం బని భక్తితోఁ గోరి

* * * *

అనిశంబుఁ బలపోయు ననఘులందుండు
నని మతుకులస్వామి యగువిష్ణుఁ గొలిచి

* * * *

రామావతారంబు రమణీయమగుట
రాము పావనచరిత్రము దివ్యభాష
లోకానురంజనశ్లోకబంధమునఁ
జేకొని వాల్మీకి చెప్పినజాడ
మాతండ్రిబుద్ధక్షమానాధుపేర
నాతతఘను పేర ననఘుని పేర
ఘనుఁడు మీసరగండకాచభూవరుఁడు
వినుతశీలుఁడు మనువిట్ఠభూవిభుఁడు
ననిజనుల్గొనియాడ నర్థితో మేము
వినుతనూతనపదద్విపదరూపమునఁ
బ్రాకటంబుగ నంధ్రభాషఁ జెప్పంగ
నైకొన్న యుత్తరకథ యొట్టిదనిన
శ్రీరామచంద్రుండు సితకీర్తు లలర
ఘోరాజిరాక్షసకోటిని జంపి
మరలి యయోధ్యకు మహిమతో వచ్చి
చిరలీల రాజ్యంబు సేయుచున్నెడను
శుభమూర్తినమ్మహాశూరు దీవింప
నభిలాష నేతెంచి రఖిలసంయములు

**End :**

అరవిందభవుఁ జూచి యారమాధిపుఁడు
కరుణార్ద్రచిత్తుఁడై కడుఁ బ్రీతిఁ బలికె
పరమేష్ఠి నాకు నీప్రజలు ప్రాణములు

కరము ప్రియంబునఁ గదలి నా వెనుక
శాశ్వతస్థితిగోరి చనుదెంచినారు
పశ్వాదులును వచ్చె బంధము ల్బాసి
యొగిపుణ్యలోకంబు లొసఁగునీ వనినఁ
దగ విచారించి యాధాతచిత్తమున
నొనర నాలోకంబు నుపరిభాగమునఁ
దనరుచునున్న సంతానలోకమున
నిమ్ములఁజరియింపనిండంచుఁ బలికె
సమ్మదం బెసఁగ నాజలజసంభవుఁడు
తరుచరాదులఁ గొంటి తమమూర్తులమర
సరి నేఁగిరద్దివ్యనిజస్థానములకు
అనిమిషాదులనెల్ల నంతవీడ్కొలిపి
దనుజారి వేంచేసెఁ దన లోకమునకు
రాజన్యవిభుఁడైన రాము తేజమున
రాజిల్లుచున్న యీ రామాయణంబు
నెవ్వరు పఠియించి రెవ్వరు వినిరి
యెవ్వరు వ్రాయించి రెవ్వరు వ్రాసి

* * * *

వసుధఁ గ్రమ్మరఁ జక్రవర్తులై పుట్టి
రసికులై కైకొండ్రు రాజ్య సంపదలు॥

**Colophon :**

అనిచంద్రచందన హారనీహార
ఘనసార ఘనసార ఘనకీర్తిధనులు
భూనుతుండగు గోనబుద్ధభూవిభుని
సూను లుదారులు సుగుణ భూషణులు
ఘనుఁడు మీసరగండ కాచభూవిభుఁడు
వినుతపుణ్యుండగు విట్ఠభూపతియు
రచియించి రుత్తర రామాయణంబు
రుచిరమై నిత్యమై రూఢిఁ బెంపెసఁగ
నాచక్రవాళశైలావనియందు
నాచంద్రతారార్కమై యొప్పుఁగాత.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. ఇది డి నెం 943 రు ప్రతికి శుద్ధ ప్రతిగాఁబోలును. ఇతర ప్రతుల పాఠభేదము లిందు లేవు. దీనికి సరివచ్చు సంస్కృత మూలము సర్గ సంఖ్యకూడ నిందు చూపఁబడినది.

వాల్మీకి రామాయణము నుత్తర కాండమున కిది ద్విపదరూపమగు తెనుఁగుచేఁత. కాచభూవిభుఁడును విట్ఠభూవిభుఁడును దీనికిఁ గర్తలు. వీరు రామాయణ పూర్వకాండములను ద్విపదకృతిగాఁ దెలిఁగించిన గోన బుద్ధభూవిభుని కుమారులు. అవసానకాలమునఁ దండ్రియానతిచ్చిన విధమున నాతఁడు తెలిఁగింపఁగా మిగిలిన యుత్తర కాండమును దాము దెలిఁగించినట్లు వీరిందు చెప్పుకొనిరి. ఈ గ్రంథము బుద్ధభూవిభునకే యంకితము చేయఁబడెను. బుద్ధభూవిభుఁడు అన్నమాంబికను గన్న భూపతికిని, బుత్త్రుఁడైన ట్లిందుఁగలదు. బుద్ధభూవిభుకృతియగు నా రామాయణమున నాతఁడు విట్ఠలక్ష్మాపాలుని కుమారుఁడయినట్లు గలదు.

---

## No. 943. ఉత్తరరామాయణము.

## UTTARARĀMĀYAṆAMU.

Substance, paper Size, 12½ × 8 inches. Pages, 653. Lines, 17 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Written on only one side of the paper. Variations in the reading are interlined. Bound in two volumes.

**Complete.**

Same work as the above.

The following note of Mr. C. P. Brown appears in the beginning of Vol. I:—

"The Uttara Ramayan, in Dwipada Metre, contained in these two volumes, is a work of value as affording a classical standard of the Telugu language. It has however been superseded by the more *modern* version written in Padya metre which is full of apocryphal details

Copies of the *Uttara* portion have become rare: and with much difficulty I succeeded in obtaining four manuscripts: one of which was sent me by Professor Wilson, from the India House library, in London.

The deviations between these copies are very great: some verses exhibiting two and three deviations in the same word. Other lines look

as if they were correct because there are no various readings. But unluckily this arises from another cause. Those lines are, in many cases, entirely *omitted* and acc dingly the various readings cannot be discovered.

C. P. Brown—**1841.**

The Dwipada Ramayan in six books is very commonly met with—but the seventh Book or Uttara Canda, of which this is a copy, is rare, and with much difficulty I obtained three copies "

(వి-వి.)—

సమగ్రము. రెండు సంపుటములు. కాగితమున కొక వైపున మాత్రమే వ్రాఁత గలదు. రెండవ వైపున నక్కడక్కడ త్యక్తగ్రంథ భాగములు సవరణలు మొదలగునవి వ్రాయఁబడినవి. పాఠ భేదములు ఖంతుల నడుమఁ గలవు.

పూర్వము వోలె.

---

## No **944**. ఉత్తరరామాయణము.

## UTTARARĀMĀYAṆAMU.

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{7}{8}$ inches Pages, 274. Lines, 21 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good and free from mistakes

Begins on fol. 181. The other works herein are—Hariścandranalōpākhyānamu 1a, Padminīpariṇayamu (Yaksagānamu) 133a, Nijaliṅga Cikkayyakatha 157a.

Complete.

Same work as the above

In the beginning of this work, the following note in C. P. Brown's handwriting is found :—

"This is the copy of the Dwipada Uttara Ramayan transcribed from a manuscript in the library of the East India House. It has been collated in preparing a new edition : the pages of which are noted (the first being No. 6) in the margin—Not every page, but enough to assist in reference."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

Fol. 1a హరిశ్చంద్రనలోపాఖ్యానము, fol. 133a పద్మినీపరిణయము (యక్షగానము), fol. 157 కజలింగచక్రవర్త్యకథ, యింకను గలవు.

---

### No. 945. ఉత్తరరామాయణము.

### UTTARARĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 14⅞ × 1⅜ inches. Pages, 354. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథపాతము లల్పముగఁ గలవు.

పూర్వము వలె.

గ్రంథాంతమం దిట్లు గలదు :—

“ఈ ప్రతిని వృష సంవత్సర ఫాల్గుణ శుద్ధ దశమీ గురువారంనాడు పాగా అనంతయ్యగారికి మార్గ సహాయభట్లు వ్రాసియిచ్చెను”—

---

### No. 946. ఉత్తరరామాయణము.

### UTTARARĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 12½ × 1⅜ inches. Pages, 212. Lines, 6 on a page. Character, Telugu Condition, much injured. Appearance, very old. Mode of writing, good but contains mistakes.

Incomplete and imperfect.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు. ఆకులే తార్మారుగానున్నవి.

పూర్వము వలె.

## No. 947. ఉత్తర రామాయణము.

## UTTARARĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 18 × $1\frac{3}{8}$ inches. Pages, 250 Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Complete.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత యంత మంచిదిగాదు. తప్పులు లేక పోలేదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

---

## No. 948. ఉత్తరరామాయణము.

## UTTARARĀMĀYANAMU.

Substance, palm-leaf. Size, 17 × $1\frac{1}{4}$ inches. Pages, 306. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Complete but imperfect.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు ఎపనెడఁ గలవు.

పూర్వము వోలె.

గ్రంథాంతమందీ వ్రాంత గలదు :—

హేవిళంబినామ సంవత్సర ఆషాఢ శు ౨ గట్టుపల్లి రామప్ప కొమారుడు వెంకట్రామయ వ్రాసిన ఉత్తరరామాయణ పుస్తకం సమాప్తి.

---

## No. 949. దేవాంగపురాణము.

## DĒVĀṄGAPURĀṆAMU.

Substance, paper Size, $12\frac{5}{8}$ × $7\frac{7}{8}$ inches. Pages, 252. Lines, 25 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Complete in seven Āśvāsas.

Simılar to the woık described under R. No. 613 of the Triennial Catalogue of Telugu MSS., Vol. IV, Part III. The author Bhadrakavi Lingabhūvibhu was the son of Rāmaȷaprabhu and was a disciple of Saṅgamēśvara This work, written at the instance of Dēvāṅga princes, is dedicated to god Rāmēśvara woıshipped at Mudanūru. At the end of the work the genealogy of one Komaıēndra is described.

**Beginning :**

శ్రీరజితాచల శృంగవిహారు
హారకర్పూరనిభాంచితాకారు
. . . . . . .
కామారిముదనూరి కటకాభిరాము
? రామేశ్వరునిభక్త రసికతాప్రవరు
వరదేవతాచక్రవర్తి గీర్తించి
స్థిరమనోరథములు సిద్ధింపఁగొలిచి
. . . . . . .
మంగళస్ఫురితస మంచితకీర్తి
శృంగారనిధియైన శ్రీకాళహస్తి
సంగమేశ్వరగురుస్వామి పాదాబ్జ
సంగతపటురేణు సమితిఫాలమున
సంధిల్లఁబ్రణమిల్లి సంస్తుతిచేసి
బంధురవాక్యపుష్పములఁ బూజించి
సాక్షాత్కరించిన శంకరాకృతుల
దక్షుతఁ బండిత త్రయముఁ గీర్తించి
సలలితఘనవీర శైవసన్మార్గ
మిల భక్తజనలోక హితముగాఁ గృతుల
శ్రీమతి నుద్ధగించినపాలకూరి
సోమనాగాధ్యుఁబ్ర స్ఫుటభక్తిఁగొలిచి
ఘనవీరశైవదీక్షాసమర్థుండు
వినుతపరబ్రహ్మ విజ్ఞానమూర్తి
పరమకృపారస భరితాత్ముఁడనఁగఁ
బరగినపిడుపర్తి బసవేశుదివ్య
పదములునిర్వాణ పదములౌననుచు
పదలకభజియించి వర్ణనచేసి

శివకులాంబుధిచంద్రు శేషయోగీంద్రుఁ
బ్రవిమలభక్తి సంభావించి కొలిచి
కరుణాభిరాము సత్కవిసార్వభౌము
నరలోకనుతు రంగనాథుఁ గీర్తించి
భావించి యెప్పుడుఁ బ్రార్థనచేసి
గోవిందభట్టారకులఁ బ్రస్తుతించి
ధవళేశునామయ్యఁ దగనొప్పఁబొగడి
శివనాగమయ్య నం చితభక్తిఁ దలఁచి
పరమేశుమహిమ సంభావించి చెన్న
బసవేశునాత్మలోఁ బలుమాఱుదలఁచి
సకలపురాతన శరణులఁ గొలిచి
సకలనూతనభక్త సమితిఁ గీర్తించి
వఱలుసత్కవి చక్రవర్తిగు(కు?)మారు
నెఱదాతబసవేశు నెలమితోఁబొగడి
ధరణిపై దేవర దాక(స?)య్యవంశ
వరనిధిసంపూర్ణ వార్ధిచంద్రుండు
దురితదూరుఁడు శివ ద్రోహరగండ
బిరుదప్రతాపగం భీరవర్తనుఁడు
చరితార్థచరితుండు సత్యసంధుండు
సరసుండుశివధర్మ శాస్త్రకోవిదుఁడు
పరమశివజ్ఞాన భరితాత్ముఁడనఁగఁ
బరగినరామయ ప్రభుమూర్తిసుతుఁడ
వినుతశబ్దబ్రహ్మ విద్యానిరూఢి
ఘనతమించినభద్ర కవిలింగవిభుఁడ
దొరకొని శివకవీం ద్రులగొల్చి వారి
కరుణచేఁబడయుట గంభీరముద్ర
గరిషించుపరవాది కవిసింహములకు
శరభేంద్రముద్రనా సరసవాక్ప్రౌఢి
మతిలోననొకనాఁడు మహిఁగీర్తివెలయఁ
గృతిఁజేతుననివితర్కించితినిట్లు

. . . . . . .

ఈపురాణములెల్ల నెఱిఁగిశోధించి

యేపుణ్యకథగని యింతుభావించి
తెలివైనతెనుఁగున: దేఁటగానవుచుఁ
దలపోయఁదలకొన్నఁ దత్ప్రస్తవమున
భూనాగికినిశిరో భూషణంబైన
మానితద్రావిడ మధ్యదేశమున
నడరుమర్త్యస్వర్గ మగుమధురాస
పడవీడుసకలసం పదలకువీడు

. . . . . . .

ఇరవొప్పఁగాళహ స్తీశ్వరుఁడనెడి
పురుషాగ్రగణ్యుఁ డప్పురి కధీశ్వరుఁడు
పట్టణంబులకెల్లఁ బరగినతల్లి
పట్టణంబయినట్టి పడవీటియందుఁ
గామ్మరైనదేవాంగ కులము రక్షింప
రమణతోనెలకొన్న రామేశ్వరు(నకుఁ)
ప్రారంభమున నూలిపౌర్ణమినాఁడు
చారువైభవములు సకలోపచార
యుక్తంబుగా భక్తి యుక్తిఁగావించి
ముక్తిప్రదాయకు ముఖమంటపమున
సర్వజ్ఞ లుత్తమ జన్మావతారు
లుర్వీసమానమ హోన్నతకుములు
దురితదూరులు శివ ద్రోహరగండ
బిరుదగండరగండ భీమవిక్రములు

. . . . . . .

చముడేశ్వరిమహా శక్తికారుణ్య
రమణీయదుగ్ధాబ్ధి రాజహంసములు

. . . . . . .

పరగినకశ్యప బ్రహ్మగోత్రజులు
స్థిరలీలఁ బడవీటి దేవాంగఘనులు
పరమసమ్మదముతోఁ బదివేలకులము
నరుదార సింహాస నాసీను లగుచు
రాయదత్తములైన రత్నహారములు
తోయజబంధుబిం బరదీప్తు లెసఁగు

గండపెండేరముల్ ఘనబిరుదులును
మండితకేయూర మణికంకణములు

. . . . . . .

చిత్రచీనాంబర శ్రీవిలాసములు
నేత్రాభిరామమై నెమ్మి శోభిల్ల

. . . . . . .

బహుమానచిహ్నలు భద్రమై చెలఁగ
మహిమతోఁ గొలువుండె మానరక్షకుఁడు
కుశలత్వమునకీర్తి కొల్వుప్రసంగ
వశమాన బుధులైన వారిపీక్షించి
సరవితో దేవాంగ సన్మునీశ్వరుని
వరదివ్యచరితంబు వసుమతిమీఁద
వెలయంగ ద్విపద కవిత్వంబుచేయఁ
గలకవీశ్వరుఁడెందుఁ గలఁడెఱింగింపుఁ
డనిన దేవాంగుల నార్యరత్నములు
గనుఁగొనిపలికిరి ఘనసమ్మదమున
వీరభద్రేశ్వర విమలకారుణ్య
చారుకటాక్షవీక్షణసుధాసింధు
జనితబంధురకావ్య శారదాలక్ష్మిఁ
బనిగొననేర్చిన ప్రాజ్ఞుండు గలఁడు
పరమ మాహేశ్వర పరభక్తిపరుఁడు
వరయశోధనుఁడు దేవరదాసమయ్య
కులపయోవారాశి కుముదబాంధవుఁడు
తెలుఁగుకు నెఱవాది ద్విపదకు రాజు
గుణగణాభరణుండు గూడలిస్థలిని
గణుతింపఁదగు భద్రకవి లింగ విభుఁడు
కడునర్థి నతని నికటాడికి రప్పించి
యెడపక చెప్పింపుడీప్రబంధంబు
నవరసభావమై నలువుదీపింప
వివిధ వర్ణనలతో వివరింపనేర్చు
ననిన సంతోషించియకాఁ గాకయనుచుఁ
బనివడి బిలిపించి బహుమానమొసఁగి
పలికిరి కొల్వులోపల నొకనాఁడు

నెలకొని బుధులెల్ల నీకావ్య మహిమను
గొనియాడుచున్నారు కుంభినిమీఁద
ననఘాత్మ సంతోషమయ్యెడి మాకు
మాకులమునకు నీమహనీయచరిత
శ్రీకరాభరణమై చెలువుదీపించు
కావున దేవాంగ ఘనచరిత్రంబు
వావిరి ద్విపదకావ్యంబు గావింపు
నగజాధినాథుఁ డున్నతకులదైవ
మగు రామలింగంబు నధిపతిఁజేసి
స్థిరముగాఁ గీర్తి మందిరముగాఁ బుణ్య
కరముగా నవరసాకరముగాఁ జారు
తరముగా నర్థ సుందరముగా దురిత
హరముగా జన మనోహరముగా ననుచు
వినయ సత్క్రియలతో వేడ్కదీపింప
ఘనసార తాంబూలగంధాక్షతములు
మేలైన తొడవులు మేలు కట్నములు
మేలరి సభరెల్ల మెచ్చంగనిచ్చి
మము (నను)గారవించిన (నా)మాచిత్తమిపుడు
కమలా(వనజా)ప్తుఁ బొడగన్న కమలం(వనజ)బుఁబోలెఁ
గడలేని సంతోషకలశాబ్ధిలోన
వడినోలలాడితి వరహంసలీల
క్షితిఁ గీర్తిమెఱయ నేఁజెప్పెడికృతికిఁ
బతిరామలింగమై పరగుటవలన
జగదేకమాతకు సర్వమంగళకు
జగతిపై రెండవ సవతియుఁబోలె.
పరిమళ సంపద పసిఁడి చెంగల్వ
విరుల దండకు సంభవించినట్లయ్యె
ననుచు దేవాంగ వంశాబ్ధి చంద్రులకు
ననుపమ దీర్ఘాయురైశ్వర్య మహిమ
లొసఁగరి కీర్తిగా నొసఁగు తారుణ్య
హరిణాంకమౌళికి నాదిదేవునకుఁ
బరమహర్షంబుగాఁ బ్రాక్తన కావ్య

రచన దేవాంగ పురాణంబు వెలయ
రచియింతుఁ దత్కథారంభ మెట్లనిన.

**End:**

ధరణిపై నెవ్వరు దాసయ్య చరిత
సరవితో వ్రాసినఁ జదివిన వినిన
వారికి సిద్ధించు వరుసఁ బుణ్యములు
వారికి జయలక్ష్మి వఱలు సంతతులు.

* * * *

వరదాసమయ్య సద్వంశదీపకులు
వరకీర్తి దేవాంగ వంశవర్ధనులు
? పృథివంశ సుఖమహాఋషి గోత్ర ఘనులు
మదనారి భక్తులు మహాదేవికరుణ
వెలసె బుట్టచంద్ర వీరశేఖరుఁడు ?
కొలఁదికి మిక్కిలి గుణరత్నయశుఁడు
ముదమొప్పవెలసిన మూర్తెమ్మ నతఁడు
సదయుఁడై పెండ్లాడె సంతోషమలర

* * * *

కృష్ణనామాంకిత కృష్ణమ్మ నతఁడు
భీష్మసమానుని బిక్షుపుత్రకుని
హరుఁడు మెచ్చఁగఁగాంచె నతిప్రౌఢిమలర
స్థిర శివభక్తుఁడై చెలఁగుకృష్ణుండు
రాగమయను రత్నరమణిని జాల
బాగుగాఁ బెండ్లాడె భాగ్యశేఖరుఁడు

* * * *

చెన్నయధీరుఁడా చెన్నేంద్రసముని
నున్నతోన్నతపుత్రు నొనరఁ గాంచియును
బుత్రోత్సవముచేసె భూప్రజ లలర
ధాత్రిలోఁ జెన్నేంద్ర ధన్యుఁడు వెలసి
వరకీర్తిగలిగిన వల్లెమ్మనపుడు
స్థిరకీర్తిఘనుఁడు దాఁజెలఁగి పెండ్లాడి

* * * *

కోమరేంద్రధీరుని గుణరత్నఘనుని
నమరులుమెచ్చఁగా సతఁడునుగాంచె

* * * *

కోమరేంద్ర చంద్రుఁడు కోమరుగా నెదిగి
చముడేశ్వరీ మహాశక్తిని గొలిచి
లింగనామాంకిత లింగమ్మనపుడు
పొంగుచుఁ బెండ్లాడె బుణ్యశేఖరుఁడు

* * * *

కోమరుసా మనపేరఁ గోమరునిఁగాంచి
నమర పుత్రోత్సవం బమరఁగాఁజేసి
నిత్యాన్నదానాది నిర్మలగుణుఁడు
సత్యవాక్యప్రౌఢి చాలఁ గల్గియును
కవులకు భట్లకుఁ గరుణతో నితఁడు
(?)ఈవులిచ్చును జాలనిలదేవి మెచ్చ
కోమరుసామనుపుత్రకు మరుని కితఁడు
అమరఁ బెండ్లియుఁ జేయ నతి మోదమంది
భద్రేభగామిని భద్రమ్మ నపుడు
రుద్రానుమతిఁబెండ్లి రూఢిగా మెఱయఁ
జేయించి వేడుక సేయించె నపుడు
ప్రోయించె శ్రుతిఘోష ముదము మిక్కిలిగ

* * * *

ఇటు పూజ లొనరింప నితని స్వప్నమునఁ
దటుకున బసవేశు తావేగ వచ్చి
నాభక్తుఁడవు నీవు నాసహోదరుఁడ
భూభారమున నీవు పుణ్యుండ వగుచు
నూటపదేను(?) వత్సరములు చాల
ధాటిగా బ్రతుకుదు ధన్యచారిత్ర
అటుపిమ్మటను నీకు అమరులు మెచ్చ
దిట పుష్పరథము దేదీప్యమానముగ
రప్పించికొనిపోదు రాజస మొప్పఁ
దప్పక నాపలుకుఁ దామది నుంచు
మని తెల్పి బసవేశు మాయఁగాఁ జనియెఁ

గారికమీరఁగాఁ గొమరేంద్రఘనుఁడు
కూరిమిఁ దమయింటి వారికిఁ జెప్ప

*        *        *        *

ఇతని వంశజులు దా మిలలోనఁ జాల
మతిమంతులయి వీరు మదనారిఁ గొల్చి

*        *        *        *

దేవాంగకుల దివ్య దేదీప్యులగుచు
భూవినుతస్థులై పుణ్యాంబు లమరి
కొమరేంద్రు వంశ మీక్రమమునఁ జాల
సమరఁగా వెలసె నాచంద్రతారముగ
నని యిట్లు క్షేమేంద్రుఁ డమ్మునీంద్రులకు
వినిపింప సంతోష వివశాత్ములైరి.

**Colophon:**

అనిసర్వ వేదశాస్త్రవికోవిదులు
కనకాద్రి ధీరులు కందర్పనిభులు

*        *        *        *

మహిత పుణ్యులు జైనమానమర్దనులు
విహితాక్షర బ్రహ్మ విజ్ఞానపరులు

*        *        *        *

వరచరిత్రులు పంచవన్నె దీక్షాది
గురువులు గంభీరగుణ సముద్రములు
గర్విత శివదూషకరగండబిరుద
నిర్వాహకర్తలు సర్వజ్ఞమతులు
సుకవిమానస పద్మసూర్యోదయులును
నకుటిల సప్త జన్మావతారులును
పరహితార్థులు రామభద్రవిక్రములు
నిరుపమ కారుణ్య నిధులునునైన
దేవాంగవంశ ప్రదీపకులకును
భావించి సత్కృపాభరితులై సకల
సంకల్ప సిద్ధులు సరవి భావించి
శాంకరీపతిశేఖర సర్వేశుపేర

*        *        *        *

విశ్వనాయకుపేర వినుతత్ర్యంబార
కేశ్వరుపేర రామేశ్వరుపేర
? నిది వీరభద్ర మహాత్మ్యప్రసాద
విదిత సత్కావ్య ప్రవీణధురీణ
సంగమేశ్వర గురుచరణారవింద
సంగత గంధపుష్పంధ(ధా)యమాన
ఘన యశోనిధి భద్రకవిలింగధీర
వినుతమాధుర్య వాగ్విరచితంబైన
ప్రకట దేవాంగ పురాణంబునందు
నకలంకముగ సప్త మాశ్వాసమయ్యె.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు

ఏడాశ్వాసముల యీ ద్విపద గ్రంథము, బ్రహ్మాండ పురాణాంతర్గతమగు గ్రంథభాగమును బట్టి రచిత మయ్యెనట. ఇందలి ప్రథమాశ్వాసమున మను మహాముని యీశ్వరునకు దేవాంగఋషిగా జన్మించుటయు, దేవతాస్త్రముల నిర్మాణముచేయుటయు మొదలగు విషయములు వర్ణింపఁబడినవి. విద్యాధర పుష్పదంత బేతాళ వరరుచి, దివసాలి దేవరదాసి నామధేయములతో నతఁడు మఱి యాఱవతారముల నెత్తినాఁడట. ఆ యాఱవతారముల వృత్తాంతములును దక్కిన యాఱాశ్వాసములలోను వర్ణితములయినవి. ఈ యవతారములు ప్రాయికముగా ఇంద్రజాల రసవాద వైద్యాది విషయములను పెంపొందించుట ప్రయోజనముగా నేర్పడినట్లు గలదు. కడపటి యవతారము దేవాంగ కులమున నెత్తెనట. దేవరదాసి జైనులను ఖండించి శైవమును బెంపొందించెనట.

ఈ దేవరదాసి వంశ్యుఁడును, రామయ ప్రభుని కుమారుడును, సంగమేశ్వరగురుని శిష్యుఁడును, అగు భద్రకవి లింగకవి పడపేటి దేవాంగ ప్రభువుల కోరికపయి నీ గ్రంథము ముదునూరి రామేశ్వరస్వామి కంకితముగా రచియించెను. ఈ గ్రంథాంతమున కామరేంద్రుఁడను నొక దేవాంగుని వంశావతారము వర్ణింపఁబడినది.

## No. 950. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, paper. Size, 12⅜ × 7⅓ inches. Pages, 336. Lines, 15 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, good but not free from mistakes. Variations in the readings are interlined here and there.

Complete in five Āśvāsas.

A Telugu rendering in Dvipada metre, based on Cāmarasa's Prabhuliṅgalīle in the Kannada language, which describes the life of Allamaprabhu, one of the Vīraśaiva saints: by Piḍuparti Sōmana For other particulars regarding the author see the extracts given below.

The following note in the handwriting of C. P. Brown is found on the fly-leaf of the MS.:--

"The Prabhu Linga Lila With Various Readings found in several Manuscripts and recorded under the directions of C. P. Brown.

The text is here given according to the Edition prepared in 1839 by Narasimma Chari.

There is another copy of Narasima Chari's edition, the same size as this, and bound in white leather. In that one are inserted such new various Readings as were found in additional manuscripts subsequently obtained."

**Beginning:**

ద్వి. శ్రీవీరశైవ ప్రసిద్ధసిద్ధాంత
కోవిద శ్రీపాలకురికి సోమేశ

* * * *

ధారుణి శివభక్తిఁ దగనిల్పినట్టి
సారవీరాచార్య శరణార్థి మీకు.

* * * *

అల్లమప్రభురాయ హతమహామాయ
సల్లలితోపాయ శరణార్థి మీకు.

* * * *

రంగుగా భక్తుల రక్షించునట్టి
సంగన బసవయ్య శరణార్థి మీకు.

* * * *

పొంగుచుభక్తులఁ బ్రోచిన చెన్న
సంగన బసవన్న శరణార్థి మీకు.

* * * *

సిద్ధరామేశ ప్రసిద్ధప్రకాశ
శ్రద్ధతోఁజేయుదు శరణార్థి మీకు.

* * * *

అక్క మహాదేవియమ్మ సద్భక్తిఁ
జక్కఁగాఁజేయుదు శరణార్థి మీకు.

* * * *

వన్నెకెక్కిన మడివాలు మాచయ్య
సన్నుతగుణధుర్య శరణార్థిమీకు.

* * * *

అనిపిరిఁబ్రార్థించి యటుమీఁద మఱియు
మనసిజాంతకభక్తి మస్నుఁడైనట్టి
మరులు శంకరునకు మహిఁజాగి ప్రొక్కి
ధరఁ గిన్నెరయ్యకు దండంబువెట్టి
యేలేశు కేతయ్య నెలమిఁబ్రార్థించి
కాలారిఁ గాణాద కన్నప్పఁబొగడి

* * * *

సకలశాస్త్ర పురాణ సమ్మతిగాఁగ
నొక శివకథఁ జెప్పనున్న యుత్తఱిని
నగరసప్తకములోనఁ బ్రసిద్ధమైన
నగరంబు కాంచికానగర మాపురిని
మహిఁనీడ నెల్ల ధర్మద్రావిళాఖ్య
వహికెక్కఁగా ధర్మవాణిజ్యసరణి

* * * *

కఱకంఠు భక్తుల కరుణగన్నట్టి
చిఱుతొండనంబి విశిష్ట వంశజుఁడు

* * * *

అసదృశజ్ఞాన క్రియాశక్తిభక్తి
రసికుండు నెల్లూరి రామలింగయ్య
నన్నురప్పించి మన్నన గారవించి
యున్నతాసనమున నుంచి పెద్దర్తి

సోమయదేవ విశుద్ధస్వభావ
శ్రీమన్మహాదేవ సేవానుభావ
కులగురుండగు పాలకురికి సోమేశుఁ
డెలమిఁజెప్పిన కృతు లిల వెలయించి
భవదీయ జనకుండు బసవనార్యుండు
సవిశేషభావ దీక్షాబోధఁ జెప్పె
బసవ పురాణంబు పద్యకావ్యముగ
రసికులౌననఁగ మీరలు చేసినారు.

* * * *

ప్రభులింగలీలకుఁబ్రతి చెప్ప నరిది
యభవు భక్తులస్థితి కది యాలవాలము

* * * *

కలితకర్ణాటక కావ్యంబుగానఁ
దెలియ దెవ్వరికిని దెనుఁగునమీరు
శుద్ధసంవిద్రూప శోభితుండైన
సిద్ధ వీరేశ దేశిక చక్రవర్తి

* * * *

మద్గురుస్వామికి మహిత ధీనిధికి
సద్గతిప్రదునకు సహజ కీర్తనున
కంకితంబుగ ద్విపదాభిరామముగ
శంకరుభక్తులు సంతోష మంద
నానతీయుండు నా కభిమత మనిన
వీనుల విందుగా విని ముదంబంది

* * * *

పతిభక్తియును శివభక్తియు వ్రతము
నతిభక్తి నడపెడు నాతిరువమ్మ
కును మీకు మీపెద్దగురువు ధీనిధికిఁ
జినగురువప్పకు సిద్ధ వీరయకు
మనుతుల్యుఁడైన నమశ్శివాయకును
ఘనసత్త్వ జితహస్తి కాళహస్తికిని

* * * *

హరుపంచముఖములలో యనుతనూజులకు
హరుని దీక్ష లొసంగి . . . .

* * * *

నినుఁగృతార్థునిఁజేసె నీగురుస్వామి
నను గృతార్థునిఁజేయనా గురుస్తుతికి
సమకొల్పితివి నన్ను సద్గుణపుత్ర
రమణీయ గుణధుర్య రామలింగయ్య.

* * * *

అల్లమ ప్రభురాయఁ డతని మాహాత్మ్య
మెల్లఁజామరు సిర్వదేవు సద్గతులఁ
గన్నడభాషచేఁ గావ్యంబుచేసె
సన్నుత సద్భక్తసభలందు వెలయ
నది తెనింగించుటే నందు నేమైనఁ
గొదువ గల్గినఁ దీర్చుకొనుఁడు సజ్జనులు.

* * * *

కారణపురుషుండు గతకల్మషుండు
వారణాశయ్య పర్వపయతీంద్రుండు
భక్తహితార్థమై ప్రభులింగలీల
యుక్తి యుక్తంబుగా నాకరింపుఁజేము
చదివి యర్థముచెప్పి సద్భక్తసభల
నది ప్రసిద్ధముచేతు మగు ముదమంది

* * * *

బసవనయ్యను మహాప్రభులింగలీల
కడఁగితిఁజెప్ప నాఘనగురుండైన
సిద్ధవీరేశ్వర శ్రీగురుస్వామి
యుద్ధకథాక్రమం బెట్టిదియనిన

* * * *

తళుకొత్తఁగా నవ్యో దక్షిణామూర్తి

* * * *

ఆదేవదేవుండె యవనిభక్తులను
నాదరంబునఁ బ్రోవ ననుకంప వొడమి

* * * *

సిద్ధుఁడై యిష్టార్థ సిద్ధుల నొసఁగ
సిద్ధపీఠేశుఁడై క్షితిమీఁద నిలిచె

* * * *

పరవాదులగు జైన బౌద్ధచార్వాక
నరకీటకముల కందని ప్రమానివంఁడు
పరమశివాచార పట్టభద్రులకు
గరిమతోఁ దమగాఁడిఁ గట్టినసురభి
జైనమస్తకశూల సాహసాంకుండు
మానవబిజ్జల మానమర్దనుఁడు
ఇటువంటి గుణముల నేపారుయతికిఁ
బటుభక్తిరతశిష్యపాలనగతికి
సిద్ధపీఠేశ్వర శ్రీదేశికునకు
శ్రద్ధతోడుత నమస్కారంబుచేసి
యాకాంక్షతోడఁ జేయఁగఁబూనినట్టి
యీ కథావృత్తాంతమిది యెట్టిదనిన

* * * *

**End:**

ఇరువదేనవగతి యీ గతిఁ బ్రభువు
చరిత మీశుఁడు గిరిజకు నానతిచ్చె
సదమలపదవేదిచామరసాదిఁ
బదములు వెయినూట పదునాకొ(క)ండింటి
బ్రభులింగలీల నిర్వదియేనుగతుల
నభినవంబుగఁ జెప్పెనది తెనుంగునను
బిడుపర్తిసోమయాభిధుఁడఁ జెప్పితిని
బుడమి భక్తుల కర్థములు తేటపడఁగ
నీకృతిఁ జదివిన నీకృతివిన్న
నీకృతి వ్రాసిన నీప్సితార్థముల
నరసేనిక్కృపనిచ్చు నల్లమప్రభువు
ధరణిలో నాచంద్రతారార్కముగను
పంచభూతవికార పరిహారలీల
పంచాక్షరీమంత్రపఠనైకశీల
పంచేంద్రియాతీతభావనపాత్ర
పంచముద్రాంచిత పరిపూర్ణగాత్ర

శ్రీమద్గుణోత్సంగ చిన్మయాపాంగ
రామలింగయ మనోరాజీవభృంగ
శ్రద్ధానుబద్ధశిష్యజనానుషంగ
సిద్ధవిశ్వేశ్వర శ్రీగురులింగ

**Colophon:**

ఇది పాలకురికిసోమేశ ప్రసాద
విదితాష్టభాషాకవిత్వప్రవీణ
భామిత్రపిడుపర్తి బసవేశపుత్త్ర
సోమయదేవాఖ్య సుకవీంద్రముఖ్య
ఫణితమై విలసిల్లు ప్రభులింగలీల
ననుపమంబుగఁ బంచమాశ్వాసమయ్యె ॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. ఆదిని 91 కాగితముల మీఁద ఒక్కొక్క పాద మొక్కొక్క బంతిగా వ్రాయఁబడినవి. తర్వాత ద్విపద మొక్కొక్క బంతిగా వ్రాయఁబడెను. అనేక తాళపత్త్రప్రతుల పాఠములు బంతుల నడుమఁ జేర్పఁబడినవి. విడి కాగితములమీఁదఁగూడఁ గొన్ని పాఠములు వ్రాసి నడుమ నదికింపఁబడినవి. ఈ ప్రతి 1839 వ సం॥ నరసింహాచారి వ్రాసిన ప్రతి ననుసరించి వ్రాయఁబడినదనియు నరసింహాచారి వ్రాసిన ప్రతి యింకొకటిగూడఁగలదనియు దానిలో ననంతరము క్రొత్తగా దొరకిన ప్రతులలోని పాఠములు మాత్రమే చేర్పఁబడిన వనియు బ్రౌను దొరగారు పుస్తకారంభమున వ్రాసిరి.

అల్లమ ప్రభువను శైవాచార్యుని చరిత్రము ప్రధానముగాను నింక నితర శైవాచార్యుల చరిత్రము లనుప్రసక్తములుగాను నిందు వర్ణితము లైనవి. చామరసు అను కన్నడకవి కన్నడభాషలో రచియించిన గ్రంథము ననుసరించి పిడుపర్తి సోమనకవి దీనిని తెలుఁగున ద్విపదగా రచియించెను. కవినిగూర్చి విశేషముల కుదాహృత గ్రంథ భాగములఁ జూచునది.

---

## No. 951. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, paper. Size, 12¾ × 8½ inches. Pages, 354. Lines, 20 in a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Written on the left side of the pages, on the right side corrections and alterations are noted.

English notes and appendices by C.P. Brown are found at the end of the work

Complete.

Same work as the above

The following note in the hand of C. P. Brown is found on the fly-leaf of the MS. :—

"THE

Prabhu Linga Līla

A new Edition revised, corrected, and illustrated under the directions of Charles Philip Brown,

Madras 1839.

This volume is peculiarly well adapted to the use of those who are beginning the study of Telugu—It was written about A D 1600.

The author is greatly venerated as a Teacher or guide of the Zangamas or Dhīra Saivas, a sort of Puritans : who renounce the worship of Vishnu or Krishna, rejecting all the Puranas ; and are in consequence held in abhorrence by the Bramins.

A mystic quietism appears to be the great end of this creed —

The words interlined in this copy are various readings found in a manuscript lately procured—Oct. 1840."

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పు లున్నవి. వ్రాఁత కాగితమున నొక ప్రక్కనే కలదు. వ్రాఁత లేని పుటలందు సంస్కారములు సూచింపఁబడినవి. ఈ శుద్ధప్రతిని తాము 1839 వ సంవత్సరములో వ్రాయించితి మనియును, 1840 వ సంవత్సరము అక్టోబరులో మరొక ప్రతి దొరకుటచే నందలి పాఠ భేదము లిందు బంతుల నడుమఁ జేర్పఁబడినవనియు, నిది 1600 ప్రాంతముల రచింపఁబడి యుండవచ్చుననియు దొరగారు వ్రాసిరి. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

ఈ గ్రంథ విషయసూచిక పుస్తకాంతమం దాంధ్రాంగ్లేయముల లోనీఁ బడియున్నది. తెనుఁగు 34 పుటల గ్రంథము; 179 వ పత్రములో దానియారంభమున్నది. ఆంగ్లేయము 31 పుటల గ్రంథము; 203 వ పత్రములో దానియాంగరభమున్నది. ఈ రెండిటికిని నడుమ 196 వ పత్రమునందలిటిప్పణిగాక 197 వ పత్రమున నారబ్ధమై యీ గ్రంథ తృతీయాశ్వాసములోని యొక భాగమునకు 6 పుటలు వ్యాపించిన

పద్యాత్మకముగ నాంగ్లేయ భాషాంతరీకరణము వ్రాయఁబడియున్నది. ఈ పద్యములు బ్రౌను దొరగారు వ్రాసియుందురు.

పూర్వమువలె.

---

No 952. ప్రభులింగలీల.

PRABHULIṄGALĪLA.

Substance, paper. Size, $11\frac{7}{8} \times 8\frac{1}{4}$ inches. Pages, 352. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair, Appearance, old. Mode of writing, good but not free from mistakes.

The variations in the readings are noted in the margin. English notes by C. P. Brown are also found here and there. It is stated that this edition was prepared in 1839 A D by Cilakamarra Narasimhācāri at the instance of C. P. Brown. At the end of the MS. there are 38 pages containing the index and analysis of the work, in English language by C. P. Brown.

Complete.

Same work as the above.

In the beginning of the work there are eight eulogistic stanzas in Sanskrit language addressed to god Dakṣiṇāmūrti and attributed to Śaṅkarācāya (?)

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పులును గలవు. అక్కడక్కడ సంస్కారములు, లఘుటిప్పణులుగూడఁ గలవు. కొన్నిచోట్ల బ్రౌను దొరగారి యింగ్లీషు టీక గూడఁగలదు. ఈ ప్రతిని చిలకమఱ్ఱి నరసింహాచారి 1839 వ సంవత్సరములో దమ యాజ్ఞానుసారముగా వ్రాసెనని బ్రౌను దొరగారు వ్రాసిరి.

పూర్వమువలె.

ఈ గ్రంథము విషయసూచిక గ్రంథాంతమందు తెనుఁగు, ఇంగ్లీషు భాషలలో వ్రాయఁబడినది. తెనుఁగు 38 పుటలు గలవు. ఇంగ్లీషు 30 పుటలు గలవు. గ్రంథారంభ మందొక పత్రమున దక్షిణామూర్తి స్తుతి శ్లోకములు 8 గలవు.

## No. 953. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, paper Size, 11⅝ × 7 inches Pages, 387. Lines, 20 on a page. Character, Telugu Condition, injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes. The variations in the reading are interlined.

Complete.

Same work as the above.

The following note of C P. Brown is found on the 1st page of the MS. :—

"The Prabhu Linga Lila.

A Telugu poem useful to beginners in the language.

The present copy contains the various readings found in five manuscripts in my possession.

The author, Piduparti Somaya is believed to have lived about three centuries ago. But there are reasons to believe it still more ancient For the author names neither Nannaya nor his celebrated assistants—as is customary in modern times. The "Deccan poets" make no mention of this book or its author.

This poet was the pupil of పాలుకురికి సోమనాథ who wrote the ద్విపద బసవ పురాణం and the పండితారాధ్య చరిత్ర ద్విపద and who one would suppose was an ఆరాధ్య Bramin—but Somaya seems to be a Sudra—perhaps a Mudeleai—he says his guru was named పండితారాధ్యుడు."

(ఖ-ఖ.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లెక్కువ. పాఠభేదములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. అవి కొన్ని వేఱుగా కాగితపుఁ దునుకలమీఁద వ్రాయఁబడి నడుమ నడుమ నదికింపఁబడియు నున్నవి. ఈ ప్రతిలో నైదు ప్రతులలోని పాఠభేదము లెక్కింపఁబడినవనియు, 1839 వ సం॥ వ్రాయింపఁబడిన శుద్ధ ప్రతి కిది మాతృక యనియు బ్రౌను దొరగారు వ్రాసియున్నారు. పుస్తకము పురుగు తినినది. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

## No. 954. ప్రభులింగలీల, సటీకము.

## PRABHULIṄGALĪLA WITH COMMENTARY.

Substance, paper. Size, 10⅜ × 7⅞ inches. Pages, 1,133. Lines, 18 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Complete in two volumes.

Same work as the above, but also contains a commentary.

The following note is found at the end of Vlume II.

"This commentary was completed on 22nd June 1842. C. P. Brown."

(వి-వి.)—

సమగ్రము. రెండు సంపుటములు గలవు. వ్రాఁత మంచిది. తప్పులు లేకపోలేదు. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

ఈ వ్యాఖ్యానము 1842 వ సం॥ జూన్ 22 వ తేది నాఁటికి ముగింపఁబడినట్లు బ్రౌను దొరగారు వ్రాసిరి.

---

## No. 955. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA

Substance, paper. Size, 9 × 7¼ inches. Pages, 211. Lines, 22 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Begins on fol. 148*a*. The other works herein are Palnāṭivīra caritra 1, Bālunikatha 86, Kommarājuyuddhamu 120.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

ఇందు 1*a*. పల్నాటి వీరచరిత్ర, బాలుని కథ 86*b* డిటో (బాలుని కథ) 120*a* డిటో కొమ్మరాజు యుద్ధము, గలవు.

## No. 956. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA

Substance, palm-leaf. Size, 16⅞ × 1⅝ inches. Pages, 185. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Complete, but imperfect.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు, గలవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దిట్లు గలదు:—

"క్రోధినామ సంవత్సర జ్యేష్ఠ బ ౬ బు॥ ప్రభులింగ లీల కాంజ రామలింగం రావులపట్టిసం ప్రతినున్న క్రమాన వ్రాశ్నిది. ప్రతి నున్న క్రమాన యితని మనములు యీా వీరమల్లు వ్రాశెను."

---

## No. 957. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, palm-leaf. Size, 16¼ × 1½ inches. Pages, 128 Lines, 9 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes and breaks off in some places.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము, అక్కడక్కడ చిన్నచిన్న గ్రంథపాతములును గలవు.

పూర్వమువోలె.

---

## No. 958. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, paper. Size, 10¼ × 7¼ inches. Pages, 132. Lines, 28 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes and breaks off in some places.

Incomplete.
Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. మొదటి యాఱుగతులు లేవు. వ్రాఁత యొక మాదిరిగా నున్నది. తప్పులున్నవి. శైథిల్య మల్పముగాఁ గలదు. గ్రంథపాతములును అల్పముగాఁ గలవు.

పూర్వమువలె.

---

## No. 959. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, palm-leaf. Size, $17\frac{1}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 320. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete, but imperfect.
Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే కాని తప్పులెక్కువగా నున్నవి. శైథిల్యమును గ్రంథపాతములును మిక్కిలి యెక్కువగాఁ గలవు.

పూర్వమువలె.

---

## No. 960. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, paper. Size, $12\frac{3}{8} \times 8$ inches. Pages, 44. Lines, 21 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, very good but not free from mistakes.

Incomplete.
Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండి తృతీయగతిలోఁ గొంతదాఁకఁ గలదు. వ్రాఁత చక్కనిది. తప్పులును గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

## No 961. ప్రభులింగలీల.

## PRABHULIṄGALĪLA.

Substance, palm-leaf. Size, 14¼ × 1⅝ inches. Pages, 256. Lines, 6 on a page. Character, Telugu Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete in five Āśvāsas.

Same work as the above

Date of transcription—Monday, the 2nd day of the dark fortnight of the lunar month Kārttika in the year Raudrin. Name of the scribe—Hanumayya who copied for Ayyanna.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చకరానిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు నల్పముగాఁ గలవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దిట్లుగలదు :—

" రౌద్రి సంవత్సర కార్తిక బ ౨ సో॥ వరకు యాడరపిల్లి హనుమయ్య గుమ్మడి అయ్యన్నకు . . . . వ్రాశియిచ్చెను ॥ "

---

## No. 962. ప్రభులింగలీల, సటీకము.

## PRABHULIṄGALĪLA WITH COMMENTARY.

Substance, paper. Size, 12⅝ × 8 inches. Pages, 650. Lines, 25 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, good but not free from mistakes. The variations in reading are interlined here and there.

Same work as that described under No. 954 ante and also contains a commentary by Vīrabhadrayya which was written at the instance of C. P. Brown.

Completed on 19th July 1842

**Beginning:**

ద్వి॥ శ్రీవీరశైవ ప్రసిద్ధ సిద్ధాంత.

టీ॥ శ్రీ సంపత్కరమైన । వీర । వికల్పరహితమైన । శైవ । శివ సంబంధమైన మతమందలి । ప్రసిద్ధ । మిక్కిలి రూఢమైనటువంటి । సిద్ధాంత । నిర్ణయించబడిన దాన్ని ఆశాస్త్రమును ॥

ద్వి॥ కోవిద శ్రీపాలకురికి సోమేశ.

టీ॥ కోవిద। తెలిసినటువంటివిన్నా। శ్రీ। శోభాయుక్తమైనటువంటి। పాలకురికి। పాలకురికి అనే గ్రామమందలి నివాసము చేయుచున్నటువంటి। సోమేశ। సోమేశ్వరుడనే పేరుగలవాడా॥

**End :**

ద్వి॥ ని (ఇ) రువదేనవగతి యీగతిప్ర(ఁబ్ర)భువు.

టీ॥ యిరువదేనువగతి। యిరువై అయిదోగతి। యీగతి। ప్రభువు చరితము। అల్లమ చరితము।

ద్వి॥ చరితమీశుండు గిరిజకునానతిచ్చె.

టీ॥ యీశుడు। శివుడు। గిరిజకును। పార్వతికిని। ఆనతిచ్చె। పలికెను॥

**Colophon :**

సామాది వేదాది సామరస్యాది
సదమలపదవేది చామరసాదిఁ
పదములు వెయినూట పదనాఱొండింటఁ
ప్రభులింగలీల యిర్వదియేనుగతుల
నభినవంబుగఁ జెప్పినది తెనుంగునను
పిడుపర్తి సోమయాభిధుఁడఁ జెప్పితిని
బుడమి భక్తుల కర్థములు తేటపడఁగ

* * * *

ఫణితమైవిలసిల్లు ప్రభులింగలీల
ననుపమంబుగఁ బంచమాశ్వాసమయ్యె॥

"This commentary was completed 10th July 1842. This copy was completed 19th July 1842." The above notes in pencil appear at the close of the work. In the original of this copy the commentary is said to have been completed on 22nd June 1842.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. అక్కడక్కడ సంస్కారములు వ్రాయఁబడినవి.

ఇది 1842 జూలై 19 తేదికి ముగిసినదట.

ఇది నె 954 రున వర్ణితమైనదే. కాని యిందు బ్రౌను దొరగారు పిరభద్రయ్యయను వారిచే వ్రాయించిన టీకయుఁగలదు.

## No. 963. బసవచరిత్ర.

## BASAVACARITRA.

Substance, palm-leaf. Size, 11¼ × 1¼ inches. Pages, 366. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Incomplete and imperfect

Same work as that described under R. No. 556 of the Triennial Catalogue of Telugu MSS, Vol III, Part III. The author Baccu Siddha Kavi was initiated into the Śaiva religion by Śirupūri Vīrasaṅgaya and so this work has been dedicated to the above mentioned Vīrasaṅgaya. For other particulars see the extracts given under R. No 556. Date of transcription—10th day of the bright fortnight of the lunar month Vaiśākha in the year Śrīmukha Name of the scribe—Ciṭṭaliṅgaya.

(వి-వి.)—

సమగ్రము. కాని గ్రంథపాతము లమితముగా నుండుటచేతఁ కొన్ని పట్టులు లోపించినవి. ఉన్న యాకులును మిక్కిలి శిథిలములు. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి.

ఇది వీరశైవ మత ప్రవర్తకుఁడయిన బసవేశ్వరుని మాహాత్మ్యమును వర్ణించు గ్రంథము. ఇతర భక్తుల కథలు నిందుఁగలవు. ఇది పాల్కురికి సోమనాథుని బసవపురాణమును బోలినదే. అందలి విషయములు గాక మఱికొన్ని విషయములుగూడఁ జెప్పుటచేఁ గాఁబోలును దీనికి మఱి బసవపురాణమని పేరయ్యెను.

ఇది ఆర్. నె 556 రున వర్ణితమైన గ్రంథమే. విశేషవిషయము లక్కడ చూచునది.

గ్రంథాంతమున నీ వ్రాఁతగలదు :—

"శ్రీముఖనామసంవత్సర వైశాఖ శుద్ధ ౧౦ శెనరకు తాళ భక్తుని శకక్కయకు బొల్లా . . జొ చిట్టయలింగ వ్రశియిచ్చెను."

---

## No. 964. బసవపురాణము.

## BASAVAPURĀṆAMU.

Substance, paper. Size, 12 × 7½ inches. Pages, 614. Lines, 21 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Complete.

Same work as that described under R. No. 156 of the Triennial Catalogue of Telugu MSS., Vol. II. By Pālkuriki Sōmanātha.

For other particulars see the extracts given below.

At the end of the work there are 122 pages which contain the narration of the story in prose followed by 161 pages containing the English rendering of the same by C. P. Brown.

**Beginning :**

ద్విపద॥ శ్రీగురుదేవు నంచితగుణోత్తంసు
యోగీంద్రహృదయ పయోజాత హంసు

* * * *

మన్మనోరమ్ము నిర్మలభావగమ్ముఁ
జిన్మయుసోమ్ము భజించి కీర్తించి
యుల్లమున మదీయ వల్లభుఁ జెన్న
మల్లికార్జునదేవుఁ జెల్లఁగా నిలిపి

* * * *

బసవచరిత్ర యివ్వసుమతిలోనఁ
బసరింతుఁ దత్కథాప్రౌఢి యెట్లనిన

* * * *

సకలతీర్థములకు జనయిత్రి యగుచుఁ
బ్రకటింప నొప్పు శ్రీపర్వతేంద్రంబు
నుర్విఁ దత్పర్వత సార్వభౌమునకుఁ
బూర్వవక్త్రాంక విస్ఫురణఁ దోలాడ
నొలసి కుమార శైలోత్తంసులీలఁ
దిలకించి పెంపారుఁ ద్రిపురాంతకంబు
తత్త్రిపురాంతకస్థాన వాస్తవ్యుఁ
డై త్రిపురాంతకుం డభినుతిఁ బేర్చు

* * * *

విలసితపరమసంవిత్సుఖాంభోధి
నలిఁ గరస్థలి సోమనాథయ్యగారు
బసవనికారుణ్య రససుధావార్ధి
నసదృశలీల నోలాడుచు నిత్య
నియమవ్రతాధికనిరుపమనిష్ఠ
క్రియగొనఁ దత్త్వ నిర్ణయముసంధిల్ల

నతులితగోష్ఠి సుఖాస్థితిఁ బేర్చు
మతి నియమంబుల మల్లినాథుఁడును

* * * *

అనలారఁగాఁ గుమారాద్రికిం ధూర్పు
దెసను సోపానము ల్దీర్చి పాల్పారు
మహితసద్భక్తి సమంచితవృత్తి
మహిఁ జను రెంటాల మల్లినాథుఁడును

* * * *

ఒక్కనాఁడొక పువ్వు దక్కువయైన
గ్రక్కునఁ దన నేత్ర కమలమర్పించి
భవునిచే నసదృశాంబకమ్మైవడసి
ధ్రువకీర్తిఁ బేర్కొన్న దోచమాంబయును
ధీరుండు మొన్నయ దేవయోగీశు
కూరిమిశిష్యుండు నారయాంకునకుఁ
బుత్రుండు పరమపవిత్రుండు విమల
గాత్రాంచితుఁడు నీలకంఠాగ్రజుండు
జగదభినుతుఁడు ప్రసాదావధాని
నిగమార్థవేత్త గోడగి త్రిపురారి
లోనుగా సకలభక్తానీక మెలమి
మానితభక్తి సామ్రాజ్య సంపదల
జిలిబిలివోవంగఁ జిరతరమహిమ
నలరారుచుండంగ నందొక్కనాఁడు

* * * *

అసదృశంబైయొప్పు బసవపురాణ
మెసకంబుతోఁ జెప్ప నిష్ట మయ్యెడిని
వరకథాసూత్రంబు వెర వెఱిఁగించి
చరితార్థుఁ జేయరే కరుణతో ననుచు
సన్నుతిసేయుచు సస్పృహత్వమున
విన్నవించుడు భక్తవితతి హర్షించి

* * * *

బసవపురాణంబుఁ బచరించుశక్తి
నసలార నాసఁగితి మట్లుగావునను

రచియింపు బసవపురాణంబు నీవు
అచలితభక్తహితార్థంబుగాఁగ
నావుడు భక్తజనావలియాజ్ఞ
వావిరిఁ దలమోఁచి వర్ణింతుఁగవిత
పాటింపఁదగిన కర్ణాటభూమికిని
గోటీరమై యొప్పు గొబ్బూ రనంగ
నాయగ్రహార మహాజనోత్తమని
కాయపూజిత పాద కమలద్వయుండు

* * * *

అనివినుతింపంగ నాశ్చర్యమహిమ
మనుచుండుమండెంగమాది రాజనఁగ
నా మహాత్మునిసముద్య త్కృపాపూరి
తామృతహస్త కృతావతారుండు

* * * *

గురుపరతంత్రుండు గొబ్బూరి విభుఁడు
పరమశివాచార పథవర్తనుండు
లింగైక్యనిష్ఠావిలీన మానసుఁడు
సంగనామాత్యుండు జగదుపకారి
యనియిట్లు భక్తసభాభ్యంతరాళ
మున నన్నుఁ జెప్పంగ విని లసత్ప్రీతి

* * * *

అచలితప్రీతి మా కనుగులంబనియు
రచియింతు బసవపురాణసత్కవిత
నవధానవంతుఁడవై నెమ్మి బినుము
సవిశేషభక్తిమై సంగనామాత్య

* * * *

భ్రాజిష్ణుఁడగు విష్ణురామిదేవుండుఁ
దేజిష్ణువగు శ్రియాదేవియమ్మయును
గారవింపఁగ నొప్పుగాదిలిసుతుఁడ
వీరమాహేశ్వరాచారవ్రతుండ

ఖ్యాతసద్భక్తిమైఁ గల గంటుగూరి
పోతిదేవుని పదాంబుజ షట్పదుండ
సత్కృత్యుఁడగు కరస్థలమువిశ్వేశు
ప్రకట వరప్రసాద కవిత్వయుతుఁ(డ)
వడుగామ రామేశువర శిష్యుఁడనఁగ
బడుచెన్నరాముని ప్రాణసఖుండ

* * * *

నలిఁబాలుకూరికి సోమనాథుఁ డనంగ
వెలసినవాఁడ నిర్మలచరిత్రుండ

* * * *

చర్చింపఁగా సర్వ సామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలుకోర్కి దైవాఱ

* * * *

అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయొకడా కవివివేకంబు

* * * *

ఆతత బసవపురాతనభక్త
గీతార్థ సమితి యె మాతృకగాఁగఁ
బూరితంబైయొప్పు పూసలలోని
దారంబుక్రియఁ బురాతనభక్తవితతి
చరితలలోపల సంధిల్లు బసవ
చరిత మేవర్ణింతు సతత్ప్రీతియనఁగ

* * * *

భవనిర్మితంబైన పత్రపుష్పములు
భవునకుఁ దగ సమర్పణసేయునట్లు
గాక కీర్తింతు నాఁగా నాతరంబె
ప్రాకటంబుగభక్తి(క్త ?) బండారిచరిత
మైనను భక్తిహితార్థంబుగాఁగ
నానేర్చు భంగి వర్ణనసేయువాఁడ

* * * *

శ్రీకీర్తి సంచితాంచిత వీరభక్తి
సాకార వినమితామాత్యసంగాఖ్య

**End:**

బసవపురాణంబుఁ బాటించి వినిన
నెసఁగ నెప్పుడుఁ గల్గు నీప్సితార్థములు
బసవపురాణంబు భక్తి వ్రాయించి
వసతిగాఁ జదివెడి వారల కెల్ల
దురితము లాపదల్ ద్రోహములెల్ల
హరియించునెంతయు హరుకృపంజేసి
యీపురాణం బెవ్వరేఁ దమయింట
నేపార నిడుకొన్న నిహపరసిద్ధి

*　　　*　　　*　　　*

శరణోపకార బసవపురాణార్థ
సరససమంచిత సత్యవాగ్జాల
గొబ్బూరిమాదణ్ణ సూరిమిశిష్య
గొబ్బూరి సంగ సద్గుణ సముత్తుంగ ॥

**Colophon:**

ఇది యసంఖ్యాత మాహేశ్వరదివ్య
పదపద్మసౌరభ భ్రమరాయమాణ
జంగమలింగ ప్రసాదోపభోగ
సంగత సుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాల్కురికి సోమనాథార్య
సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగ ఘనకరస్థలి విశ్వనాథ
వరకృపాంచితకవిత్వస్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణ మను కథయందు
ననుపమంబగు సప్తమాశ్వాస మయ్యె

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. ఇది చిత్తుప్రతులనుజూచి వ్రాయఁబడిన సాఫు ప్రతి. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

వీరశైవమత ప్రతిష్ఠాపకుఁ డగు బసవేశ్వరునిచరిత్ర మీ యేడాశ్వాసముల ద్విపద గ్రంథమున వర్ణింపఁబడినది. అనుప్రసక్తముగా

నిం దింక ననేకశివభక్తుల యుపాఖ్యానములు వర్ణితము లయ్యెను. పా లుకురికి సోమనాథుఁ డీగ్రంథమును రచియించెను. పండితారాధ్య చరిత్రాదు లీతని యితర గ్రంథములు. విశేష విషయముల కుదాహృత గ్రంథభాగములఁ జూచునది.

గ్రంథాంతమున 308 పత్రమునుండి గ్రంథము విషయసూచిక తెల్గు వచనమున వ్రాయఁబడియున్నది. ఇది 122 పుటల గ్రంథము.

దీని తరువాత దీనికి బ్రౌనుదొరగారు చేసిన యింగ్లీషు తర్జిమా బ్రౌనుదొరగారి స్వహస్తాక్షరితో వ్రాయఁబడినది. ఈ తర్జిమా 374 పత్రమునుండి 161 పుటలు గలదు.

---

No. 965. బసవపురాణము.

BASAVAPURĀṆAMU.

**Substance, paper. Size, 13⅜ × 9¼ inches. Pages, 184. Lines, 22 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, not bad but full of mistakes.**

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. కడపటి రెండాశ్వాసములును గలవు. అందును షష్ఠాశ్వాసారంభమందును గొంత గ్రంథభాగము లేదు. వ్రాఁత లేని వైపులం దధిక పాఠములు చేర్పఁబడినవి. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి.

పూర్వమువలెనె.

---

No. 966. బసవపురాణము.

BASAVAPURĀṆAMU.

**Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 54. Lines, 7 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good and free from mistakes.**

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అద్యంతములు లేని కొంత భాగము మాత్రముగలదు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలెనె.

## No. 967. బసవపురాణము.

## BASAVAPURĀṆAMU.

Substance, palm-leaf. Size, $17\frac{1}{2} \times 1\frac{5}{8}$ inches. Pages, 353. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

Date of transcription—Monday, the 11th day of the dark fortnight of the lunar month Puṣya in the year Sarvajit. Name of the scribe—Śrīśailam.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథ పాతములు గలవు.

పూర్వమువలె.

గ్రంథాంతమున నీవ్రాంతగలదు :—

"సర్వజితునామ సంవ్వత్సర పుష్యబ ౧౧ సోమవారం గోలిశ్రీశైలం స్వహస్తంగా వ్రాసుకున్న బసవపురాణం."

---

## No. 968. బసవపురాణము.

## BASAVAPURĀṆAMU.

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{3}{4}$ inches. Pages, 627. Lines, 21 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

The following note by C. P. Brown is found at the beginnig of the work :—

"The Basava Puranam in Dwipada.

New Edition—revised and corrected 1840—

with a summary of the Contents written in Telugu and in English."

At the end of the English summary the following note is found :—
"Translated by C. P. Brown —7th November 1839."

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మిక్కిలి చక్కఁగానున్నదిగాని యంత నిర్దుష్టముగాదు. మూల ప్రతి లేఖనము 1839 వ సం॥ అక్టోబరు 5 వ తేది యాప్రాంతముల ముగిసినట్లున్నది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

ఈ మూలము ముగిసిన తరువాత 315 వ పత్రము మొదటి వైపున నారంభించి గ్రంథ విషయసూచిక యాంధ్రమున వ్రాయఁబడియున్నది ; ఇది 134 పుటల గ్రంథము.

దీనితరువాత దీనికి బ్రౌనుదొరగారు చేసిన యాంగ్లేయ భాషాంతరీకరణము వ్రాయఁబడియున్నది. ఈ భాషాంతరీకరణము 321 వ పత్రము మొదటి వైపున నుండి 160 పుటలు వ్యాపించియున్నది. ఇది 1839 వ సం॥ నవంబరు నెల 7 వ తేది నాటికిది సమాప్తమైనట్లు వ్రాయఁబడియున్నదిగాని యీ తిథి మాతృకకు సంబంధించినదే కాని దీనిది కాదు; మాతృకానుసారమిందు వ్రాయఁబడియున్నది.

---

## No. 969. బసవపురాణము.

## BASAVAPURĀṆAMU.

Substance, paper. Size, 12¾ × 9¾ inches. Pages, 627. Lines, 21 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. The variations in reading are noted in the margin.

Complete.

Same work as the above.

The following note by C. P. Brown is found at the beginning of the work :—

"The Basava Puranam
or
Collection of Legends
in honor of Basava, the Founder of the Vira Saiva Creed
professed by the Jangams.

A new Edition prepared under the directions of C. P. Brown 1840.

To which is subjoined an English summary of the contents Vide Essay on the Jangam Literature in the Madras Journal for 1840."

At the end of the text the following note is found :

"This Edition was completed and the fair copy made at Madras 20th September 1839."

At the end of the MS. the date of the MS. is given thus :—

"Translated by C. P. Brown 7th November 1839."

(వి-వి.)——

సమగ్రము. మాతృకలోని పాఠభేదములలో నిర్దుష్టములగు యెంచఁబడినవి మాత్రమిందు గ్రహింపఁబడినవి. ఇందును అనేక సంస్కారము లక్కడక్కడఁ జేయఁబడియున్నవి. ప్రతి పుట పార్శ్వమందును ఆయా పుటలయందలి విషయము సంగ్రహముగా నాంధ్రముననే వ్రాయఁబడియున్నది. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఈ మూలము ముగిసిన తరువాత 319 పత్రము మొదటి వైపున నారంభించి గ్రంథ విషయసూచిక యాంధ్రమున వ్రాయఁబడియున్నది. ఇది 126 పుటల గ్రంథము. మూలప్రతి పుట పార్శ్వములందలి విషయసూచికయే దీనికి మూలముగానున్నది.

దీనితరువాత దీనికి బ్రౌనుదొరగారు చేసిన యింగ్లీషు తర్జుమా వ్రాయఁబడియున్నది. ఈ భాషాంతరీకరణము 393 వ పత్రము మొదటి వైపుననుండి 142 పుటలు వ్యాపించియున్నది. ఇది 1839 వ సం॥ నవంబరు 7 వ తేది నాటికి సమాప్తమైనదఁట.

---

## No. 970. బసవపురాణము.

## BASAVAPURĀṆAMU.

Substance, paper. Size, 12⅝ × 7⅝ inches. Pages, 306. Lines, 16 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but contains a few mistakes. The variations in reading are interlined.

Complete.

Same work as the above.

The following note by C. P. Brown appears on the fly-leaf of the MS. :—

"The Basava Puranam
in Telugu—Dwipada Metre.

This copy is valuable, as containing the various readings found in numerous manuscripts, by C. P. Brown.

A short account of this book may be found in an Essay on the Jangams printed in the Madras Journal for 1840 and a more detailed account is given in the volume for 1841."

The following note by C. P Brown is found on the second leaf of the MS. :—

"The Basava Puranam
in Dwipada Metre.
1839.

The present copy though roughly written is valuable. For it exhibits all the various readings found in various manuscripts. These were recorded in the volume as a basis for the new edition which has been prepared under my directions.

C. P. Brown."

At the end of the work there are 160 pages containing the summary of this work in English by C. P Brown, followed by 134 pages containing the Telugu summary of the work

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. పాఠ భేదములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. కొన్ని పాఠములు వేఱుగాఁ గాగితపుఁ దునుకలమీఁద వ్రాయఁబడినవి. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

పిడపర్తి సోమన బసవపురాణ పద్యకావ్యమునందుఁ జెప్పిన చొప్పున, పాలుకురికి సోమనాథుని గ్రంథముల లిస్టు ఈ గ్రంథముమీదను వ్రాయఁబడినది.

---

## No. 971. బసవపురాణము.

## BASAVAPURĀṆAMU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 426. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

గ్రంథాంతమున నీవ్రాంత కలదు :—

"విశ్వావసునామ సం॥ చైత్ర శు ౫ అ॥ వరకు (మాకేటి సర్వేశలింగము) సంపూర్ణంగా బసవపురాణం వ్రాస్తిని."

## No. 972. బాలభాగవతము.

## BĀLABHĀGAVATAMU.

Substance, paper. Size, $12\frac{1}{2} \times 8\frac{5}{8}$ inches. Pages, 291. Lines, 22 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete, but imperfect.

Similar to the work described under No. 27 ante. The author Dōnūru Kōnērunāthakavi, son of Nāgayamantri of Śrīvatsagōtra and Āśvalāyanasūtra, has dedicated this work to Tirumalabhūpāla, elder brother of Cinatimmabhūpāla, who was the third son of Arvēṭi Timmabhūpāla. It is stated that this work was written in the year Plava, corresponding to the Śaka year 1469. For other particulars regarding the author and the dedicatee, see the extracts given below.

**Beginning:**

శ్రీ వేంకటేశు నూర్జిత దయావేశు
సేవకశ్రీదు నంచిత తీర్థపాదు

* * * *

ఘనునకుఁ జాళుక్య కంఠీరవునకుఁ
చినతిమ్మనృపతికి సిరులిచ్చువేల్పు
వెలయుజంగులిదేవ వేశ్యాభుజంగు
నలఘు నకల్పు నారాయణుఁ గొలుతు

* * * *

నన్నపార్యుఁడు భీమనయుఁ దిక్కశౌరి
సన్నుతక్రముఁడైన శంభుదాసుండు
మొదలైనవారల మున్నాంధ్రకవిత
యొదవించినట్టి యార్యులఁ బ్రస్తుతింతు

* * * *

అని తలఁపొనఁ గూడునట్లుగా సుకవి
జనమతాచారంబు చక్క నొనర్చి

* * * *

ఒక ప్రబంధముపల్క నుద్యోగపరత
ప్రకటించి మదము చొప్పడ నుండునంత

* * * *

బిరుదుమన్నెరగండ బిరుదలాంఛనుఁడు
పరమహీశాంబుధి బడబానలంబు

* * * *

సురుచిరాపస్తంబ సూత్రుఁ డాత్రేయ
వరగోత్రుఁ డతిసాంద్ర వైభవేంద్రుండు
సోమవంశాంబుధి సోముండు కీర్తి
ధాముండు బుక్కభూధవు ప్రపౌత్రుండు
రామభూపతితిమ్మ రాజపుత్రుండు
ధీమాననీయుండు తిరుమలనృపతి

* * * *

దక్షిణాశాజయ స్తంభయోజకులు
శిక్షితదుర్మదక్షితి పాలగణులు
వినయలక్ష్మీయుతుల్ విట్ఠలోర్వీశ
చినతిమ్మనృపతు లంచితకీర్తిధనులు
పాపతిమ్మ క్షమాపతియును నాది
యైపొల్చునసుజన్ము లతిభక్తిఁగొలువ

* * * *

మొదలైన నియోగ్యాగములు నిండికొలువ
మదముగావించు పెంపునఁ గొలువుండి

* * * *

అమరంగ నాశ్వలాయన శాఖయందు
కొమరొందు శ్రీవత్స గోత్రాంబురాశి
గలుగుదోనూరి నాగయ మంత్రిసుతుని
విలసితసాహిత్య విశ్రాంతిమంతు
వినుతాష్టభాషా కవిత్వప్రచండు
ననఘుఁ గోనేరు నాథాఖ్యుని నన్నుఁ
బిలిపించి సముచిత ప్రియపూర్వకముగఁ
బలికె గంభీర విభ్రమ విశేషమున

* * * *

జనపతిమణికి మజ్జనకుఁడౌ రామ
జననాథు తిమ్మభూజానికి మున్ను

వచియించి తౌనన వచన (బద్య) కావ్యముగఁ
బ్రచురంబుగా బాల భాగవతంబు
వాసికి నెక్కె యివ్వసుధాతలమున
భాసిల్లు నాబాల భాగవతంబె
యరుదుగా నడచిన యన్నిమార్గములఁ
దిరముగా మాచిన తిమ్మయ్యపేర
ద్విపదకావ్యంబుగా వెలయంగఁజేయు
మిపుడు మాకెంతయు హితమిదియనుచు
వివిధవిచిత్ర నవీనాంబరములు
నవరత్నమయభూషణము లెన్నఁదగిన
యగ్రహారంబులు నగ్రహారములు
నగ్రీయపల్యంకి కాదివస్తువులు
తగ నిచ్చికర్పూర తాంబూల మొసఁగి
ప్రగుణిత బహుమాన పరితుష్టుఁజేసె
ననుమతించితి నప్పు డవ్వాక్యమేను
ననురాప శుభనిమిత్తా లోకనమున

* * * *

కృతిముఖంబున కలం కృతిగాఁగ నింకఁ
గృతినాథువంశంబుఁ గీర్తింతు నిపుడు

* * * *

అతని పుత్రుఁడు పూరుఁ డతని వంశమునఁ
బ్రతిలేక కడుఁబేరు వడెఁ బరీక్షిత్తు
అనవద్యగుణుఁడైన యతనివంశమున
ఘనుఁ డారెపిటిబుక్క నృపాలుఁ డెసఁగె
నరనాథమణిసాల్వ నరసింగరాయ
వరసఖుండై బుక్క వసుధేశుఁ డలరె
నామహీపతికిఁ బల్లాంబికయందు
రామనృపాలుండు రాజేంద్రుఁ డొదవె
నెందు నెన్నఁగఁజాలు నిద్ధశౌర్యమునఁ
గందనవోలి దుర్గంబులోనుండి
బుక్కరాయరామభూ భుజుఁ డెల్లనృపులు

నెక్కువ యిదియని యెన్నంగఁజాతి
పేరుఱు డెబ్బది వేవు రాశ్వికులు
చేరి కొల్వంగ వచ్చిన సవా నెదిరి
కల నదిపంచ బంగాళంబు సేసి
గెలిచెఁ దచ్చరితంబుఁ గీర్తింపఁ దరమె
వినుతింపఁదగు నాదవేని దుర్గమున
ననతుఁడైయుండు కాచాధీశుఁగెలిచి
యరుదుగా సప్తాంగ హారణంబు సేసె
గరిమోన్నతుండు బుక్కరాయ రామవిభుఁడు

* * * *

ఆరామ నృపతిలక్కాంబికయందు
ధీరునందనుఁగాంచెఁ దిమ్మభూవరుని

* * * *

రామయతిమ్మభూ రమణుఁడెన్నంగ
భూమీశ మాత్రుఁడే పురుషోత్తముండు

* * * *

అపదృష్టియగునొక్క యాభీరకునకు
నిపుణుండు వేంకట నిలయుండు చక్రి
యొకకంటిచూపుతా నొసఁగి స్వప్నమునఁ
బ్రకటుఁడైతిమ్మ భూపాలు మన్నించి
యోకృతకృత్య నీ కుర్వీశు లెనయె
నీ కటాక్షాబలపుణ్యా నిధి మోక్షమిత్తుఁ
గరుణగోపాలుని కడమచూపిమ్మా
నరనాథ యనుచు నానతియిచ్చుటదియుఁ
గొలువులో నగ్గోపకునకుఁ జూపొసఁగె
బలబలభద్రుఁడాపాండువంశజుఁడు
ధన్యుండు రామ భూధవుతిమ్మనృపతి
సైన్యసమేతుఁడై చైత్రమాసమున
దండు వోవుచునుండి తనభటుల్ త్రోవ
నెండిననోళ్లఁ ద ప్పెటఁగించుటయును
గొండుచిత్తమున డోనిశిరంగరాజు

కొండనెత్తమున వైకుంఠునిఁ దలఁచి
గోవింద వేట(వెట్టి) గ్రక్కుఱ నొకఱబుగ్గ
భూవినుతంబుగాఁ బోడమంగఁ జేసె
అందరుఁ జూడంగ నస్క్రిర మచటఁ
గ్రందుగా విలసిల్లె ఘటికాద్వయంబు
కడిమిమై మానువ కర(డ)రణక్షోణి
గడుసరి నేదుల ఖాను జయించె
విక్రమంబున నాదవేనిదుర్గంబు
విక్రాంతు లెన్న వేవేగ సాధించి
సిరులతో వీర నృసింహరాయలకుఁ
బరుషాత్తుదుర్గాధి పతి నొప్పగించి
గరిమ స్వామిద్రోహ గండ పెండార
మరిభీకరముగ రాయ లొసంగ నంచె
లాలితకీర్తి విలాసుండు పద్య
బాలభాగవత ప్రబంధ నాయకుఁడు

* * * *

గోపమాఁబయుఁ దిమ్మ కుంభినీశుండు
నేపైన భక్తి లక్ష్మీశుఁ బూజించి
మహిమతోఁ దిరుమల మనుజనాథుండు
విహితదిగ్విజయుండు విట్ఠలేశ్వరుఁడు
రాజిల్లుచినతిమ్మ రాజచంద్రుండు
తేజంబుగలపాప తిమ్మభూపతియు
ననునట్టి పలువుర నాత్మసంభవులఁ
గనిరిందువంశంబు ఘనతకు నెకఱఁ
చెలివితో మఱియునా తిమ్మభూవిభుఁడు
తిలకించు తిరుమల దేవిఁ జేపట్టి
కనియె గోసపమహీ కాంతు శ్రీరంగ
మనుజేంద్రు రామలక్ష్మణులఁ బోలంగ
ననితర సమవృత్తి నందగ్రజుండు
దినపతితేజుండు తిరుమలనృపతి
యొనరించె శ్రీమద హోబలపతికి

వనము మంటపమును వగసత్రములును
గర్పూరకస్తూరి కాగంధసేవ
యర్పించె నా గరుడాద్రినాథునకుఁ
జెలఁగుభార్గవనిధి శ్రీనృసింహునకు
నెలకొన్న భక్తిఁ గోనేరు గట్టించె

* * * *

ఇందరిలోన లక్ష్మీశ కారుణ్య
నందితస్థితిఁ గృతినాయకుండైన
యాచినతిమ్మ రాజేంద్ర చంద్రముని
రాచరఁ మేరికిఁ బ్రణుతింప దరమె
ధీరులు కేరళ తిరువడిపాండ్య
చేరచోళాదిక్షితినాథవరులు

* * * *

అవహితులై యుపాయనములు దెచ్చి
యవసరంబులవారి యాజ్ఞలో నిలిచి
తెలివిమీఱఁగఁ జినతిమ్మభూపాలు
కొలువువేళలు గాచి కొనియుందు రర్థి
శ్రీరాఘవుఁడు దక్షిణదిగంతమున
నారూఢి మున్ను శౌర్యము పెంపు నెఱపి
పౌలస్త్య లంకలోఁ బట్టంబుగట్టి
యాలీల నిలుపలేఁ డయ్యోఁదగ్వడిని
బడపడియారామ భద్రుండె తనదు
కొడుపతీర్పుటకునై గొబ్బున మరలఁ
జినతిమ్మనృపతియై సిరిమించఁబుట్టి
ఘనత నస్త్రశరెల్లఁ గ్రమ్మర గెలిచి
బలిమిమైఁ దిరువడిఁ బట్టంబుగట్టె
నలవియే యారాజ హరికెఁకుఁబొగడ

* * * *

ఈ దృశగుణరమా హితుఁడైనవిజయ
మోదవంతునకు సన్మూర్తిమంతునకు
బిరుదాఢ్యునకు హొసబిరుదరగండ

బిరుదుమన్నె విభాళ భీమనామునకు
సమరగాండీవశరాసనునకుద్దండ
కోమరువేశ్యాభుజంగున కసాధ్యునకు
ఆనమితారాతి కవఘుళురాయ
మానమర్దనునకు మానోన్నతునకుఁ
కోనరానికోటల గొంగకు సుజన
మనితషోడశదాన మండలేంద్రునకు
గండరగూళికి గండరగండ
చండాంకునకు మహాశౌర్యోన్నతునకు
వెగటుమన్నియమృగ వేటకారునకు
నిగిడినబిరుదు మన్నియవిభాళునకు
దురితదూరున కినద్రోహరగండ
ధరణీ వరాహ ప్రధానచిహ్నునకు
విధువంశకలశాబ్ధి విధునకు నవిత
బుధునకు నాడితప్పరగండనికి

* * * *

కృతకృత్యునకుఁ జంద్రగిరిముఖ్యదుర్గ
వితతిమహైశ్వర్య విలసితాత్మునకుఁ
చాటితకేరళ భామినీగర్భ
ఘాటీలసద్ఘణం ఘణనినాదునకుఁ
దిరువడిరాజ్య ప్రతిష్ఠాపకునకు
విరచిత పాండ్యభూ విభుశాసనునకుఁ
జేరచోళాదిక క్షితి నాథమకుట
హీరనీరాజన హృద్యపాదునకు

* * * *

చినతిమ్మ నృపతికి శ్రీవేంకటేశ
వినుతకృపాలబ్ధ విభవసాంద్రునకు
నభిమతసిద్ధియు నభ్యుదయంబు
నభివృద్ధి నొందెడు నట్లుగా నేను
బలుకఁబూనినబాల భాగవతాఖ్య
గలుగునీకృతి కుపక్రమ మెట్టి దనిన

**End:**

భాసిల్లు నీబాల భాగవతంబు
వ్రాసినఁ జదివిన వరభక్తి వినిన
వార కెల్ల శ్రీవల్లభు కరుణ
నారోగ్యమైశ్వర్య మాయువు నెసఁగు

**Colophon:**

అనియిట్లు నవమన్మథాకారు పేర
వనజాక్షుచరణసేవనధన్యు పేర

*  *  *  *

ఆరెపీటీపురాధ్యక్షుని పేర
శ్రీరమ్యరామపార్థివ పౌత్రు పేర

*  *  *  *

ఘనకీర్తితిమ్మభూకాంతకుమార
చినతిమ్మభూపాల శేఖరు పేర
శ్రీనిత్యవిలసిత శ్రీవత్సగోత్ర
మానిత నాగయామాత్యపుత్రుండు
వివిధాష్టభాషా కవిత్వధుర్యుండు
కవిసార్వభౌమ విఖ్యాతపదుండు
గురుమతి దోనూరి కోనేరునాథుఁ
డరుదుగాఁ జెప్పిన నతిచిత్రమగుచు
లాలితంబై రమ్య లక్షణంబైన
బాలభాగవత ప్రబంధంబునందు

*  *  *  *

తగినసూర్యుని మహత్త్వంబు ననంగ
జగతిమించిన ద్వాదశస్కంధ కథలఁ
బొసఁగియలంకార పూర్ణమై చెలఁగి
యసమానమైన షష్ఠాశ్వాసమయ్యె॥

చ. అరుదుగ శాలివాహన శకాబ్దము లెన్న నిధాన తర్క సా
గర శశిసంఖ్యచే వెలయఁగల్గు(ల్గి?) ప్లవంగ మనంగ మించు వ
త్సరమునఁ బలెకెఁదిమ్మ వసుధాపతికిన్ గవిసార్వభౌముఁ డీ
హరిహిత బాలభాగవత హారిపదద్విపద ప్రబంధమున్॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లధికముగాఁ గలవు. అక్కడక్కడ చిన్నచిన్న గ్రంథపాతములు గలవు. తృతీయాశ్వాసమున 5, 6, 7 సర్గములును, పంచమాశ్వాసమున దశమసర్గమును నుండుట తక్కతక్కిన యాశ్వాసములెల్ల రెండేసి సర్గముల కథలు గలవి. శైథిల్యము లేదు.

ఇది డి నెం 27 రున వర్ణితమయిన బాలభాగవతమును (పద్య గద్యాత్మకము) రచించినకవియే దాని ననుసరించియే రచియించిన ద్విపద కృతి. ఇందును విశిష్టాద్వైత సంప్రదాయానుసారముగా భాగవతము తెల్గుచేఁత గలదు. ఆరెపిటి తిమ్మభూపాలుని తృతీయ పుత్త్రుఁడగు చినతిమ్మ భూపాలున కప్పటి ప్రభువును నాతనికగ్రజుఁడును నగు తిరుమల భూపాలుని కోరిక ప్రకార మంకితముసేయఁబడినది. ఆరెపిటి బుక్క నృపాలుఁడాదిగా నవతారికయందు వర్ణితమయిన కృతిపతి వంశావతారాదికమిందు దావ్రాత గ్రంథభాగమునఁ గాననగును. కథ ముగిసిన తర్వాత నవమ సర్గమందలి రాజవంశ ప్రశంస కనుబంధముగాఁ బరీక్షిత్తు మొదలు తిమ్మభూపాలుని వఱకుఁ గల నలువదియైదు పురుషాంతరముల వంశచరిత్ర యునందు వర్ణింపఁబడియున్నది కృతికర్తనుగూర్చి డి నెం 27 రును జూచునది. ఈ కృతి శక 1469 అగు ప్లవంగ వత్సరమున రచింపఁబడెనట!

---

## No. **973.** బాలభాగవతము.

## BĀLABHĀGAVATAMU.

Substance, palm-leaf. Size, 17 × 1⅝ inches. Pages, 398. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair and free from mistakes.

Complete but imperfect.

Same work as the above. The MS. described under the previous number seems to be a transcript of this MS

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. మిక్కిలి ప్రాచీనము. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథ పాతములు హెచ్చుగాఁ గలవు.

పూర్వమువలె.

ఇది పూర్వ వర్ణితమగు పుస్తకమునకు మాతృక. గ్రంథాంతమం దిట్లు గలదు:—

"కాళయుక్తి సంవత్సర పుష్య బ ౭ గురువారం నాటికి దోనూరి అబ్బన్న కుమారుండు పెద వరదరాజులు వ్రాశిన బాల భాగవతం ద్విపద."

ప్రతి విలేఖకుఁడైన యీ పెద వరదరాజులు గ్రంథకర్త వంశము లోనివాఁడు.

---

## No. 974. భారతము.

## BHĀRATAMU.

Substance, paper. Size, $12\frac{3}{4} \times 7\frac{7}{8}$ inches. Pages, 356. Lines, 18 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good, not free from mistakes. Breaks off in some places.

Contains the Virātaparva only.

A Prabandha in Dvipada metre describing the story of the Mahābhārata. The author Timmanakavi, son of Vallabhasūri of Kāśyapagōtra, has dedicated this work to Jaṅgāla Mummayareḍḍi, son of Dēvaya and grandson of Mallireḍḍi

**Beginning:**

చండతేజుఁడు మున్ను జనమేజయుండు
పాండవకథ లెల్లఁ బరిపాటి వినుచు

* * * *

పరగంగ నాలవ పర్వంబుకథయు
నిరవొప్ప నాకు నీ వెఱిఁగింపు మనిన
జనమేజయునకు వైశంపాయనుండు
వినుపింపఁ దొణఁగెఁ దద్వృత్తాంత మెల్ల

* * * *

అనఘాత్మ యటుమీఁద నైనవృత్తాంత
మెనసినవేడ్కతో నెఱిఁగింతు వినుము
అర్థిమందార సాహస విక్రమార్క
పార్థివనుత శౌర్య పంటవంశేంద్ర

పరమేశ్వరాఖ్యానపరవిణ్ణ(వర్ధ ?)మాన
పురవరాధీశ్వర భూరిప్రతాప॥

*　　　*　　　*　　　*

శ్రీభవ్యదోర్దండ చెరమీర(లమర్తి)గండ
వైభవోపేంద్ర దేవయముమ్మధీర

*　　　*　　　*　　　*

డిండీరకీర్తి బట్టేపాటినిలయ
చండశాత్రవశూర సంచారధీర[?
మదనసన్నిభగాత్ర మలిరెడ్డిపౌత్ర
విదితసత్కులచంద్ర విభవదేవేంద్ర
లలితచౌషష్ఠి విద్యాకళాసౌఖ్య
కలితమహాభాగ్య కర్ణాటతిలక

*　　　*　　　*　　　*

వాసవప్రతిమానవరజనాధీశ
ధీశక్తినిజపాత్ర దేవయపుత్ర

*　　　*　　　*　　　*

**End:**

అనియిట్లు నృపతికి నభివృద్ధిగాఁగ
నెనసినవేడ్కతో నేఁజెప్పినట్టి
యీ పుణ్యకథ విన్న నెలమి వ్రాసినను
రూపించి చదివిన రుచిరపుణ్యులకు

*　　　*　　　*　　　*

ఇహలోకపరలోక హితమైనసుఖము
మహితాయురారోగ్య మంగళచయము
రమణ బట్టేపాటిరామలింగంబు
క్రమము దప్పక యిచ్చుఁ గలకాల మెల్ల
నావేల్పుఁగొల్చిన యనఘాత్ముపేర
దేవయ ప్రభువంశతిలకంబు పేర
సరణిగాఁ బంట వంశప్రభు పేర

మఱియు జంగాలముమ్మయధీరు పేర
సహజసజ్జను పేర సంప్రోక్తమైన
మహితసత్కృతిధాత్రి మను నెంతకాల
మినసోమతారక లెంతకాలంబు
అనుపమస్థితి నొప్పు నంతకాలంబు.

(వి-వి.)—

అసమగ్రము. విరాటపర్వము మాత్రము గలదు. వ్రాఁత మంచిది. తప్పులు లేక పోలేదు. శైథిల్యము లేదు. గ్రంథపాతము లల్పముగాఁ గలవు.

మహాభారత విరాట పర్వకథ యిందు సంగ్రహముగా ద్విపద రూపమున నైదాశ్వాసములలో రచియింపఁబడినది. మలి రెడ్డి పౌత్త్రుఁడును, దేవయపుత్త్రుఁడును నగు జంగాలముమ్మయః యను పంట రెడ్డి ప్రభువున కీ కృతి యంకితము సేయఁబడినది. ఈతఁడు బట్టిపాటి పురవాస్తవ్యుఁడు. విణ్ణ (వర్ధ?) మానపురాధీశ్వరుఁడని యీతఁడు ప్రస్తుతుఁడయ్యెను. గ్రంథకర్త తిమ్మన కవి. కాశ్యపగోత్రుఁడు. వల్లభసూరి పుత్త్రుఁడు. ఆర్. నె 741 రు వర్ణితమగు గ్రంథము నిదియు నొకటే యగును.

---

## No. 975. భారతము.

## BHĀRATAMU.

Substance, paper. Size, $12\frac{3}{4} \times 7\frac{7}{8}$ inches. Pages, 186. Lines, 23 on a page. Character, Telugu. Condition, good. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Contains the Udyōga parva only.

Same work as the above The author is the same as Timmaya, son of Vallabhasūri, but the work under notice has been dedicated to Vēṅkaṭēśvarasvāmi.

**Beginning :**

శ్రీవేంకటాధీశ సృష్టిప్రకాశ
దేవపూజితపాద దివ్య ప్రసాద
జనమేజయునకు వైశంపాయనుఁడు
ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగ

పాండవు లిట్లు శోభన మైనపిదపఁ
బుండరీకాక్షుని పూజలుచేసి
యేనగునాఁడు మత్స్యేశుకొల్వునను
భూనాథునను దానుఁ బోయికూర్చుండి.

**End:**

శంకరపురుహూత చతురాస్య లెఱుఁగ
వెంకటాధిపుఁడును వేడ్కతో నిచ్చు
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యప గోత్రదీప
శ్రుతిపాత్రవల్లభసూరి సత్పుత్త్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
యోజిత భారతోద్యోగపర్వమున
నోజతో నాశ్వాస మొప్పె మూఁడవది.

(వి-వి.)—

అసమగ్రము. ఉద్యోగపర్వము మాత్రము గలదు. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

ఇది నెం 974 రున వర్ణితమయిన గ్రంథములోని భాగమేయగును కాఁబోలును! వల్లభసూరి కుమారుఁడగు తిమ్మయయే దీనికిని గర్త. కాని దానికి జంగాల ముమ్మయ యను పంట రెడ్డి ప్రభువు కృతిపతి. దీనికి శ్రీ వెంకటేశ్వరస్వామి కృతిపతి. కవి తన గ్రంథమున నొక్కొకపర్వ మొక్కొకరి కంకితముగా రచించియుండును. ఇది మూఁడాశ్వాసములుగలది.

---

## No. 976. భారతము.

## BHĀRATAMU.

Substance, paper. Size, $12\frac{3}{4} \times 7\frac{3}{4}$ inches. Pages, 346. Lines, 21 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Bound in 3 volumes, each volume containing one Parva complete, viz., Virāṭa, Udyōga and Bhīṣma.

Same work as the above. The author is same but the work under notice is dedicated to God Rāmacandra.

The transcription was completed on the 4th January 1849.

**Beginning:**

శ్రీరామచంద్ర యాశ్రితవార్ధిచంద్ర
చారునిర్మలగాత్ర శశిసూర్యనేత్ర
పంకజగర్భ సంభవభవప్రముఖ
కింకరార్చిత దశగ్రీవ సంహార
అర్ణవదర్పాపహార యా కుంభ
కర్ణాదిరాక్షసఖండనోద్దండ
ఖండేందుధర చాపఖండనోద్దండ
కాండసమగ్ర యాఖండలవినుత
దశరథరాజనందన సార్వభౌమ
అసదృశకీర్తిదిగంతవిశ్రాంత

* * * *

శరణాగతుని నన్నుఁ జాల రక్షించి
వరుసతో వినఁగ దేవా చిత్తగింపు
జనమేజయుఁడు దొల్లి సకలభారతము
మునివల్లభునిచేత ముదమొప్ప వినుచు
వరుస నుద్యోగ పర్వము విన్నవెనుక.

**End:**

హరియుతంబుగ వచ్చి రావాసములకు
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు
అని మునిజనమేజయ క్షితిపతికి
చెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యమ్మీఁద
నెప్పాటఁ గథ చెల్లె నెఱిఁగింపు మనిన
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యప గోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్త్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితమై భీష్మపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొప్పె నేనవది

(వి-ఐ.)—

అసమగ్రము. భీష్మ పర్వము మాత్రము గలదు. వ్రాంత మంచిది. తప్పు లక్కడక్కడ గలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతము లల్పముగా గలవు.

ఇది నె 974 రున వర్ణితమైన గ్రంథమున భాగమే కాఁబోలును; గ్రంథ కర్త ఒకఁడే కాని, యీ భీష్మ పర్వము 5 అశ్వాసములు గలది. శ్రీ రామచంద్రమూర్తి కంకితము చేయఁబడినది.

ఈ సంపుటము 1849 జనవరి 4 వ తేది నాటికి వ్రాయఁపఁ బడినది.

---

No **977.** భారతము.

BHĀRATAMU.

Substance, paper. Size, $12\frac{7}{8} \times 7\frac{7}{8}$ inches. Pages, 189. Lines, 22 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good, not free from mistakes. The MS. is dated 23rd July 1848. Contains up to the end of the Śāntiparvamu.

Same work as the above. The author Sōmana, son of Timmanārya, is considered to be the author of the work described under the previous number.

**Beginning:**

ద్విపద. శ్రీకామినీవక్ష స్సృష్టిసంరక్ష
నాకేశవంద్య పినాకి సంస్తుత్య
జనమేజయునకు వైశంపాయనుండు
ఘనతతో భారతకథ చెప్పఁదొణఁగె

* * * *

అనియిట్లు జనమేజయక్షితిపతికి
మునిచెప్పె నని చెప్పమోదించి ఋషులు
అనఘాత్మ తరువాత నైన వృత్తాంత
మను వొప్పఁ జెప్పవే యని యడుగుటయు

**End:**

ఘనమానిహృద్గేహ కలితసందోహ
వినుతప్రకాశ శ్రీవేంకటాధీశ

భక్తవత్సల జగత్పావనమూర్తి
ముక్తిప్రదాయక మ్రొక్కెద నీకు.

**Colophon :**

ఇది వేంకటాచలాధీశ్వరదివ్య
పదపద్మమకరంద పానద్విరేఫ
మగునాతకూరి తిమ్మార్యతనూజ
సుగుణాఢ్య సోమనసుకవీంద్ర వర్య
రచితమై శాంతిపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొప్పె నాలవది
ఈశాంతి పర్వంబు నేపు దీపించి
ధీశక్తి వినినఁ జదివిన వ్రాసినను

* * * *

ఆయురారోగ్యంబు లఖిల సంపదలు
వేయుభంగులఁ గల్గి వెలయుచుండుదురు.

(వి-వి.)—

అసమగ్రము. శాంతిపర్వము కడముట్టఁగలదు. వ్రాఁత తిన్ననిది. తప్పు లందందు గలవు. శైథిల్యము లేదు కాని చిన్న చిన్న గ్రంథపాతము లక్కడక్కడ గలవు.

ఇది నె 974 రున వర్ణితమగు గ్రంథమున భాగమే కాఁబోలును. ఇందు శాంతి పర్వము మాత్రమే కలదు. తిమ్మనార్యుని కుమారుఁడయిన సోమన యేతద్గ్రంథకర్త. గ్రంథకర్తతండ్రియగు నీతిమ్మన విరాటోద్యోగభీష్మపర్వముల రచియించిన తిమ్మనయగునేమో! వీరి యింటిపేరు ఆత (తు?త్మ?) కూరివారు. ఈ గ్రంథము నాలుగాశ్వాసములు గలది.

---

## No. 978. మఱిబసవపురాణము.
## MAṚIBASAVAPURĀṆAMU.

Substance, paper. Size, 12 × 8 inches. Pages, 371. Lines, 24 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.

**Complete.**

Same work as that described under R. No 556 of the Triennial Catalogue of Telugu MSS., Volume III, Part III.

Also contains a short introduction by C. P. Brown at the beginning of the work.

(వి-వి.)—

సమగ్రము. మొదట నించుకంత కొఱఁత. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 556 రున వర్ణితమైనదే.

బ్రౌను దొరగారి యింగ్లీషు వివరణము లక్కడక్కడ గలవు. చిన్న యుపోద్ఘాతము గలదు.

---

No. **979.** మఱిబసవపురాణము.

MAṚIBASAVAPURĀ AMU.

Substance, palm-leaf. Size, 15¾ × 1¼ inches. Pages, 178. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Complete

Same work as that described under R. No. 556 of the Triennial Catalogue of Telugu MSS., Volume III, Part III.

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్య మక్కడక్కడ గలదు. గ్రంథపాతములును గొలఁదిగాఁగలవు.

ఇది ఆర్ నెం 556 రున వర్ణితమైనదే.

---

No. **980.** మార్కండేయపురాణము.

MĀRKAṆḌĒYAPURĀṆAMU.

Substance, palm-leaf. Size, 17 × 1¼ inches. Pages, 174. Lines, 5 on a page. Character, Telugu Condition, much injured. Mode of writing, bad ; full of mistakes and breaks off in many places.

Complete.

Same work as that described under R. No. 132 of the Triennial Catalogue of Telugu MSS., Volume I.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము. గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నె 132 రున వర్ణితమైనదే.

No. 981. రామాయణము.

RĀMĀYAṆAMU.

Substance, paper. Size, 11⅞ × 7½ inches. Pages, 1970. Lines, 20 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but full of mistakes. Bound in two volumes.

Contains the first five Kāṇḍas in the first volume and the sixth Yuddhakāṇḍa in the second volume.

A Prabandha in the Dvipada metre describing the story of the Rāmāyaṇa. This work is also called Raṅganātharāmāyaṇa. It is stated in the work that Kōna Buddharāja wrote this work at the instance of his father Viṭṭhalarāja and dedicated it to him. But there is a tradition that this work was written by a poet called Raṅganātha who inserted the names of Kōnabuddha and Viṭṭhalarāja as the author and dedicatee respectively. For other particulars regarding the genealogy of Kōnabuddhaprabhu, see the extracts in Telugu.

In the beginning of Vol I appears the following note, apparently in the hand of Mr. C. P. Brown which gives the necessary information about the work and the author :—

The Dvipada Ramayan,

New Edition, 1840.

" After the collation of manuscripts was completed and recorded in eight folio volumes in my library, the present new edition was framed, on the evidence therein furnished.

" This volume contains the first five Candas, or books a volume equally large contains the sixth book or Yuddha Canda. The Uttara Canda (seventh book or supplement) is not so long.

" This translation of the Ramayan is always attributed to a poet named Ranga Natha : but his name is nowhere mentioned in the book : while it is asserted in each volume that the author was Budha Razu, who wrote it at the desire of his father Vitthal Razu."

In the end of Vol. II is written ;—

" End of the Yuddha Canda or Last Book (unless the Uttara Canda is included) of the Ramayan.

" C. P. BROWN,

Madras, 11th September 1840."

**Beginning :**

శ్రీకామినీనాథు జితదైత్యయూథు
లోకరక్షణకృత్యు లోకైకనిత్యు
నిత్యసదానందు నిర్వాణకృత్యు
కృత్యవిదూరు నకృత్రిమాధారు

*　　　*　　　*　　　*

భావించి కీర్తించి ప్రార్థించి మ్రొక్కి
సేవించి యభిమతసిద్ధిగాఁ దలఁచి

*　　　*　　　*　　　*

ఏ కథ చెప్పిన నీప్సితార్థములు
గైకొనిపుణ్యము ల్గణఁగి కావించు
నను విచారములు నాయంతరంగమునఁ
గొనకొని కృతిసేయఁ గోరుచున్నంత

*　　　*　　　*　　　*

శరణార్థిరాజన్య షట్పదాధార
కరపద్మునకు గోనకాట భూపతికి
నయ వినయోదయదయాయత సత్త్వనిధికిఁ
బ్రియతనూజన్ముఁడై పృథివిఁ బెంపొందు
రుద్ర ప్రతాపుండు రుద్రనిర్మలుఁడు
రుద్రాత్ముఁడగు గోనరుద్రనరేంద్రు
పౌత్రుఁ డభంగుఁ డప్రతిమవిక్రముఁడు
గోత్రధీరుఁడు కులగోత్రవర్ధనుఁడు
దివిజేంద్రవిభవుండు దృఢసూనృతుండు
భువన విఖ్యాతుఁడౌ బుద్ధ భూవిభుని
తనుజన్ముఁ డక్షీణ దాక్షిణ్యపరుఁడు
ధనధాన్య ధనదుండు ధర్మ ధర్మజుఁడు

*　　　*　　　*　　　*

కురుకేరళావంతికుంతల ద్రవిడ
నరనాథసభలవర్ణన కెక్కువాఁడు

*　　　*　　　*　　　*

వినయనయోపాయ విజయసుస్థిరుఁడు
ఘనమూర్తి విట్ఠల క్ష్మాపాలకుండు

* * * *

సకలజగద్ధిత చాతుర్యధుర్యుఁ
డొకనాఁడు కొలువున నున్నతోన్నతుఁడు

* * * *

రమణమైఁ దెనుఁగున రామాయణంబుఁ
గ్రమమొప్ప ద్విపదమార్గమున నాపేరఁ
గలితమై చెప్పెడు ఘనకావ్యశక్తి
గలకవు లెవ్వరు గల రుర్వి ననుచుఁ
దలఁపోయ విట్ఠల ధరణీపాలునకు
నున్నతమూర్తికి నురుయశోనిధికి
విన్నవించిరి వేడ్క విబుధపుంగవులు
నీతనూజన్ముఁడు నిపుణమానసుఁడు
ధూతకల్మషుఁడు బంధురనీతియశుఁడు

* * * *

సరసార్థిజలజాత జలజాతహితుఁడు
పురుషచింతామణి బుద్ధాహ్వయుండు

* * * *

మఱియు రామాయణ మర్మకర్మంబు
లెఱుఁగు నాతనిఁ బిల్వు డీకథఁ జెప్ప
ననిన మజ్జనకుం డుదాత్తవర్తనుఁడు
నను నర్థిఁ బిలిపించి నను గారవించి
భూమిఁ గవీంద్రులు బుధులును మెచ్చ
రామాయణంబుఁ బురాణమార్గంబు
దప్పక నాపేరఁ దగ నాంధ్రభాషఁ
జెప్పి ప్రఖ్యాతంబు చేయింపు ముర్వి
నని యానతిచ్చిన నమ్మృదూక్తులకు
ననయంబు హర్షించి యట్ల కావింపఁ
బనిపూని యరిగండ భైరవుపేర
ఘనుపేర మీసర గండనిపేర

* * * *

నాతతకృతిసేర నతిపుణ్యుపేర
మాతండ్రివిట్ఠల క్ష్మాపాలుపేర

*　　　*　　　*　　　*

ఆదికవీశ్వరుఁ డైనవాల్మీకి
యాదరంబునఁ గవు లందఱు మెచ్చఁ
జెప్పినతెలుఁగున శ్రీరామచరిత
మొప్పఁ జెప్పెదఁ గథాభ్యుదయ మెట్లనిన.

**End :**

పాలించి యేలుచోఁ బ్రజలు దుఃఖములఁ
దూలరు దురితము ల్దుర్భిక్షతతులు
కలుగ వెయ్యేడలను గాలదోషమునఁ
జలనంబు నొందవు సత్యధర్మములు
అనువుగా శతమాన మైనను గాని
జనులు దేహముఁ బాసి చనరు కొంచెమున
వలయు నప్పుడు వర్షము ల్గురియుఁ
బలుమాఱు దున్నక పండు సస్యములు
పరహితాచారతాత్పర్యంబు గల్గి
పురుషులు కాంతలు పొలుపొందుచుండ్రు
కులశైలములచేతఁ గొమరొప్పుచున్న
యిలనున్నరాజన్యు లెల్లను నలర
సలలితలోకము ల్సంతోష మందఁ
జెలువొప్ప రాజ్యంబు శ్రీరాముఁ డేలె.

**Colophon :**

అని యంధ్రభాష భాషాధీశనిభుఁడు
వినుతకావ్యాగమ విమలమానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి
భూలోకనిధి గోన బుద్ధభూవిభుఁడు
తమతండ్రి విట్ఠల ధరణీశుపేరఁ
గమనీయగుణధైర్య కనకాద్రిపేర
ఘనుపేర మీసర గండనిపేర
లలితనిర్మలగుణాలంకారుపేర
నలఘునిశ్చలదయాయతబుద్ధిపేర
నాచంద్రతారార్క మై యొప్పమిగిలి

భూచక్రమున నతి పూజ్యమై వెలయు
నసమానలలితశ బ్దార్థసంగతుల
రసికమై చెలువొందు రామాయణంబు
పరగ నలంకార భావన లింపొందఁ
గర మర్థి నీయుద్ధ కాండంబు చెప్పె॥

*　　　*　　　*　　　*

ఎందాఁక భువనంబు లెందాఁకఁదార
లెందాఁక వేదంబు లెందాక ధరణి
యెందాక రాఘవా ధీశుకీర్తనము
ఎందాక ప్రబలమై యేపుదీపించు
నందాక నీకథ యక్షరానంద
సందోహదోహళా చారమైపరగు

(వి-వి.)—

ఆఱుకాండలు సమగ్రముగాఁగలవు. రెండు సంపుటములుగాఁ గట్టఁబడినవి. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. పాఠభేదములు, వివరణములు, అకడకడ వ్రాయఁబడినవి.

రంగనాథ రామాయణమని పేరొకనఁబడుచున్న యీ ద్విపద రామాయణము గో(కో)న బుద్ధభూపతి తన తండ్రియగు విట్ఠల భూపతి కోరికచొప్పున నాతని కంకితముగా రచియించినట్లు గ్రంథమునఁగలదు. రంగనాథుఁడను కవియే వారిపేళ్లుపెట్టి యట్టు రచించెనని లోకప్రతీతి. ప్రాచీనకవిస్తుతులలో రంగనాథుఁడే ప్రస్తుతుఁడయ్యెను. బుద్ధభూవిభుని యింటిపేరు కొన్ని ప్రతులలో 'కోన' అనియుఁ బెకుక ప్రతులలో 'గోన' అనియుఁగలదు. వీరి వంశవృక్షమిట్టిది :—

గో(కో)నకాటి భూపతి.
|
రుద్ర భూపతి.
|
బుద్ధ భూపతి.
|
విట్ఠల భూపతి.
|
* బుద్ధ భూపతి.

---

* ఈతఁడు గ్రంథకర్త.

ఈ బుద్ధభూపతి కుమార్లే, రామాయణోత్తర కాండమునుగూడ ద్విపద కృతిగారచియించినట్లు రంగానాథోత్తరరామాయణమునఁగలదు. కాని యదికూడ రంగనాథకవి రచించినదిగానే లోక ప్రతీతి గలదు.

---

## No. 982. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, paper. Size, 12½ × 7⅝ inches. Pages, 5,553. Lines, 15 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes

Bound in six volumes. First volume contains the Kāṇḍas 1and 2. Second volume contains the Kāṇdas 3, 4 and 5. The remaining three volumes contain the sixth Kāṇḍa; written on only one side of the paper. On the other side 62 pages contain the English summary by Mr. C. P. Brown. It is stated that this copy has been collated with 15 other manuscripts, and the variations in the readings noted.

Complete.

Same work as the above

In the beginning of Vol. I, the following notes of C. P. Brown are found :—

" This is a copy of the
Dvipada Ramayan
commonly called the
Ranganatha Ramayan.

This copy, was made for me in 1839 and I- have caused the various readings in fifteen manuscripts to be added. Upon these the new edition is to be founded.

C P. BROWN "

" That new edition has since been prepared. In the blank pages of the present volume I have written an English summary of the story, which is translated from an abstract or summary prepared under my directions in Telugu."

" Begun writing from
the manuscripts in 4 volumes
21 September 1839."

" I began to prepare this book by recording various readings, at Madras, on 19th September 1839. The collation of 15 manuscripts

terminated on 7th January 1840 but I had six people continually employed."

In the beginning of the summary—

"This Ramayan is vulgarly attributed to Ranganatha: but I cannot discover the reason The poet in pages 17—40 distinctly names himself Cona Buddha Raz, son of Cona Vitthal Bhupati, and these names are repeated in the final page of the Uttara Canda, or supplement.

"The poet states that his father was king of some portion of the Andhra country. But the name of his principality is omitted · as is also his era. Perhaps he was contemporary with Nannaia Bhatta. Neither poet mentions the other.

"Some of the learned are of opinion that Ranganatha is in truth the name of the author who as usual attributes the work to his patron."

In the end of Vol. VI, the following note is found :—

"End of the Yuddha Canda
or Sixth Book of Ramayan."

"This manuscript of the Telugu Dvipada Ramayan was completed under my directions at Madras in 1840. It contains the various readings found in fifteen different copies some of which were very ancient.

C. P BROWN"

(వి-వి.)—

సమగ్రము. ఆఱు సంపుటములలో ఆఱు కాండములును గలవు. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. ఒక ప్రక్కనుమాత్రమే గ్రంథము వ్రాయఁబడెను, రెండవవైపున 62 పుటలదాఁక బ్రౌనుదొరగారు ఇంగ్లీషున కథాసంగ్రహమును వ్రాసిరి. ఇది నై 98 రు వర్ణితమగు ప్రతికి మాతృకయగును. ఈప్రతి 15 ఇతర ప్రతులతో సరిచూడఁబడెనట! పాఠభేదము లాయాచోట్లఁ జూపఁబడినవి.

పూర్వమువోలె.

బ్రౌనుదొరగారు వ్రాసిన విషయములు ఇంగ్లీషునఁ జూడఁదగును.

## No. 983. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 18½ × 1⅜ inches. Pages, 198. Lines, 5 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes.

Breaks off here and there.

Contains a partion in the Yuddhakāṇḍa

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. యుద్ధకాండమున కొంతమాత్రము గలదు. వ్రాంత ప్రశస్తమయినది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

---

## No. 984. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, paper. Size, 12⅞ × 8⅛ inches. Pages, 307. Lines, 20 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Contains the Bālakāṇḍa complete and a portion of the Ayōdhyā-kāṇḍa.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. బాలకాండమును, అయోధ్యాకాండలోని కొంత భాగమును గలవు. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది 981 న వర్ణితమైన పుస్తకమునకు సాఫు ప్రతి.

పూర్వము వోలె

---

## No. 985. రామాయణము.

## RĀMĀYANAMU.

Substance, palm-leaf. Size, 18⅜ × 1½ inches Pages, 277. Lines, 8 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Contains the Bālakānda, Ayōdhyākāṇḍa and Sundarakāṇḍa complete.

(వి-వి.)—

అసమగ్రము. బాలాయోధ్యారణ్య సుందరకాండములు మాత్రము గలవు. వ్రాఁత తిన్ననిదే. తప్పులంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

### No. 986. రామాయణము.
### RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 17½ × 1¾ inches. Pages, 514. Lines, 8 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes.

Breaks off in many places

Contains the first five Kāndas complete and breaks off in the Yuddhakāṇḍa.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుంచి కలదుగాని యుద్ధకాండమున కొంత లేదు. వ్రాఁత మంచిదే. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు.

పూర్వమువలె.

---

### No. 987. రామాయణము.
### RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 15¾ × 1¼ inches. Pages, 624. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes.

Breaks off in many places

Complete.

Same work as the above.

At the end of the Ayōdhyākānda the MS. is dated as "Second day of the bright fortnight of the lunar month Pusya in the year Parābhava"; at the end of the Yuddhakānda it is stated that one Kṛṣṇayya, son of Bōyinapalli Raghupati, copied from a MS. belonging to Cōḍaya, son of Doṅgari Marrana and completed it on the 10th day of the dark ortnight of the lunar month Jyēṣṭha in the year Plavaṅga.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు.

పూర్వముపోలె.

అయోధ్యాకాండాంతమున "పరాభవ సం॥ పుష్య శుద్ధద్వితీయ" ను వ్రాయఁబడినట్లును యుద్ధకాండాంతమున "ప్లవంగనామ సంవత్సరం జ్యేష్ఠ బ॥ ౧౦ నాడు బోయినపల్లి రఘుపతి కుమారుడు కృష్ణయ్య దొంగరి మంగన కుమారుడు చోడయ (ప్రతినుండి) వ్రాసిన రామాయణమని"యు వ్రాఁత గలదు.

---

## No. 988. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 13 × $1\frac{1}{3}$ inches. Pages, 46. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Breaks off in some places
Contains the Sundarakāṇḍa only without the end.
Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. సుందరకాండము మాత్రము గలదు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వముపోలె.

---

## No. 989. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, $12\frac{3}{4}$ × $1\frac{1}{4}$ inches. Pages, 147. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old Mode of writing, good and free from mistakes.

Contains the Bālakāṇḍa only.
Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. బాలకాండ మాత్రము గలదు వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

---

## No. 990. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 15¾ × 1⅝ inches Pages, 349. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but contains mistakes.

The other work herein is Uṣāpariṇayamu

Contains the first five Kāṇḍas complete.

Same work as the above.

At the end of the MS. it is stated that the transcription was begun on the 12th day of the bright fortnight of the lunar month Śrāvana and was completed on the 2nd day of the dark fortnight in the year Vilambin.

(వి-వి.)—

ఆదినుండి యైదు కాండములు సమగ్రముగాఁ గలవు. శైథిల్యము, గ్రంథపాతములు, హెచ్చు. వ్రాఁత కన్నడమోడిగలది. తప్పులున్నవి.

పూర్వమువోలె.

తొలుత 36 పత్రములలో ఉషాపరిణయము గలదు. పుస్తకాంతమున నీవ్రాఁత గలదు :—

"విళంబి సంవత్సర శ్రావణ శుద్ధ ౧౨ ఆరభ్య భాద్రపద బ ౨ ల్లు మియు బెస్తారబరద రామాయణ పొస్తక ముగియుత్తు."

---

## No. 991. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 16¾ × 1⅞ inches. Pages, 435. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good and free from mistakes. Breaks off in many places.

Contains the Yuddhakāṇḍa only.

Same work as the above.

(వి-వి).—

అసమగ్రము. యుద్ధకాండ మాత్రమే కలదు. వ్రాంత మంచిదే. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు.

పూర్వమువలె.

---

No. **992.** రామాయణము.

RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 15 × 1⅛ inches. Pages, 50 Lines, 6 on a page. Character, Telugu Condition, very much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Contains the Sundarakāṇḍa without the beginning and the end.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు. సుందరకాండ మాత్ర మున్నది. అదియు మూఁడవ సర్గము కథనుండి 45 వ సర్గము కథ దాఁకనే కలదు.

పూర్వమువలె.

---

No. **993.** రామాయణము.

RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 16½ × 1⅝ inches Pages, 446. Lines, 9 on a page. Character, Telugu Condition, very much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes. Breaks off in many places and some leaves are missing.

Complete, but imperfect.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. షట్కాండములు గలవుగాని, పెక్కు పత్రములు గానరావు. చివరఁ బెక్కు పత్రములు లేవు. నడుమఁ గొన్ని లేవు. వ్రాంత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు.

పూర్వమువలె.

## No. 994. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 17 × 1⅛ inches. Pages, 132. Lines, 8 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes. Breaks off in many places.

Contains the first three Kāndas complete.

Same work as the above.

At the end of the Ayōdhyākāṇḍa it is stated that the MS. was copied on the 7th day of the dark fortnight of the lunar month Caitra in the year Pramāthin, by Īśvara, son of Timmayya of Pennāgaramtōta.

(వి-వి.)—

అసమగ్రము. మొదటి మూఁడు కాండలు సమగ్రముగను, నాల్గవ కాండ ఆరంభభాగ మించుకమాత్రముగను గలదు. వ్రాఁత మంచిదే. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు మిక్కిలి కలవు.

పూర్వమువోలె.

ఈ ప్రతిని పెన్నాగరంతోట పచ్చినాయని తిమ్మయ్య కుమారుఁడు ఈశ్వరు వ్రాసి ప్రమాదీచ సంవత్సరము చైత్ర బహుళ ౭ స్థిరవారము నాడు ముగించినట్లు అయోధ్యా కాండాంతమున వ్రాఁతగలదు.

---

## No. 995. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 15¾ × 1½ inches. Pages, 700. Lines, 8 on a page. Character, Telugu Condition, very much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes. Breaks off in many places.

Wants the beginning of the Bālakāṇḍa and the end in the Yuddhakāṇḍa.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. మొదట మూఁడాకులు లేవు, యుద్ధకాండము తుదిదాఁక లేదు. నడుమఁగూడ నక్కడక్కడ పెక్కు పత్రములు లేవు. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు.

పూర్వమువోలె.

## No. 996. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size 18½ × 1¼ inches. Pages, 166. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Contains the first two Kāṇḍas only.

Same work as the above

At the end of the first Kāṇḍa the name of the scribe is given as Nāraṇappa Nāyaḍu.

(వి-వి.)—

అసమగ్రము. మొదటి రెండు కాండలు మాత్రము కలవు. వ్రాఁత చక్కఁగ నున్నది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

ఇది "నారణప్పనాయఁడి స్వహస్త లిఖిత" మని మొదటి కాండ చివరఁ గలదు.

---

## No. 997. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 14¾ × 1⅝ inches. Pages, 518. Lines, 9 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes. Breaks off in many places.

Contains the first five Kāṇḍas complete and breaks off in the sixth Kāṇḍa

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండి యాఱవ కాండమునఁ గొంతదాఁకఁ గలదు. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు మిక్కిలి యెక్కువగాఁ గలవు.

పూర్వమువలె.

## No. 998. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 15½ × 1¼ inches. Pages, 64 Lines, 5 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes. Breaks off in many places.

Contains the Sundarakāṇḍa complete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. సుందరకాండ మాత్రము గలదు. వ్రాంత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు.

పూర్వమువలె.

---

## No. 999. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 12¾ × 1⅛ inches Pages, 212. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Contains the Kiskindhākāṇḍa and the Sundarakāṇḍa complete

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. కిష్కింధా సుందరకాండములు మాత్రము గలవు. వ్రాంత యంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No 1000. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, paper. Size, 12 × 6⅛ inches. Pages, 962. Lines, 22 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good and free from mistakes. The variations in readings are interlined. Bound in three volumes.

Contains the Kāṇḍas 1 and 2 in the first volume, Kāṇḍas 3, 4 and 5 in the second volume and the 6th Kānda in the third volume.

Complete.

Same work as the above.

The following notes of C. P. Brown are found at the end of Vol. I :—

" The present MS. bound in four volumes formed the basis of the new edition. The following are the manuscripts used Nos, 426, 427, 428, 429, 430 belong to me. Nos. 1001, 1003, 1004, 1005, 1006, 1007 belong to others. Total thus for thirteen MSS "

" Commenced this collation, 19th September 1839, commenced fair edition, 25th November. Finished collation, 10th January 1840."

The following note of C. P. Brown is found at the end of Vol. III :—

" The present manuscript of the Ramayan formed the basis of the edition framed in 1839–1840 In the following pages is a memorandum of the various manuscripts collated As usual I denote the MSS. by numerals. Five are my own property and are marked Nos. 426, 427, 428, 429 and 430. The rest marked 1001, 1002, 1003, 1004, 1005, 1006, 1007 are lent me by various Telugus."

(వి-వి.)—

సమగ్రము. మూఁడు సంపుటములు గలవు. కాని, యుద్ధ కాండము తొలిపట్టుగల సంపుటము మూఁడవది యిందు లేదు. ఉన్న మూఁడవ సంపుటము నాల్గవ సంపుట మనఁదగినది. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. అనేక పాఠభేదములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమునోలె.

---

## No. 1001. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, $17\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 512. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, old. Mode of writing, good and free from mistakes. Many leaves are missing.

Wants the beginning in the Bālakāṇḍa and the end in the Yuddhakāṇḍa.

Same work as the above.

At the end of the Āranyakāṇḍa it is stated that Jonnalagaḍḍa Vēnkaṭēcalam copied this MS from a MS. relating to Acyutanna

Pāparāju. Date of transcription: Thursday, the 4th day of the bright fortnight of the lunar month Pusya

(ఏ-ఏ.)—

అసమగ్రము. ఆదినుండి ఆఱు కాండములు గలవు. బాల కాండమునఁ గొంత యుద్ధకాండమునఁ గొంత లేదు. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము, గ్రంథపాతములు ఆరంభమున హెచ్చు.

పూర్వమువలె.

అరణ్య కాండాంతమున నిట్లు గలదు:—

"కీలకనామ సంవత్సర పుష్య శు ౪ గురువారంవరకు అచ్చ్యుతన్న పాపరాజుగారి ప్రతినున్న క్రమానను జొన్నలగడ్డ వేంకటాచలం అరణ్య కాండ శ్రీరామార్పితంగాను సంపూర్ణంగా వ్రాసినాను." మఱియు సంతరావూరి చెన్నరాయడు చెదలువాడ రఘునాయకులు స్మరింపఁబడిరి.

---

## No. 1002. రామాయణము.
## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 17½ × 1½ inches. Pages, 450. Lines, 7 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes. Breaks off in many places

Contains the Yuddhakāṇḍa incomplete.

Same work as the above.

(ఏ-ఏ.)—

అసమగ్రము. అసమగ్రముగానే యుద్ధకాండమాత్రము గలదు. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము మిక్కిలి హెచ్చు, గ్రంథపాతము లున్నవి

పూర్వమువలె.

---

## No. 1003. రామాయణము.
## RĀMĀYAṆAMU.

Substance, paper. Size, 12 × 7¾ inches. Pages, 652. Lines, 20 in a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, new Mode of writing, good and free from mistakes.

Contains the first three Kāṇḍās complete.

Same work as the above.

This was transcribed from the MSS. described under Nos. 981 and 982 ante.

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండి అరణ్యకాండాంతముదాఁకఁ గలదు. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. సంస్కృత రామాయణమునను, భాస్కర రామాయణమునను లేని, అధికకథల కిందు సూచికలు గలవు.

నెం. 981, 982 వానిబట్టి వ్రాయఁబడిన శుద్ధ ప్రతి యిది.

పూర్వము వోలె

---

## No. 1004. రామాయణము.

## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 16¾ × 1⅝ inches. Pages, 702. Lines, on a page. Character, Telugu Condition, much injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Breaks off in many places.

Wants the Sundarakānda ; otherwise complete

Same work as the above.

At the end of the Kiskindhākāṇda it is stated that Krsnabhatta of Nāgāvadhānula family wrote this MS.

(వి-వి.)—

అసమగ్రము. 1, 2, 3, 4, 6 కాండలు మాత్రమున్నవి. సుందరకాండము లేదు. కడపట నొక పత్రము పోయినది. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు, హెచ్చు.

పూర్వము వోలె.

ఈ ప్రతిని "నాగావధానుల కృష్ణంభట్టు" వ్రాసినట్లు నాలుగు కాండల చివరలందును గలదు.

---

## No 1005. రామాయణము.

## RĀMĀYAṆAMU

Substance, palm-leaf. Size, 17½ × 1⅝ inches. Pages, 134. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes. Breaks off in some places.

Contains the Bālakāṇḍa incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. బాలకాండము సమగ్రముగాఁ గలదు. వ్రాఁత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు, అల్పముగాఁగలవు.

పూర్వము వ్రాఁతె.

కడపట ' తిరునామము ' అని వేదాంత కీర్తన గలదు.

---

## No. 1006. రామాయణము.
## RĀMĀYAṆAMU.

Substance, palm-leaf. Size, 13⅜ × 1½ inches. Pages, 120. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Contains the Sundarakāṇḍa without the beginning and end.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. యుద్ధకాండమున కొంత భాగమును, సుందరకాండమును గలవు. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు, లేవు.

పూర్వము వ్రాఁతె.

---

## No. 1007. రామాయణము.
## RĀMĀYANAMU

Substance, palm-leaf. Size, 13 × 1½ inches. Pages, 211. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Contains the Kiskindhākāṇḍa and Sundarakāṇḍa only.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. కిష్కింధా సుందరకాండములు మాత్రము గలవు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు

పూర్వము వ్రాఁతె.

## No. 1010. వాసిష్ఠరామాయణము.
## VĀSIṢṬHARĀMĀYAṆAMU.

Substance, paper. Size, 10 × 8 inches. Pages, 524. Lines, 17 on a page. Character, Telugu Condition, much injured. Apperance, very old. Mode of writing, bad and contains mistakes.

Complete in five Āśvāsas.

A poem in the Dvipada metre of the Sanskrit work of the same name. The authoress Tarigoṇḍa Vēngamāmba has also written Vēṅkatēśvaramāhātmyamu, Rājayōgasāramu, Dvipadabhāgavatamu, etc. The work under notice has been dedicated to god Nṛsiṁhasvāmi, worshipped at Tarigoṇḍa.

**Beginning:**

శ్రీ విఘ్ననాథుని క్షేత్రపాలకుని
శ్రీవాణిని విరించిని హయాననుని
అలఘుదుర్గను జౌడమాంబను శివుని
నలవరాహస్వామి నాత్మయందుంచి
భక్తినందుంచి(?) సుబ్రహ్మణ్యగురుని
ముక్తిప్రదుని పాదముల నాశ్రయించి
మురిసి నవగ్రహమ్ములకుఁ గేల్మొగిచి
ధరణిమీఁద మదాత్మ తరియించుకొఱకు
సామోదమతిని సుజ్ఞాన వాసిష్ఠ
రామాయణార్థసారమును గ్రహించి
వరుసగా ద్విపద కావ్యముగా రచించి
యరలేక మీకు సమర్పింతు నిపుడు.
శ్రీతారకోల్లాస శ్రీశ్రీనివాస
శ్రీతరిగొండ నృసింహ ధూతాంహ
విన్నవించెద నేను వినుఁ డదెట్లనిన:—
మున్ను భరద్వాజ మునిపుంగవుండు
మోక్షేచ్ఛ నిజచిత్తమునఁ బ్రకాశింప
నక్షీణభక్తిఁ బ్రియమ్మా రెట్టింప

**End:**

సీతతోఁ బట్టాభిషిక్తుఁడై సురలు
ఖ్యాతిగాఁ బొగడ నుతకంఠ దీపింప
గురుతర కళ్యాణ గుణగణుండగుచు

పరమాత్మ తా నను భావ మేమఱక
పరిపూర్ణ భావ సంపన్నుఁడై ప్రజలఁ
బరమశాంతాత్ముఁడై పాలించుచుండె
అని భరద్వాజ సంయమికి వాల్మీకి
ఘనతరజ్ఞాన యోగప్రకారంబు
వినిపింప నంతయు విని భరద్వాజుఁ
డనఘుఁడై వాల్మీకి కంజలిచేసి
కొనియాడి యచ్చట గురుభక్తి మెఱయ
ననుపమ విజ్ఞానియై శాంతిఁ బొంది
శమదమ ప్రముఖభాస్వర సద్గుణముల
నమర జీవన్ముక్తుఁడగుచు సుఖించె
నిది సోమనాథ విశ్వేశ్వరస్వామి
పదపద్మభక్త సుబ్రహ్మణ్యయోగి
చరణాంబుజాత షట్చరణాయమాన
పరిపూర్ణ నిత్యసద్భావనిమగ్న
మానసాంబుజ వెంగమాంబికారచిత
మై నిత్యమై సత్యమై పూర్ణమైన
సామార్థసార సుజ్ఞాన వాసిష్ఠ
రామాయణంబను రమ్యసద్ద్విపద
యందంత పంచమంబను ప్రకరణము
నందమై విమల మోక్షకరంబగుచు
శ్రీతరిగొండ నృసింహుం డనంగ
ఖ్యాతిగా వెలయు వెంకటరాయ నీదు
పదయుగళికి సమర్పణ మయ్యె దీని
సదమలులై వ్రాసి చదివిన వినిన
నరులుతాపత్రయార్ణవము తరించి
పరమైన నిర్వాణ పదము నొందుదురు
భూచక్రమున నిది పురుషార్థ మగుచు
నా చంద్ర తారార్కమై యుండుఁగాక.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత యంత మంచిదిగాదు. తప్పు లల్పముగాఁ గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సంస్కృతమునగల జ్ఞానవాసిష్ఠ రామాయణము సర్గసారమును గ్రహించి, తరిగొండ వెంగమాంబయను యోగిని ద్విపద రూపమున నైదు ప్రకరణములుగా నీ గ్రంథమును రచియించెను. వేంకటేశ్వర మాహాత్మ్యము రాజయోగసారము, ద్విపద భాగవతము, మొదలగు నవి యీమె యితర కృతులు. తరిగొండ నృసింహస్వామి కీకృతి సమర్పింపఁబడినది.

---

## No. 1011. వైశ్యపురాణము.

## VAIŚYAPURĀṆAMU.

Substance, paper. Size, $9\frac{5}{8} \times 6\frac{3}{8}$ inches. Pages, 167. Lines, 17 on a page. Character, Telugu. Condition, injured Appearance, old. Mode of writing, good but full of mistakes.

Complete in one Āśvāsa.

Similar to the works described under Nos. 316—320 *ante ;* by Bhāskarācārya.

సమగ్రము (ఏకాశ్వాసము).

వ్రాఁత మిక్కిలి బాగున్నదిగాని తప్పులు కుప్పతెప్పలుగా నున్నవి.

ఈ ద్విపదకావ్యము నె 316 రున వర్ణింపఁబడిన గ్రంథము వంటిదే. ఇందు ఛందోవ్యాకరణ విరుద్ధము లుండుటయేకాక కవిత యు రసహీనముగా నున్నది. ఏతద్ గ్రంథకర్త భాస్కరాచార్యుఁడు. ఇతఁడు నె 361 రున వర్ణించిన పద్య కావ్యమునకు కర్తయైన భాస్కరాచార్యుఁడు గాక పోవచ్చును. ఈ గ్రంథము వైశ్యులందఱికి సంకితము చేయఁబడినది.

**Beginning :**

శ్రీనగరేశు నాశ్రితవ్రాన్ని వేశు
దానవవిధ్వస్తు ధర శూలహస్తు

* * * *

అతిభక్తిఁగొనియాడి యాత్మలోఁదలఁచి
యతివినయోన్నతి హర్షంబుతోడి

*     *     *     *

భారవిశివభద్రబాణ మల్హణుల
చోరమయూరవచోవిలాసముల
భాసమానుండనై ప్రజ్ఞావిభూతి
రాశికినెక్కి పురాణంబుచెప్పఁ
దలఁచిన యప్పుడతలపెల్లనెఱిఁగి
యిలలోవలను నూటయిబ్బంద్రువైశ్య
కులశేఖరులు మదిఁగూరిమినన్న.
భాస్కరాచార్యులం బరువడిఁబిల్చి న
మస్కారములుచేసి మాకులంబునకు
గురువవు కర్తవుకుంభినియందు
సరసుఁడుత్తముఁడవు శాశ్వతమతివి
యనుచు నానాభూషణాంబరావళులు
ఘనముగానిచ్చియుఁ గడుభక్తిమ్రొక్కి
వైశ్యపురాణంబు వసుమతి సకల
ఐశ్వర్యములు చాలనందుచునుండు
ననవిల్తులగు బాలనగరాలపేర
ననునొంప నొకకథ యానతిండనిన.

**End:**

అవ్యాహతైశ్వర్యులై వృద్ధిబొంది
భవ్యగంభీరులై బాలనగరాలు
కరుణావాసవ కన్యకాప్రసాదమున
నిరవొందఁగానగరేశు సతత్ప్రపను
జెలఁగిరి తమ పూర్వజన్మపుణ్యముల
ఫలమునఁజేసి సుప్రభఁజెందిరంత
ననుచుసాలంకాయ నాఖ్యమునీంద్రుఁ
డొనరంగఁజెప్ప మాహాత్మ్యకులగుచు
విని మౌనిపతికిని వెలయుదండంబు
లొనరించి సంతోషయుక్తులై వైశ్య
మునులునుతించియు మోదంబుతోడ
ననఘమానసులుండి రచ్చోటనంత

**Colophon:**

అనుచుధీనిధీ భాస్కరాచార్యగురుఁడ
వినుతనానాశాస్త్రి వేదపాలితుఁడ
గురువైన గౌతమగోత్రపవిత్ర
చరితుండ భారతీ జీవితేశ్వరుని
కులసంభవుఁడ నీతిగుణవిశారదుఁడఁ
గలిత శబ్దార్థ సంగతులతోఁడుతను
వలనొప్పమించు గీర్వాణపురాణ
మేవడ రచియించి తంద్రభాషణను
రసికడింభకనగరావళిపేర
న సమాననీతి విఖ్యాతులపేర

* * * *

శంకరపాదాబ్జ సేవకుపేర
నంకితం బొనరించి తనఘులుమెచ్చ
నిది పుణ్యకథ మర్త్యులెవ్వరు వినినఁ
జదివిన వ్రాసినఁ జారుసంపదల
నలరుచుఁ బుత్రపౌత్రాభివృద్ధిగను
వెలయుదు రెప్పుడు విశ్వంబులోన . . . .

---

No. **1012**. శివరహస్యఖండము.

ŚIVARAHASYAKHAṆḌAMU.

Substance, paper. Size, 12¾ × 8 inches. Pages, 893. Lines, 20 in a page. Character, Telugu. Condition, fair. Appearance, very old. Mode of writing, good but full of mistakes. Breaks off in many places.

Incomplete

Similar to the work described under Nos. 322 and 323 *ante* ; by Aubaḷakavi, son of Siddhana.

**Beginning:**

శ్రీమించు కాంచీపురీ ప్రదేశమునఁ
బ్రేమదైవాఱవారిజ సంభవుండు

* * * *

మునులార మీతపంబున కర్హమైన
వనము నైమిశ మని వలనుగాఁ దెలుప

*　　　*　　　*　　　*

అందువారలు సహస్రాబ్ద సంజ్ఞకముఁ
జెందిన యజ్ఞంబు సేయుచున్నంత
వ్యాసశిష్యుఁడు సూతుఁడను తపోధనుఁడు
ఘనత నాయజ్ఞంబు గనుఁగొనుమమత

*　　　*　　　*　　　*

. . . తదాశ్రమ వాసమాని
వరభాగ్య మనయజ్ఞవాటికఁ జేర

*　　　*　　　*　　　*

తగుప్రేమ గుహుచరిత్రము సమస్తంబు
నొగిఁ జెల్పిమమ్ము ధన్యులఁ జేయుము

*　　　*　　　*　　　*

అని విన్నవించిన నాశౌనకాది
మునులకు సూతుఁడింపుగనిట్లులనియె.

*　　　*　　　*　　　*

. . సప్తకాండల కాధారమగుచుఁ
దనరినయట్టి స్కాందపురాణమందు
మునువు వేద వ్యాసమునివరుచేత
గుహుచరిత్రమును దద్గురువిక్రమములు
విహితవైఖరులచే వివరింపఁబడియె
నది మీకుఁ దెలిపెద నతి వేడ్కననుచు
సదయుఁడైరో(రా !)మహర్షణి యిట్లనియె.

**End :**

మోదంబుతో నంత ముచికుందు నలిచి
యాదరమున గుహుఁ డఖిలలోకములు
పాలించె నంచును బరమసంతోష
శీలుఁడై సూతుండు చెప్పెనటంచు
మునులంద రానందమునఁ జెందిరంత.

**Colophon :**

అని జానకీహృదయాధీశ పాద
వనజమరంద సేవనవరభృంగ
మగువింటిసిద్ధన యాత్మసంభవుఁడు
సుగుణాఢ్యుఁడౌబళసుకవి శేఖరుఁడు
నైమిశారణ్య పుణ్యస్థలిమునుల
తో ముదంబునను సూతుఁడు చెప్పినట్టి
స్కాందపురాణశంకర సంహిత నెడు
అందును శివరహస్యాఖ్యఖండమున
దేవకాండముఁ జెప్పె ధీయుక్తిచేత
భావించిబుధజనుల్ప్రస్తుతి సేయ.

* * * *

ఎందాఁక గుహుకీర్తి యెసఁగుచునుండు
నందాఁక నీకథ యవని బెంపొందు.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లెక్కువ గాఁగలవు. గ్రంథపాతము లధికము గాఁగలవు. సంభవాసుర వీర మాహేంద్ర యుద్ధదేవ కాండములు గలవు. అందును గొన్నింటి కాద్యంతములు లేవు. కృత్యవతరణిక లేదు.

స్కాంద పురాణమందలి శివరహస్య ఖండమున కిది తెలుఁగుచేఁత. వింటిసిద్ధన కుమారుఁడగు నౌబళ కవి దీనికిఁ గర్త. డి 322, 323 నెం. వర్ణితములగు గ్రంథములకును దీనికిని రచనమున మాత్రమే భేదము.

---

## No. 1013. శ్రీభాగవతము.

## ŚRĪBHĀGAVATAMU.

Substance, paper. Size, $13\frac{3}{8} \times 8\frac{1}{2}$ inches. Pages, 322. Lines, 22. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, bad, contains mistakes and breaks off in some places.

Contains the Skandhas 1—6 only.

A poem in the Dvipada metre describing the story of the Śrībhāgavata. The authoress Vēṅgamāmba of Tarigoṇḍa belonged to the Nandavarīka sect of Telugu Brāhmaṇas and was the daughter of

Krsnārya and Maṅgamāmba of Vasisthagōtra. She was a disciple of Subrahmaṇyaguru It is stated at the end of the work that she wrote this work after praying the feet of one Vēnkaṭācalapati, son of Timmayya of Śrīvatsagōtra. It is presumed that she became a widow in her girlhood and the abovementioned Vēṅkaṭācalapati was her husband. Prior to this work, she has written (1) Narasimhaśatakamu, (2) Narasiṁhavilāsamu, (3) Śivanāṭakamu, (4) Rājayōgasāramu (Dvipada), (5) Krsnanāṭakamu, (6) Pārijātāpaharaṇamu, (7) Ramāpariṇayamu, (8) Ceñcunāṭakamu, (9) Rukmiṇīnāṭakamu and (10) Gōpikānāṭakamu For other particulars see the Telugu extracts given below.

**Beginning:**

శ్రీ గణపతిని శ్రీ క్షేత్రపాలకుని
వాగొప్ప . . .
. . . (నంద) వరకులంబిలను
సారంబుగాఁ బ్రోచు చౌడాంబఁదలఁచి
వరుససూర్యాది నవగ్రహంబులకు

* * * *

నాయిష్టదైవమైనన్న సంతతముఁ
బాయకున్నటువంటి పట్టాభిరాము
విగ్రహంబాత్మలో వీక్షించివిద్య
కగ్రేసరుండైన హాయముఖుఁ బొగడి

* * * *

తరిగొండ పురధాముఁదారకనాము
నాది నారాయణు నాత్మయందుంచి

* * * *

పరిపూర్ణ నిర్గుణ బ్రహ్మమైనిలిచి
ధరణిపైఁ బండితోత్తముఁడన వెలసి
వరకృపతోడ మద్వరదుఁడైనన్నుఁ
బాలించుచున్న సుబ్రహ్మణ్యగురుని
శ్రీలలితాంఘ్రి రాజీవయుగ్మమును
హృదయపద్మంబునం దిరవుగానుంచి
ముదము దీపింప సన్మోక్షచింతనము
చేయఁగ భూసుర శ్రేష్ఠునిమాడిర-
నాయంబుజోదరుఁ డాదరంబెసఁగ

ఘనతరంబైనభా గవతంబునందు
మొనసినతత్వార్థములను పామరులు
తెలియ లేరటుగాన తేటగాఁ దత్వ
ముల నెల్ల సంక్షేపముగ రచియించి
హరిపరాక్రమములు హరివిహారములు
హరియవతారముల్ హరిమహాత్వంబు
పొలుపొంద విస్తరింపుము నీవటంచు
పలికినంతన(నంవన) నిట్టి భాగ్యంబు నాకు
కలిగించు మనుచు వెంకటగిరీశ్వరుని
తలఁపగాతటికొండ ధాముఁడైయతఁడు
నీలాభ్రవర్ణుఁడై నిరుపమహేమ
చేలుఁడైమోముపై చిరునవ్వుమెఱయ
కరుణాకటాక్షవీక్షణముదీపింప
సరసుఁడైమధ్యాహ్న సమయంబునందు
చిన్నికృష్ణునిరీతి చెంతకువచ్చిఁ
వన్నగాఁదెచ్చిశ్రీ భాగవతంబు
నన్నుచేకొమ్మని నా చేతికిచ్చి
సన్నసైఁగలనిది సారంబుగాను

* * * *

నాచిన్ననాఁట నోనామాలనైన
నాచార్యులెవరునా కానతీలేదు
ఇఁక నేమిచెప్పుదు నెట్టులోవాణి
సకలంకుఁడైజిహ్వ యందుం దుంచెగురుఁడు
అటుగాననారసింహాంకిత శతక
మటమీఁదనారసింహ విలాసకథయు
నటశివనాటకం బదియునుగాక
నటరాజయోగసా రాఖ్యమౌద్విపద
నటకృష్ణనాటకం బదియును గాక
యటపారిజాతా పహరణసత్కృతియు
నటరమాపరిణయంబను పెండ్లిపాట
యటచెంచునాటకం బనుశౌకకథయు
మఱియును శ్రీకృష్ణమంజరి యవల

నిరుపమ శ్రీరుక్మిణీ నాటకంబు
కరమొప్ప నలగోపికానాటకంబు
విరచించిభక్తితో వేంకటశైల
వరమందుఁదరిగొండ వాసుఁడైనన్ను

* * * *

సరసవిజ్ఞాన లక్ష్యమునిచ్చినట్టి
శ్రీనివాసస్వామిశ్రీ పాదములకు
పూనియర్పించితిప్పుడు సంతసమున
ఫలితార్థమైనశ్రీ భాగవతంబు

* * * *

జగతినీయమరుల జన్మప్రకార
మగణితభక్తితో ననవరతంబు

**End:**

వినునట్టివారు వివేకులైముక్తి
ననఘులైపొందుదు రనిశుకయోగి
చిరకృపతోఁబరీక్షితునకువేడ
నరుదుగానెఱిగించె ననుచుసూతుండు
సంతోషమొదవగ శౌనకాదులకు
వింతగాఁ జెప్పె నీవృత్తాంత మెల్ల
నని యిట్లు శేషాచలాధీశుఁడగుచు
తనునేలుతఱిగొండ ధాముని పేర
ధరపైని వెలయునందవరాన్వయుండు
గురుతరసువసిష్ఠ గోత్రసంభవుఁడు
కానాలివంశసాగరహిమాంశుండు
నైనకృష్ణార్యునకతిభక్తితోడ
నంగనయగుమంగ మాంబగర్భమున
సంగతికృష్ణుండు సైదోడుగాంగ
వెంగమాంబికప్రభ వించి లింగాంగ
భంగంబుకొఱకు సుబ్రహ్మణ్యగురుని
చరణాబ్జయుగళిహృజ్జలజమందుంచి
యరసిపూజించి త దనుమతివడిసి
వరుసగానుంజేటి వంశభూషణుఁడు

గురుతరశ్రీవత్స గోత్రసంభవుఁడు
ఘనుఁడైనతిమ్మయా గ్రణిపుత్రుఁడనఁగ
జనులెన్ను వేంకటా చలపతి పాద
వనజయుగ్మంబుభా వంబునందుంచి
యనుపమంబైనమో క్షాసక్తితోడ
వలనొప్పశ్రీభాగవతమునందొనర
నిలనుషష్ఠస్కంధ మిరవుగాద్విపద
గావిరచించివేంకటగిరీశ్వరుని
పావనశ్రీపాద పంకజంబులకు
శరణనిమ్రొక్కిస జ్జనులుమోదింప
పరమభక్తినిసమ ర్పణముగావించె
నిది వేదసారార్థ మిదిసుఖప్రదము
నిది మోక్షదాయక మిరవైనభక్తి
నిది వ్రాయువారలు నెల్లకాలంబు
చదువుచుండెడివారు సారజ్ఞులగుచు
విధి తార్థసూక్తులు వినుచున్నవారు
సదమలచిత్తులై శాంతివహించిఁ
యనఘులైసౌఖ్యంబు లనుభవింపుచును
ఘనయోగయుక్తులై గాంతురుముక్తి
కులగిరు లెందాక కొమరొప్పఁజంద్ర
జలజాప్తులెందాక సంచరింపుదురు
వననిధు లెందాక వర్ధిల్లుచుండు
ఘనదిశులెందాక కరమొప్పుచుండు
నందాకనీకృతి యతిరమ్యమగుచు
నందనందనున కానందంబుగాన
అరుదుగాఁదరిగొండ హారిదైనశేష
ధరణీధరేశ్వరు దయచేతఁ దనరి
పసమీఱ మత్పుణ్య ఫలసాలమగుచు
వసుధాతలంబున వర్ధిల్లుఁగాత ॥

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండి యాఱు స్కంధములు మాత్ర మిందు గలవు. వ్రాఁత రెండు మూఁడు తెఱఁగులది. మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. కొద్దిగా గ్రంథపాతములు గలవు.

శ్రీవిష్ణు భాగవత మహాపురాణమునకిది ద్విపదరూపమగు తెలుఁగు సేఁత. నందవరిక బ్రాహ్మణియగు తరిగొండ వెంగమాంబ దీనికిఁ కర్త్రి. వసిష్ఠగోత్రుఁడు, కానాలవంశ్యుఁడు, నగు కృష్ణార్యునకీమెకుమార్తె. ఈమె తల్లిపేరు మంగమాంబ. సుబ్రహ్మణ్యగురున కీమె శిష్యురాలు. శ్రీవత్సగోత్రుఁడును, నుంజేటివంశ్యుఁడును, నగు తిమ్మయకుఁ గుమారుఁడయిన వెంకటాచలపతి పాదములను భావమునను౦చుకొని తానీ గ్రంథము రచించిన ట్లీమె గ్రంథాంతమునఁ జెప్పుకొన్నది. బాల్యముననే యీమెకు వైధవ్యముగల్గెనని ప్రతీతి. మీఁదఁ బేర్కొనఁబడిన వెంకటాచలపతి చిన్ననాఁడే చనిపోయిన పెనిమిటి యేమో! ఈమె యీగ్రంథ రచనకుఁ బూర్వము, నరసింహ శతకము, నరసింహ విలాసము, శివనాటకము, రాజయోగసార ద్విపద, కృష్ణనాటకము, పారిజాతాపహరణము, రమాపరిణయ మను పెండ్లిపాట, చెంచునాటకము, శ్రీకృష్ణమంజరి, రుక్మిణీనాటకము, గోపికానాటకము, నను కృతుల రచించినట్లిందుఁ బేర్కొనెను. అందులో రాజయోగసార మిక్కడ ఆర్ నెం 31 రున వర్ణితమైనది ఈ భాగవతరచనానంతరమునుగాఁ బోలు నీమె, వేంకటాచలమాహాత్మ్యము, వాసిష్ఠరామాయణము, నను కృతులఁగూడ రచియించెను. ఈ గ్రంథము వేంకటాచల శ్రీనివాసస్వామికి సమర్పితము.

విష్ణుభాగవతము నీమెగాక, యీమెకంటెఁ బ్రాచీనులు, దోనేరి కోనేరి నాథుఁడు, తేకుమళ్ల రంగశాయి, యను కవులుగూడఁ ద్విపదరచనతోఁ దెలిఁగించిరి. ఆర్ నెం 697 రు రంగశాయి కృతియు డి॥ నెం 972 రు కోనేరినాథుని కృతియు వర్ణితములయినవి.

---

## No. 1014. శ్రీనివాసవిలాససేవధి.

## ŚRĪNIVĀSAVILĀSASĒVADHI.

Substance, paper. Size, 12¼ × 8¼ inches. Pages, 463. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete but imperfect. Mr. C. P. Brown's English notes on lose sheets are found here and there.

A poem in the Dvipada metre in six chapters describing the sanctity of the mountain at Tirupati and the greatness of God Śrīnivāsa orswhipped therein. It is stated that this work has been written after

going through the Vēṅkaṭācalamāhātmya contained in the Vāraha, Vāmana Brahmāṇda, Pādma, Gāruḍa, Skānda, Mārkaṇḍēya and other purānas The author Śrēṣṭhalūri Vēṅkatārya was the son of Kṛṣṇayārya and Laksmi of Bhāradvājagōtra and was a pupil of Appalācārya of Vādhūla family. The work is dedicated to God Śrīnivāsa. It is stat ed that the author knew eight languages and composed works in Sanskrit, Prākṛta, Tamil and Telugu languages and used to perform Aṣṭāvadhāna

**Beginning:**

శ్రీకాంత కిరవుగాఁ జెలఁగు పేరురము
వైకుంఠ మిదె యంచు వంచినకరము
మలసి నిగ్గులు గులుకు మకరకుండలము
లలరు కౌస్తుభశోభి హారమండలము
కంతుసంకునకు నగ్గలమైనగళము
వింతదర్పణము నవ్వెడు గండతలము
కరుణఁ జిలుకు వెడంద కన్నులకీవి
చిఱునవ్వు తేటమ్మొరంజిల్లు కెమ్మోవి.

* * * *

వరలంగ వాధూలవంశావతంసు
వాచాతిగజ్ఞానవైభవు నస్మ
దాచార్యు నన్నావి నప్పలాచార్యు
భజియించి వాల్మీకి బాదరాయణుని

* * * *

ఒక కావ్యమొనరించ నూహఁదలంచి
యకలంక సత్కథ లరయుచుండంగ

* * * *

ధర సంస్కృత ప్రాకృతముఖభాషలను
ద్రవిడాంధ్రములఁ బ్రబంధము లెన్నియైన
సవరించితివి మాకు సంతసం బెసఁగ
నొక కృతి శేషాచలోరు వైభవము
ప్రకటితాలంక్రియాస్పద వర్ణనలను
వినువక శృంగార వీరాద్భుతాది
రసములు భావముల్ రంజిల్లునట్లు
ద్విపద లోకుల కెల్లఁ దెలివిడిగాఁగ

ద్విపదగాఁ దెనుఁగునఁ దేటగావించు
వారాహవామన బ్రహ్మాండపాద్మ
గారుడస్కాంద మార్కండేయముఖ్య
బహుపురాణోక్తి సంబాధంబువలన
గహనమై పెనఁగొన్నకథ చిక్కుదీర్చి

*  *  *  *

వెలయఁదెనుంగున ద్విపదకావ్యముగ
నలవేంకటాద్రి మాహాత్మ్య మింపొంద
శ్రీనివాసవిలాస సేవధియనఁగ
భూనుతవిఖ్యాతి పొసఁగ సల్పెదను

*  *  *  *

అతిమహౌదార్యభూర్యమరభూజునకు
వితతతేజునకు గోవింద రాజునకు
పూని సమర్పితంబుగ నే నొనర్చు
శ్రీనివాస విలాససేవధియందు
భువనపావన గుణాఢ్యుత తిరు మహిమఁ
గవినుతంబగు కథాక్రమ మెట్టి దనిన.

**End :**

ఎల్లవారలు విని యింపొందునట్లు
తెల్లమిగాఁ దేర్చి తెనుఁగున ద్విపద
లారపొంద రసభావయుక్తి సంగతుల
వరలియష్టాదశవర్ణనల్ మెఱయ
శ్రీనివాస విలాససేవధియనఁగ
పూని మహాకావ్య పూర్ణలక్షణము

*  *  *  *

పావనభక్తాప్తబంధుని పేర
గోవింద రాజున్ముకుందుని పేర
శ్రేష్ఠలూర్యన్వయ శ్రేష్ఠ శీలుండు
శ్రేష్ఠమహాశయ శ్రీధురీణుఁడు
గోత్ర భారద్వాజ గోత్రవర్ధనుఁడు
సూత్రదాపస్తంభ సూత్రానువర్తి
అష్టభాషాకవి త్వార్జితప్రౌఢ్య

దష్టావధానవిఖ్యాతబైరుదుఁడు
శ్రీకృష్ణయార్యలక్ష్మీగర్భవార్ధి
రాకాసుధానిధి రాజపూజితుఁడు
వివిధ విద్యాశాలి వేంకటార్యుండు
నవరించు శ్రీనివాస విలాసమునకు
హారు వొందు నిదియె షష్ఠాశ్వాస మగుచు
ధరఁ బొల్చు నాచంద్ర తారకంబుగను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. కాని కాగితములు నిస్సారములుగా నున్నవి. గ్రంథపాతము ద్వితీయాశ్వాసాంతమునఁ గలదు. బ్రౌను దొరగారి యాంగ్లోపోద్ఘాతము విడి కాగితములమీఁదఁ గలదు. అది గ్రంథము నడుమఁ జేర్చఁబడినది.

వారాహవామనపాద్మ గరుడ పురాణములందుఁగల వేంకటాచల మాహాత్మ్య కథలను వరుసఁగాఁ గూర్చి పూర్వాపర విరోధము కల్గకుండ సరిపఱచి, శ్రేష్ఠలూరి వేంకటార్యుఁడను కవి యాఱాశ్వాసముల యీ ప్రశస్త ద్విపద ప్రబంధమును రచియించెను. కవి దీనికి శ్రీనివాస విలాససేవధి యని పేరుంచెను. తిరుపతి శ్రీనివాసమూర్తికే యిది సమర్పితము. ఈ కవి సంస్కృత ప్రాకృత ద్రావిడ భాషలలోఁ గూడఁ గృతులు రచియించి నాఁడట. విశేషముల కుదాహృత గ్రంథ భాగములఁ జూచునది.

---

## No. **1015**. శ్రీనివాసవిలాససేవధి.

## ŚRĪNIVĀSAVILĀSASĒVADHI.

Substance, palm-leaf. Size, 17¼ × 1¾ inches. Pages, 423. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes.

Complete.

Same work as the above which was transcribed from this MS.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్య మత్యధికము. గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1014 రు వర్ణితమైనదాని మాతృకయే.

## No. 1016. శ్రీరంగమాహాత్మ్యము.
## ŚRĪRAṄGAMĀHĀTMYAMU.

Substance, palm-leaf. Size, 16 × 1⅜ inches. Pages, 118. Lines, 4 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

The first six Adhyāyas (Foll. 1—35) are wanting.

Incomplete.

Similar to the work described under R No. 247. The name of the author is not given.

**Beginning:**

. . . . . . .
. . . . మహీపాలుఁడితఁడె
యూర యందరి కిట్టులాతిథ్యమితఁడు
సారవిరక్తుఁడై సలిపె నేమనఁగ
మనకు నసాధ్యుఁడై మన కోరికతఁడు
తనరంగఁజెందు నుదారవైఖరిని.

**End:**

ఇది రంగమాహాత్మ్య మింత మాత్రంబు
పదపడి తెలిపితిఁబరమమౌనీంద్ర
. . . . . . .
అనిన నారదుఁ డను నాశివుతోడ
ననఘునమస్కృతు లర్థిఁ జేసెదను
. . . . . .

**Colophon:**

అని యిట్లు దీనదయాళుఁడై మిగులఁ
దనరిన శ్రీరంగధాముని పేర
. . . . . .
మహితమౌ శ్రీరంగమహాత్మ్యమరర
మహిచంద్రచిరవృత్తి మాన్యమై వెలయు.

(వి-వి.)—

ఆదినుండి యాఱధ్యాయములును నేడవ యధ్యాయమునఁ గొంత యు నుండవలసిన గ్రంథము 35 పత్రములు పోయినవి. వ్రాఁతక త్తుఁజకర్ణినిదిగాని శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు. తప్పులున్నవి.

దీని రచయిత యెవ్వరో యెఱుఁగరాదు.

---

## No. 1017. శ్రీరంగమాహాత్మ్యము.

## ŚRĪRAṄGAMĀHĀTMYAMU.

Substance, palm-leaf. Size, 15 × 1¼ inches. Pages, 143. Lines, 4 on a page. Character, Telugu. Condition, much injured. Appearance very old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

A rendering in Telugu in the Dvipada metre describing the sanctity of the Vaiṣṇava shrine at Śrīraṅgam near Trichinopoly. This rendering is based on the Sanskrit portion contained in the Brahmāṇḍapurāṇa. The author Mukundayōgi of Kāśyapagōtra was a disciple of Kandāḍai Appalācārya whose genealogy is given in the colophon of the work

**Beginning :**

శ్రీకరగాత్ర విచిత్రచారిత్ర
రాకేందురవినేత్ర రఘువరస్తోత్ర

*         *         *         *

చోళాత్మజాసంగ సురుచిరాపాంగ
కాళియమదభంగ కస్తూరిరంగ
అనుచు ననంతంబులైన దండంబు
లొనర సమర్పించి యుల్లంబునందు

*         *         *         *

ఘనుఁడైన కోవిలకందాళయణ్ణా
ననిశంబుఁ బ్రణమిల్లి యాంచిక్రమొక్కి

*         *         *         *

ధాత్రిఁగస్యపుఁ డనఁదనరు సన్మౌని
గోత్రంబువాఁడ ముకుందాహ్వయుండను
మదినుబ్బి శ్రీరంగమాహాత్మ్య మేను
బదరక వినెదు శ్రీపరమవైష్ణవులు
దీవిపఁ దెలుఁగున ద్విపదకావ్యంబు
గావింతుఁ దత్కథాక్రమ మెట్టిదనిన.

**End:**

శ్రీరంగనాథుని సేవించునట్టి
వారువో వైకుంఠవాసులు దలఁప

*　　　*　　　*　　　*

ధారుణిలో దశాధ్యాయంబనంగ
శ్రీరంగమహిమ సంక్షేపమార్గమున

*　　　*　　　*　　　*

ఈ మహాత్మ్యము సదాయెవ్వరు విందు
రామహాత్ముల కాయురారోగ్యములును
నైశ్వర్యపుత్ర పౌత్రాభివృద్ధియును
శాశ్వతంబుగ రంగశాయి దా నొసఁగు.

**Colophon:**

అని చంద్రశేఖరుం డానారదునకు
వినుపింపఁగా మున్ను విన్నమార్గమునఁ
గొమరొప్పఁ గాశ్యపగోత్రపవిత్రుఁ
డమరంగ కోవెలకందాడయణ్ణ
గారిసత్పుత్రులు గాంభీర్యధనులు
సూరిసన్నుతులు భాసురకీర్తులనఁగ
నందగ్రజుండగు నానాయనయ్య
కనుజుండు ఘనుఁడప్పలాచార్యవర్య
గురుకృపాసాంద్ర ముకుందయోగీంద్ర
విరచితంబగు రంగవిభు చరిత్రంబు
కవిరాజు లక్కడక్కడ విని పొగడ
నవని నాచంద్రార్కమై యొప్పవలయు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులు మిక్కిలిగా నున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు హెచ్చుగాఁగలవు.

బ్రహ్మాండపురాణమునఁగల శ్రీరంగమాహాత్మ్యమున కిది తెలుఁగు సేఁత. ముకుందయోగి దీని రచియించెను అతఁడు కాశ్యపగోత్రుఁడు. కందాళప్పలాచార్యుని శిష్యుఁడు. ఆ యప్పలాచార్యుల వంశమునఁ బూర్వులు కొందఱుగూడ నిందుఁ జేర్కొనఁబడిరి.

## No. 1018. సోమవారమాహాత్మ్యము (మంజరి).
## SŌMAVĀRAMĀHATMYAMU (MAÑJARI).

Substance, palm-leaf. Size, 7½ × 1¼ inches. Pages, 130. Lines, 5 on a page Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but contains mistakes and breaks off in many places

Complete pages 83—120 are but wanting in the middle

Same work as the above.

At the end of the work, there is a note containing the following information —

The transcription was completed on Sunday, the ninth day of the bright fortnight of the lunar month Kārttika in the year Vijaya by the grace of God Nāgēśvarasvāmi of Cilkulūripādu and of God Narasimhasvāmi of Komarōlipādu Name of the scribe: Naulūri Subbarāju who copied from a MS. of Jaggaya, son of Vīranāgulu of Eṇdlūru.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిదే కాని తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దిట్లు గలదు:—

"శ్రీ చిలకలూరిపాటి నాగేశ్వరస్వామి కృపను శ్రీ కోమరోలిపాటి లక్ష్మీనరసింహస్వామి కృపను, విజయనామ సంవత్సర కార్తిక శు ౯ ఆదివారం వరకు యెండ్లూరి వీరనాగులు కొమారుడు జగ్గయ సోమవారపు మహాత్తు నౌలూరి సుబ్బరాజు సంపూన్నణంగ్గాను వ్రాశియిచ్చాడు."

---

## No. 1019. సోమవారమాహాత్మ్యము (మంజరి).
## SŌMAVĀRAMĀHĀTMYAMU (MAÑJARI)

Substance, paper. Size, 12 × 7¾ inches. Pages 100. Lines, 20 on a page Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes. Begins on Fol. 49. The other works herein are Vaijayantīvilāsamu 1-*a* and Sāraṅgadhara caritra (Dvipada) 109-*a*.

Complete.

Similar to the work described under R. Nos 242-(n) and 422 of the Triennial Catalogue, of Telugu MSS. Vols II and III respectively. The work under notice is written in a peculiar metre called Mañjari, in the Telugu prosody: by Śrīgirimallikārjunasvāmi.

**Beginning:**

శ్రీసోమనాథుని శ్రీసదాశివుని
శ్రీమహాదేవుని శ్రీధరప్రియుని

* * * *

పంచాక్షరీమంత్ర ఫలమిచ్చుశివూని
పదివేలభంగులఁ బ్రస్తుతిచేసి
అని సూతమునిఋషుల కఁతయు నేను
తేటతెల్లంబుగా తెలిపెద వినూము
ఘనసోమవారంబు ఘనతవర్ణింతు
వేదశాస్త్రములందు వెఁసినవ్రతము
అది సంస్కృతమాట మంతయు నేను
తెలియంగలెన్నగాఁ దెలుఁగుచేసెదాను
ఫాలాక్షుభక్తులు పాటించివినూడి
కర్ణామృతంబైన కథలుచెప్పెదాను
ఆకథా సూత్రబు నదియెట్టిదనిన.

**End:**

తల్లియుఁ దండ్రియు నయలన్న యపుడు
శివునిసాలోక్యంబుఁ జేరితారుండ్రి
అని నందినాథుండు నావసిష్ఠునకు
వినిపించె నయలన్న వృత్తాంతమంత
ఘనసోమవారంబు కథవిన్నవారు
ధరణిఁగృతార్థులై ధరయేలుమఱియు

* * * *

అని సూతమహాముని యాద్యులకెల్ల
వినిపించె సోంవారవిఖ్యాతచరిత
మరియు శ్రీగిరిమల్లికార్జునస్వామి
వెలయంగఁజెప్పెను విఖ్యాతచరిత
ధరణిలో నాచంద్రతారార్కముగను

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

శైవులకు ముఖ్యమగు సోమవారవ్రతముమాహాత్మ్య మిందు వర్ణింపఁబడినది. అన్ని సోమవారములకంటె మాఘ సోమవారము లధిక మాహాత్మ్యముగలవని యిందుఁగలదు. శ్రీగిరి మల్లికార్జునస్వామి మంజరిగా దీనిని రచియించెను. పెక్కుచోట్ల నిది ద్విపద, మంజరీ వికారమనఁదగు గేయరచనముగాఁ గానవచ్చుచున్నది. లేఖనమునఁగూడ గాన ఫణితినిబట్టి చరణాంతములందు దీర్ఘ స్వరములు వ్రాయఁబడినవి. ఇందీ యితర గ్రంథములుగలవు. 1-*a* వైజయంతీ విలాసము. 109-*a* సారంగధర చరిత్ర (ద్విపద).

---

## No. 1020. సోమవారమాహాత్మ్యము (మంజరి).
## SŌMAVĀRAMĀHĀTMYAMU (MAÑJARI)

Substance, palm-leaf. Size, 17½ × 1⅜ inches Pages, 60 Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

At the end of the work it is stated that the transcription was completed on the third day of the bright fortnight of the lunar month Mārgaśira in the year Sādhārana. Name of the scribe: Śivabhaktula Liṅgayya, disciple of Purānam Parvatālayya.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదేకాని తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

గ్రంథాంతమం దిట్లుగలదు:—

“సాధారణనామ సంవత్సర మార్గ శు 3 శె. వరకు పురాణం పర్వతాలయ్యగారి శిష్యుఁడు శివభక్తుల లింగయ్య సోమవార మహాత్మ్యం సంపూర్ణంగా వ్రాశెను”.

## No 1021. సోమవారమాహాత్మ్యము.
## SŌMAVĀRAMĀHĀTMYAMU.

Substance, palm-leaf. Size, 10⅝ × 1⅝ inches. Pages, 106 Lines, 6 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదేకాని తప్పులెక్కు-వ. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1022. అభిమన్యుకళ్యాణము
## ABHIMANYUKALYĀṆAMU.

Substance, paper. Size, 10 × 7¼ inches. Pages, 325. Lines, 20 on page. Character, Telugu. Condition, fair Appearance, old Mode of writing, good and free from mistakes

Complete in five Āśvāsas

A poem in the Dvipada metre describing the story of the marriage of Abhimanyu, son of Arjuna, with Śaśirēkhā daughter of Balarāma. The author Sēsamu Cennubhaṭṭāraka was the son of Vēnkaṭārya and Laksmamma of Kauṇḍinya gōtra F r other particulars see th extracts given below.

Date of transcription :—Second May 1847.

**Beginning :**

శ్రీజానకీనాథ జితదైత్యయూథ
రాజీవదళనేత్ర రమణీయగాత్ర

* * * *

విన్నపంబొకఁటి విన నౌధరింపు
మన్న నీదాసుఁడనగు నే నాసంగు
స్థిరకావ్యకన్యపై దేవరవారి
కరుణాకటాక్ష వీక్షణముఁ బఱపి
నెఱవేర్పుకొనుటకు నీయదిభార
మగవిందభవభవాద్యభినంద్యవిభవ

యనియిట్లు రఘువీరు సభిక్షతిఁ జేసి
జనకేంద్ర సంభూత సద్గుణవ్రాత
వినయోక్తి సంఘాత విభవవిఖ్యాత

*       *       *       *

సీత నత్యన్నాతఁ జిత్తాంబుజాత
దళమధ్యమున నిల్పి దగఁబూజసేసి
యలువుసఁ బన్నిద్దరాళ్వార్ల గొల్చి

\+       *       \+       *

కవితఁ జెప్పఁగఁబూని ఘనుల మద్వంశ
భవులఁ దత్త్వార్థానుభవుల వచించి
శ్రీవత్సచిహ్న దేశికసార్వభౌము
పావనాశ్రయణానుభావంబు గలిగి
కౌండిన్యగోత్రవిఖ్యాతిఁ జెన్నొంది
నిండినహరితత్త్వనిర్వాహబుద్ధిఁ
గరమొప్ప నిజశిష్యగణము హర్షింప
వరుస శేషాన్వయ వర్ధనుండగుచు
విలసిత సద్బ్రహ్మవిద్యానిరూఢి
సంయమాహోబలగురుం డలరి పెంపొందు
సంపద్ఘనుం డాత్మసతియం దతండు
సొంపుమీఱఁ గాంచె సుతపంచకంబు
వారిలోపలఁ గీర్తివర్ధనుం డగుచు
వారిజేక్షణభక్తివైఖరి మించి
మహనీయవైష్ణవ మతవృద్ధిఁ గూర్చి
మహిఁ జెప్పుగనియె రామానుజగురుండు
అమ్మహాత్ముండు సీతమదేవి వలన
నెమ్మిఁ గాంచినకళానిధి ప్రఖ్యాతముఁడు
సౌశీల్యవాత్సల్య సమదమజ్ఞాన
భాసురుం డనఁదొప్పు భట్టరార్యుండు
పరగ రాగమ సత్యభామయు ననఁగ
నిరుపమతరుణుల నెలమిఁ బెండ్లాడి
నమ్మహాగుణికి రాగమవధూమణికి
సమ్మదం బెసఁగంగ జననంబునొందె

*       *       *       *

ననుపమచరమనిష్ఠా నిష్ఠితుం డైన
యనఘచిత్తుఁడు వేంకటార్యవర్యుండు
లక్ష్మీసమానతలక్ష్మింపఁదగిన
లక్ష్మమ్మయనువధూరత్నంబుతోడ
సిరియుఁగీర్తియుఁ బెంపుఁ జెన్నువహింపఁ
బరమవైష్ణవధర్మపరతఁ బెంపొంద
అద్దేవివలన నయ్యార్యాచార్యమౌళి
తద్దయు ముప్పురఁదనయుఁ గాంచె
అం దగ్రజుఁడు సద్గుణాభిరాముండు
నందనందనకథానందచిత్తుండు

*            *            *            *

అమలవైష్ణవ రహస్యార్థసంవేది
రమణీయశుభకీర్తి రఘునాథగురుఁడు
తదనుజుఁ డనఘుం డుదారగుణుండు
సదమలగురుపాద జలజప్రియుండు
పరివ్రాతసౌఖ్యుండు పరమార్థవేది
హరిభక్తిరతుఁడు రామానుజార్యుండు
అమ్మహాత్ముల కూర్మియనుజుండ నేను
నమ్మితిజానకీనాథు నామదిని
పరగుచుండుదుఁ జెన్నభట్టారకాఖ్య
నిరుపమహరిదాస్య నియతి పాటించి
కలఁదోఁచురఘుపతి కరుణను నాకుఁ
గలిగెఁజిన్నప్పుడె కవితాలలామ
సరసులు మెచ్చంగ సభలఁగీర్తింప
విరచింతుఁ గృతి రఘువీరాంకితముగ

*            *            *            *

పావనరఘువరార్పణముగా నేను
గావించునభిమన్యుకళ్యాణమందు
బంధురద్విపదప్రబంధంబునందు
గ్రంథకథారంభగతి యెట్టిదనిన.

**End:**

జలజాక్షి తనకన్నుసైగల మెలఁగ
నెలమిబంధులు మెచ్చ నింద్రపౌత్రుఁడు

చెలువొంది ధర్మార్థ సిద్ధులుగలిగి
విలసిల్లెఁ జిరకీర్తి విభవంబులెసఁగ
నని చెప్పి వెండియు నమ్మునీంద్రుండు
జననాథ యభిమన్యు చరితంబు దెలియ
వినిన వ్రాసినఁ జదివిన శౌరికరుణ
జనుల కాయుష్కీర్తి సౌఖ్యము ల్గలుగు
ననుచు వైశంపాయ నాఖ్యమునీంద్రుఁ
డొనరఁగ జనమేజయున కెఱింగింప
నతఁడు సంతోషించి యమ్మునిచంద్రు
నతులితభక్తి నెయ్యమునఁ బూజించె

**Colophon:**

అని యిట్లు దశరథేంద్రాత్మజు పేరఁ
గనకాంబరుని పేరఁ గాకుత్థ్సు పేర

* * * *

నంకితం బమర శేషాన్వయోద్భవుఁడు
వేంకటార్యసుతుండు విమలగుణుండు
సరసరామపదాబ్జ సక్తచిత్తుండు
పరమవైష్ణవదాస్య పరతంత్రబుద్ధి
పావనంబుగఁ జెన్నభట్టారకుండు
గావించు నభిమన్యు కల్యాణమనెడు
జయమొప్పుకృతిలోన సర్వంబునిదియె
యయిదవయుల్లాసమగుచు శోభిల్లి
సరసులమది మెచ్చఁ జనువంగనొప్పు
ధరణిలో నాచంద్రతారకముగను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు. ఈ ప్రతి 1847 సం॥ మే నెల 2 వ తేదికి ముగిసినదని పుస్తకాద్యంతములందు బ్రౌను దొరగారు పెన్సిలుతో వ్రాసిరి.

భారతమునఁగల, శశిరేఖాభిమన్యుల కళ్యాణకథ యిం దైదాశ్వాసములలో వర్ణితమయ్యెను. శశిరేఖ బలరాముని కూఁతురు. అభిమన్యుఁ డర్జునుని కొడుకు. గ్రంథకర్త శేషము చెన్నుభట్టారకుఁడు. కౌండిన్య గోత్రుఁడు. లక్ష్మమ్మకు వేంకటార్యునకుఁ గుమారుఁడు. వైష్ణవుఁడు. విశేష విషయము లుదాహృత గ్రంథభాగమునఁ జూచునది.

---

## No. 1023. అభిమన్యు కళ్యాణము.

## ABHIMANYU KAḶYĀṆAMU

Substance, paper. Size, 9⅝ × 7½ inches. Pages, 351. Lines, 18 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes English notes in the handwriting of C. P. Brown are found throughout the Manuscript.

Complete.

Same work as the above.

Date of transcription :—24th March 1847 86 pages from page 185 contain C P. Brown's translation in English of this work and it is stated that this translation was completed on the 6th April 1847.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. ఇది 1847 వ సం॥ వ్రాయించిన శుద్ధప్రతి యఁట ! 24-3-47 అని కడపటి పుటమీఁద పెన్సిలు వ్రాఁత గలదు. గ్రంథమందు పెక్కుచోట్ల బ్రౌను దొరగా రాంగ్లటిప్పణిని జేర్చిరి.

183 పత్రము తొలి పుటలో నారంభించి, 43 పుటలు పతత్ప్రిబంధ కథా సంగ్రహము నాంగ్లభాషలో బ్రౌను దొరగారు వ్రాసిరి. అది 1847 వ సం॥ ఏప్రెల్ 6 వ తేదికి ముగిసెనట.

ఇది సుగ్రహము, ధారాళము, హృద్యమునగురీతిని రచితమయ్యెననియు వైదేశికులకిది ఆరంభమునఁ జదువఁదగినదనియు, ఈకథ భారతమందలిదేయైనను వర్ణితవిషయము లన్నియుఁ గల్పితము లేయనియు, నీగ్రంథ మిట్లు తెనుఁగున మాత్రమే కలదనియు యించుమించు 3250 ద్విపదలిందుఁ గలవనియు, బ్రౌను దొరగారు కథా సంగ్రహాంతమున ఇంగ్లీషులో వ్రాసిరి.

## No 1024. అభిమన్యు కళ్యాణము.
## ABHIMANYU KAḶYĀṆAMU.

Substance, paper Size, $12\frac{4}{8} \times 7\frac{7}{8}$ inches. Pages, 216 Lines, 22 on a page. Character, Telugu Condition, fair but slightly injured. Appearance, old Mode of writing, fair but full of mistakes.

Complete

Same work as the above

Date of the manuscript—17—3—1843.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదేకాని తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1025. అభిమన్యు కళ్యాణము.
## ABHIMANYU KAḶYĀNAMU

Substance, paper Size, $12\frac{1}{2} \times 8$ inches. Pages, 339. Lines, 19 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, very old. Mode of writing, good, but not free from mistakes. The variations in reading are interlined throughout the Manuscript.

Same work as the above.

The Manuscript is dated 24—4—43 At the end of the Manuscript English notes are found in the handwriting of Mr C. P. Brown.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. పాఠభేదములు పంక్తుల నడుమఁ జేర్పఁబడినవి. నిర్దుష్టపాఠములు పెన్సిలుతో ప్రక్కను వ్రాయఁబడినవి. కడముట్ట క్రింద బ్రౌను దొరగారి యాంగ్లటిప్పణములు గలవు.

నెం 1022 రున వర్ణితమైనదే. ఇది నెం 1024 రు ప్రతికి మాతృకగా వచ్చును.

## No. 1026. అభిమన్యు కళ్యాణము.
## ABHIMANYU KAḶYĀṆAMU.

Substance, palm-leaf. Size, $16 \times 1\frac{3}{8}$ inches. Pages, 175. Lines, 8 on a page. Character, Telugu Condition, slightly injured Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

Complete.

Same work as the above.

Date of transcription :—Monday the sixth day of the bright fortnight of the lunar month Śrāvana in the year Krōdhin Nam of the scribe :—Vīrāsāmi

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె

గ్రంథాంతమం దిట్లుగలదు. " క్రోధినామ సంవత్సరం శ్రావణ శుద్ధ ౬ యిందువాసరం వరకు చీకిరాల వీరాస్వామి వ్రాశిన అభిమన్యుడి వివాహం చరిత్ర ".

---

## No. 1027. అభిమన్యుకళ్యాణము.
## ABHIMANYUKAḶYĀṆAMU.

Substance, paper. Size, 12¼ × 7½ inches. Pages, 12. Lines, 28 on a page. Character, Telugu. Condition, almost injured Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 134*a*. The other works herein are Paṇḍitā rādhya caritra 1 (*a*), Jaṅgamakālajñāna. 31 (*a*), Ēganṭivārivacanālu 56 (*a*), Bhallānacaritra 76 (*a*), Śakuntalāparinayamu 121 (*b*), Madanamōhinīvilāsamu 146 (*a*), Cāṭuvisayamulu 160 (*a*).

Incomplete (contains 1—160 stanzas only).

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. తొలి 160 ద్విపదలు మాత్రము గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతము లేవు.

పూర్వమువలె.

ఇతర గ్రంథములు :—

1*a* పండితారాధ్యచరిత్ర, 31*a* జంగమకాల జ్ఞానము, 56*a* ఏగంటి వారి వచనాలు, 76*a* భల్లాణ చరిత్ర, 121*b* శకుంతలా పరిణయము, 146*a* మదన మోహినీ విలాసము, 160*a* చాటు విషయములు.

No **1028**. ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర.

UTTARAHARIŚCANDRACARITRA.

Substance, paper. Size, 10⅝ × 7¼ inches. Pages, 135. Lines, 16 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good and free from mistakes.

Complete without the introductory portion.

Similar to the work described under No. 425 *ante*. The author Candraśēkharakavi, son of Gadde Vīraśarabhācārya of Sānagagōtra, was a Vīraśaiva poet and dedicated this work to God Cangalvarāya (Kumārasvāmi).

**Beginning.**

ద్వి. శ్రీకంఠుకృపచేతఁ జెలువనుగూడి
ప్రాకటరాజ్యంబు పాలించెనచుచుఁ
బూర్వహరిశ్చంద్ర పుణ్యచరిత్ర
సర్వంబు విని మహైశ్వర్యంబు నొంది
యచలధైర్యుఁడుపాండ వాగ్రజుఁడంత
నుచితమార్గంబున నూహించితాను
మ్రొక్కి మార్కండేయమునికిట్లుపలికె
ముక్కంటియెదుర నిమ్ములహరిశ్చంద్ర
నరనాథునకు గాధి నందనుఁడవనిఁ
గర మరుదారంగఁ గ్రందున నిచ్చి
దేవతలెఱుఁగంగ దీవు లారొకటి
యేవిధంబునఁబూని యేలించె ననినఁ
గౌంతేయుఁ జూచి మార్కండేయమౌని
యెంతయు ముదమంది యిట్లని పలికె.

**End:**

ధరణీశుఁ డెవ్వఁడేని తనకుఁగాకున్న
హరిచేతిచక్రంబు ప్రార్థించునంత
వచ్చి నిల్చుటయును వలనొప్పఁ బూజ
లచ్చుగాఁ గావించి యది పంపినంత
వాని నచ్చోటనె వడి వధియించుఁ
గాన భూపాలుఁ డెక్కడనైన నెవ్వ
రెదురు లేకుండ వాహినికెక్కియవని
సదయతఁబాలించు సార్వకాలంబు

నీచరిత్రము భువి నెవ్వరేని చదువ
నాచరింపుచు విన్న నలరి వ్రాసినను
జనులకు ఫలియించు సర్వయత్నములు
జనియించు నురుతర సంతానలబ్ధి
*     *     *     *
అనుచుమార్కండేయుఁ డానతిచ్చె
ఘనలీలఁ బాండవాగ్రణికి మోదమున.

**Colophon :**

అని యిది దివిజ సేనాధీశుపేర
దనుజశాత్రవగోత్ర దంభోళిపేర
*     *     *     *
రామణీయకాదార్య రతసద్గుణాబ్ధి
రాముఁడు చెంగల్వ రాయనిపేర
నంకితంబుగఁ గాళహస్తీశచరణ
పంకజసౌరభ భ్రమరాయమాన
వీరశైవాచార విశ్రుతగద్ది
వీరభద్రాచార్య విభుతనూజాత
ధీజనస్తోత్ర వాగ్దేవీకటాక్ష
రాజితసాహిత్య రసపోషణాంక
సావధానానేక శాస్త్రవిజ్ఞాన
కోవిదసానగ గోత్రాబ్ధి(చంద్ర)
చంద్రశేఖరకవీశ్వర కృతంబగుచు
సాంద్రానుమోద ప్రశస్తమైమిగుల
జగతినుత్తర హరిశ్చంద్రచరిత్ర
తగనొప్పు నాచంద్రతారార్కముగను.

(వి-వి.) —

సమగ్రము. కృత్యవతరణిక మాత్రము లేదు. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు.

ఇది డి. 425 రున వర్ణితమగు గ్రంథమును బోలినదే. అది పద్యకృతి. ఇది ద్విపదకృతి. ఈ రెండిటిలో నొక రచనమున కింకొక రచనము మాతృకయైయుండును. కథావిషయమున నే కాక భాషాపద ప్రయోగములందుఁగూడ రెండిటికిని సాజాత్యముగలదు.

దీనికర్త చంద్రశేఖరకవి. వీరశైవుఁడు. సానగగోత్రుఁడగు గద్దె వీరశరభాచార్యుని కుమారుఁడు ఈ కృతి చెంగల్వరాయునికి (కుమారస్వామికి) అంకితము చేయఁబడినది

---

## No. 1029. ఉత్తర హారిశ్చంద్ర చరిత్ర.

## UTTARAHARIŚCANDRACARITRA.

Substance, palm-leaf Size, 13¾ × 1¼ inches. Pages, 66. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Complete without the introductory portion.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రమేకాని అవతారిక లేదు. గ్రంథాంతమునను గొన్ని ద్విపదలు లేవు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లెక్కువ.

పూర్వమువోలె.

---

## No 1030. ఉషాకల్యాణము.

## UṢĀKAḶYĀṆAMU.

Substance, palm-leaf. Size, 15¾ × 1½ inches. Pages, 70. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

Complete.

A poem in the Dvipada metre narrating the story of the marriage of Uṣā, daughter of Bāṇāsura, with Aniruddha, grandson of Lord Kṛṣṇa. The author Tāḷḷapāka Tiruvēngaḷanātha, son of Annayamantri of Bhāradvāja gōtra and Āśvalāyana sūtra, belonged to Nandavarika sect of Smārta Brāhmans. For other particulars regarding the author and his genealogy—vide R. No. 595 *ante*.

**Beginning :**

* * * *

అలమేలుమంగఁ గృపావిరాపాంగ
నలకనిర్జితభృంగ నమితకమ్రాంగ

* * * *

ఆత్మఁ భావించి సాష్టాంగంబు నెఱఁగి
యాత్మీయగురుని సంయమినాథుఁ బొగడి
శారదఁ బ్రార్థించి శక్తిఁ గీర్తించి
గౌరిఁ బూజించి శంకరుని భజించి
శ్రీవధూవరలబ్ధ సిద్ధవాక్ప్రౌఢి
యావిర్భవన్మతి . . . డనగుచు
ధరణిసంస్తుతభారద్వాజసగోత్ర
హరిణాంకవిమలాశ్వలాయనసూత్ర
వరనందవరచారు వంశపవిత్ర
హరిభక్త తాళ్లపాకాన్వయపుత్ర
తిరుమలార్యాత్మజ ధీశుకాచార్య
విరచితోపమ తిరువెంగళనాథ
హితనామకుఁడనైన యేను మత్కృతికి
నతులితహేమాంగ నలమేలుమంగ
నింపు సొంపార నధీశ్వరిఁ జేసి
సంపన్నకాంక్షికి సకలరతుకును

*　　　　*　　　　*　　　　*

జలజకంధరకు సజ్జనధురంధరకుఁ
బొలుపొందఁ నంకితంబుగ నాయొనర్చు
హరివంశమార్గోక్త మగునుషాకన్య
కరమొప్పుపరిణయ క్రమమెట్టిదనిన :—
జనమేజయుండు వైశంపాయనాఖ్య
మునిఁ జూచి పలికె నో మునిచంద్ర నాకు
హరిబాణు గెలిచిన యాతెఱంగెల్ల
నరుదందఁ జెప్పవె యన మౌని పలికె
సకలవిశ్వంభరా చక్రంబునడుమ
నకలంకమై మేరు వమరుచందమున
ధారుణి దోష విదారణంబైన
ద్వారకానగరంబు ధరణిఁ జెన్నొందు

**End:**

ఆరుక్మిణీకాంతుఁ డన్నయుఁ దాను
ద్వారకాపురిని యాదవులెల్లఁ గొలువ

శ్రీదేవి తనయింటఁ జెలఁగి మెలంగ
నాదరం బెసఁగ రాజ్యము సేయుచుండె.

**Colophon:**

అనియిట్లు జనమేజయక్షోణిపతికి
జనలోకవిభుఁడు వైశంపాయనుండు
ఘనమోదమున నుషా కళ్యాణలీల
విన విస్తరంబుగ వినిపించె ననుచు

* * * *

మించినశ్రీయలమేల్మంగపేర
నంచితవైభవో ల్లాసినిపేర
ననువొందఁ దాళ్లపా కన్నయాచార్య
తనయుఁడౌతిమ్మార్య తనుజన్ముఁ డగుచు
వినుతికెక్కినతిరు వేంగళనాథ
ఘనుఁడు చెప్పినయుషా కళ్యాణమనెడి
కృతియిందిరాదేవి కీర్తి యెన్నాళ్లు
క్షితి నుండు నన్నాళ్లుఁ జెలువొందుఁగాక.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. కన్నడమోడి గలది. అస్పష్టమైనది. తప్పులు పెక్కులు. శైథిల్యము గ్రంథపాతములుఁ గలవు.

ఉషానిరుద్ధుల వివాహ కథను జెప్పు నీరసవత్ప్రబంధము నందవర బ్రాహ్మణుఁడు, భారద్వాజగోత్రుఁడు, ఆశ్వలాయన సూత్రుఁడునగు తాళ్లపాక తిరువేంగళనాథునిచే రచింపఁబడినది. అన్నయమంత్రి పుత్రుఁడగు తిరుమలార్యుఁడీ తిరువేంగళనాథుని తండ్రి. ఈ తాళ్లపాక వంశమువారినిగూర్చి ఆర్. నె ౬95 రున చూచునది.

---

## No 1031. ఎఱ్ఱగడ్డపాటిపోట్లాట.
## ERRAGADDAPĀṬIPŌṬLĀTA.

Substance, paper. Size, $12\frac{1}{2} \times 8$ inches. Pages, 130. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, fair but full of mistakes.

The other work herein is 1*a*. Kātamarāju Katha.

**Incomplete.**

A poem in the Dvipada metre describing the battle which took place between Kātamarāju and Nallasiddhacōla of Nellore, at Erragaddapāḍu. It is stated that the battle took place on Tuesday, the fifteenth day of the dark fortnight of the lunar month Māgha in the year Citrabhānu The author Pina-Ellaya, was the son of Gaṅgula Ellaya of Kōmanāla gōtra. The work is in colloquial language and has been written on the model of a prior work by Śrīnātha A full sketch of this story is to be found in the 18th volume of Brown's Local Records.

The M.S. is dated 30th August 1842.

**Beginning:**

శ్రీరంగధామునిఁ జెలువొప్పఁదలఁచి
కారుణ్యమునను శ్రీ కమలజుఁదలఁచి

* * * *

లోకలోకములెల్ల లోలతమెఱయఁ
జేకొనుగుండాల శాంభవిఁదలఁచి

* * * *

సమ్మతమొనరించు సర్వజనములకు
నెమ్మది బోయపాట నెలకొన్నగంగ
కంజలియొనరించి కడువేడ్కతోను
సంజీవరాయని సతతంబుఁదలఁచి
కనకసంపదలొసఁగు గంగాభవాని
నెలమంచిగంగను నెంతయుఁ దలఁచి
తనమదినిలిపి తాత్పర్యంబుతోను
బ్రకటించు నెఱిగడ్డ పాటిపోట్లాట
సకలభూజనులకుఁ జెవులపండువుగ
వివరింతునీకథ యిదియెట్టి దనిన.
అవనిపై యాదవ వంశంబులోన
భువనవిక్రముఁడును భుజబలోన్నతుఁడు
వసుధపై పెదిరాజు వరతనూజుండు
అసమానధీరుండు అమితవిక్రముఁడు
పశుపతియులనున్న పట్టభద్రుండు
దేశదేశములెల్ల ధేనువు ల్త్రిపి
వడ్డెదేశము లేలు వసుధపాలకుని
దండించికోవరాల్ లండవిడిపించు
మరలి దక్షిణభూమి మఱివేగ వచ్చి
బిరుదులు చేకొన్న భీకరోన్నతుఁడు

కరిమధునియాజ్ఞ కాట భూపాలు
పరగదక్షిణ భూమిఁ బశువులు మేపి
మొనఁగంగ జన్నవాఁడ కేతెంచి యచటఁ
బొనఁగంగ గొబ్బిదేవరను బెట్టియును
రంతుకు నెల్లూర రాయి నరికించి
పంతగించిన క్రియఁ బగయేరుపడను
వెలపొప్పఁ జిలుకను వేయించి రాజు
పగచెనికి తనమరఁది పద్మనాయఁడును
దగుబంధు జనులును సమ్ములుబలము
లెద్దు లావులు కోడె లేపార మిగుల
సందడింపుచుఁ బంజనములతోడ
గడిభూమి లోపలఁ గయ్యంబు చెనకి
నడిభూమికిని దిరిగె నతివేగమునను.

**End :**

అందరు నల్లన్న అ(యా)వలివలెను
బొందుగాఁ గూర్చుండి ప్రొద్దుబూచును
గద్దులే దనకుండ దనశౌసలెల్ల
ఆ రాత్రి పెండ్లి ఆలోచనరీతి
రఘుపతి నల్లన్న రాచకార్యములు
పగపాడి న తముల్బాపించుచుండె.

(బి-బి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే కాని, తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు ఈ ప్రతి 1842 వ సం॥ ఆగస్టు 30 వ నాటికి ముగిసినదట :

ఇది నె 1040 రున వర్ణ్యమగు కాటమరాజు చరిత్ర బోలినదే. అదే కథ కాని, రచనము వేఱు. దీని రచయిత పేరెఱుఁగరాదు.

1 *a*. కాటమరాజు కథ, ఇందుఁగలదు.

---

No. 1032. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట.

ERRAGADDAPĀṬIPŌṬLĀṬA.

Substance, paper. Size, 13¼ × 1 inches. Pages, 45. Lines, 33 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good, but not free from mistakes.

Begins on fol 47*a*.

The other works herein are :—

Maṭlarājula cāṭupadyamulu 1, Ṣatcakravartulapraśamsa 2 (*a*), Ṣōḍaśarājulacaritra 3 (*b*), Tikkadandanāthapraśaṁsa 6 (*a*), Nellūrirājyapraśamsa 6 (*b*), Kātamaājucaritra 8 (*a*), Baṭṭurāyabāramu.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదే, తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె

ఇది నె 1031 రు ప్రతికి మాతృకయై యుండును. ఇందీ యితర గ్రంథము లున్నవి :—

1. మట్లరాజులమీఁది చాటుధారలు, 2*a* షట్చక్రవర్తుల ప్రశంస, $3_b$ షోడశరాజుల ప్రశంస, $6_a$ తిక్క దండనాథ ప్రశంస, $6_b$ నెల్లూరు రాజ్య ప్రశంస, 8*a* కాటమరాజు చరిత్ర (బట్టు రాయభారము).

---

## No **1033**. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట.

## EṚRAGAḌḌAPĀṬIPŌṬLĀṬA.

Substance, paper. Size, 12⅝ × 8¼ inches. Pages, 115. Lines, 20 on a page. Character, Telugu. Condition, Slightly injured. Appearance, old Mode of writing, fair but not free from mistakes.

Begins on fol 236*a*.

The other works herein are :—

Rādhāmādhavasamāgama 1 (*a*), Bobbilikatha 60 (*a*), Kumārarāmunikatha 122 (*a*), Kāmamma katha 198 (*a*), Sītānta Grāmadēvālaya caritramu 226 (*a*).

Similar to the work described under No. 1031 *ante*.

The M.S. is dated 15th June 1840.

**Beginning :**

శ్రీజాహ్నవి గంగఁజిత్తమునఁదలఁచి
రాజితంబుగ విఘ్నరాజుకు మ్రొక్కి

* * * *

ప్రాకటంబుగ నెఱగడ్డపాటి పోట్లాట
ఆ కథా వృత్తాంతమది యెట్టిదనిన

శ్రీకరంబైనట్టి సృష్టిలోపలను
ఆకాట భూపాలుఁడగు మహాఘనుఁడు

* * * *

పశుపతి సింహాసనానకుఁబట్టాభిషేకుండు
వసుధఁబెద్దిరాజుకు వరతనూభవుఁడు
ఎల్లదేశములేలుఁగంగ నెరగెడ్డ పాటును నిలిచి
పల్లవాధిరాజుతోఁబగ నిశ్చయించి

* * * *

సొగటాలనాడుచు సొంపుతోడుతను
పగకు నెదురుచూచుచు నటువలెనుండంగ
నంతట నెల్లూరనా సిద్ధరాజు
పంతముగల వీర పరివారము గొల్వ
నాయకులుదానును నల్లమేడలోను
ఆ యవసరంబున నపుడు కూర్చుండంగ
పశుల మందలోనుండి రాయభారము నాడిమగుడి
వసుధేశు కొల్వుకు వచ్చి యా భట్టు
అప్పుడు గొల్లరా జాడిన మాట
తప్పక చెప్పిన ధరణీశ్వరుండు
కన్నుల రోషాగ్ని కణములు దొరుగ
మన్నియల దొరల మంత్రులఁబిలిచి

**End:**

వారిని వెంటఁబెట్టుక వల్లవుల(లు) గురువు
పుష్ప రథములు ఎక్కిపోయిరి దివికి.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిదే, తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు. ఈ ప్రతి 1840 వ సం॥ జూన్ 15 వ తేదికి ముగిసినదట.

ఇందు కాటమ రాజుతో సంబంధించిన కథ క్లుప్తముగా నున్నది. భట్టు రాయబారము, తర్వాత నల్లసిద్ధిచోళుఁడు యుద్ధ సన్నద్ధుఁడగుట, ఎఱ్ఱగడ్డపాటి పోరాటము నిందు విపులముగా వర్ణితములయినవి. నె 1031 రున వర్ణితమగు గ్రంథము వేఱు. ఇది వేఱు.

ఇందీ యితర గ్రంథములు గలవు. రాధామాధవ సమాగమము, 1a బొబ్బిలి కథ, 60a కుమారరాముని కథ, 22a కామమ్మ కథ, 198a సీతాంత గ్రామ దేవాలగుు చరిత్ర 226a.

---

## No 1034. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట.

## ERRAGADDAPĀṬIPŌṬLĀṬA

Substance, paper. Size, 13½ × 8 inches. Pages, 55. Lines, 35 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులు చాల గలవు. శైథిల్యము గ్రంథ పాతములు హెచ్చు.

పూర్వము వోలె.

---

## No 1035. కపోతవాక్యము.

## KAPŌṬAVĀKYAMU.

Substance, palm-leaf. Size, 16¼ × 1⅜ inches. Pages, 60. Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Slightly different from the work described under R. No 141 (b) of the Tril , Cat , of Mss., Vol. II, Part III. The author Obaḷayya was the son of Sarvayya.

Date of transcription.—Saturday the thirteenth day of the lunar month Jyēsṭha in the year Śukla. Name of the scribe.—Pallayya who copied from a MS. of Vallūri Nāganna for Sarivēśaliṅgam.

**Beginning:**

ద్విపద. ఆదినారాయణుఁ డర్కకులేశు
పాదంబుమనసులోఁ బాయకనిలిపి

* * * *

వలనొప్పఁ గాపోత వాక్యంబు చెప్ప
జలజాక్షుఁడగు రామచంద్రుని కీర్తి
తప్పులెన్నకమీరు తగనక్షరములు
ఒప్పుగాదిద్దుడీ యొనర నేర్పరులు
జాణలు రసికులు జాతికోవిదులు
మాణక వినుఁడింక మఱిలంకలోన
అన్నచేఁ దన్నుఁబడి యావిభీషణుఁడు
పన్నగా రఘురాము పాదములకడకుఁ
బోయెదనని . . . .

**End :**

పొగడంగఁబక్షులు బోయ సహితముగ
నగణిత భోగము లర్థిఁగైకొనుచు
వలనొప్పఁబోయెను వైకుంఠమునకు

* * * *

అసురేశురమ్మని యర్థిఁదోతెమ్ము
వసుధలోఁగీర్తియు వానరోత్తముఁడ
యనియానతిచ్చిన నర[illegible]నందనుఁడు
చనివిభీషణుని సమ్మతిదోడితెచ్చి
రామునిఁ గైకొని రాగిల్లివాఁడు
ప్రేమతో దండ ప్రణామంబుచేసి

* * * *

పరమాత్ముఁ డతనికిఁ బట్టంబు కట్టి
యెలమితో నిను లంక నేలింతు ననియె

* * * *

శ్రీరాముజిహ్వాయుఁ జెప్పినయట్టి
కారణంబైనట్టి కపోతవాక్యంబు
నెవ్వరుచదివిన నెవ్వరువిన్న
నెవ్వరువ్రాసిన నెలమితోడుతను

* * * *

వైకుంఠవాసంబు వలనొప్పఁగలుగు

**Colophon:**

నీ కపోతవాక్యంబు నిలలోనమికుల
వ్రాసినకథయొప్పు వసుమతియందు
నాజనవంశంబు వొలుపొందుచుండు
నలవాఁడు సర్వయ ఘనునినందనుఁడు
ఓబళయ్యను పేర వెలసినవాఁడు
ఘనమైన పెద్దలఁ గనితిరుగువాఁడ
ఈకథ వ్రాసిన యినవంశమునను

* * * *

ఆచంద్ర తారారర్కమై యొప్పుఁగాత॥

(బి-బి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

భారత శాంతి పర్వగతమగు లుబ్ధకకపోతోపాఖ్యానమునకే యిది పెంపొందిన ద్విపదరచనము. నా (ఆ)? జనవంశ్యుఁడు సర్వయ కుమారుఁడునగు ఓబళయ్య దీనికిఁ గర్త. నెం 1036 రు ప్రతి ప్రకారము చూడఁగా నీరచనమునకు ఆర్వేలనియోగియైన వెంకటగిరి యనువాఁడు కర్త యగును.

గ్రంథాంతమం దిట్లు గలదు :—

శుక్ల సంవత్సర జ్యేష్ఠ శు ౧౩ స్థిరవారం సరికొవల్లూరి నాగన్న గారి ప్రతినిమాజేటి సరివేళలింగ్గంకు పైండిముకుల పల్లయ్య కపోత వాక్యం సంపూర్ణంగ్గా వ్రాశియిచ్చెను.

---

## No. 1036. కపోతవాక్యము.

## KAPŌṬAVĀKYAMU.

Substance, palm-leaf. Size, $15\frac{1}{2} \times 1\frac{1}{8}$ inches. Pages, 42. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

Date of transcription:--Wednesday the fifth day of the lunar month Māgha in the year Śrīmukha: Name of the scribe —Vēnkatanarasu of the Paluganti village

On the stray leaves at the close of the work, there are some humorous verses, some verses (in Telugu and Sanskrit) describing certain Yantras etc., and also some Sanskrit verses in praise of various deities

**Colophon:**

ద్విపద. ఆరామ విభుపేర నఖిలేశుపేర
వార్ధిబంధించిన వసుధేశుపేర

*     *     *     *

తిరుపతి వేంకటాధీశునిపేర
వరమిచ్చు శ్రీకంచి వరదునిపేర
కమలబాంధవ కులాగ్రణియైనరాము
ప్రమదంబులిచ్చు మాపాలినరసింహు
అంకితంబుగఁజెప్పె నార్వేలవిభుఁడు
వేంకటగిరియను విమలమానసుఁడు
ధరణిలోనిట్టి కపోతవాక్యంబు
ఇరవొందరాముండు ఇనసుతుతోడఁ
జెప్పినకథనేను జెప్పినా నింతె
తప్పొప్పులెఱుఁగను దయతోడఁగవులు
తప్పులుతీర్చుడీ తడయక మీరు
ఒప్పిదంబగునట్లు వసుధలోపలను
ఆచంద్రతారార్కమైయొప్పుమిగిలి
భూచక్రమునవెలయుఁ బొలుపొందగాను

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లెక్కువ. శైథిల్య—గ్రంథపాతములు హెచ్చు.

ఇది 1035 రు వర్ణితమైనదే కాని, గ్రంథాంతమునఁగల రచనాభేదమునుబట్టి కర్తపేరు మాఱుచున్నది. ఇందుఁగల రచనాభేదము తప్పులతడికగానున్నదిగాన, యిది వర్ణితమైనదేయని తలఁపవచ్చును. ఇందున్న రీతినిబట్టి యార్వేల వంశ్యుఁడగు వెంకటగిరి యనువాఁడు దీనికిఁ గర్త యగును.

గ్రంథాంతమం దిట్లు గలదు:—

"శ్రీముఖనామ సంవత్సర మాఘ శుద్ధ పంచమి బుధవారం పలుగ్గం టిపతెలిగోను రాయసం వేంకటనరుసు వ్రాసిన కపోతవాక్యము."

గ్రంథాంతమున కడియాకులమీఁదఁ గొన్ని శృంగార పద్యములు, కొన్ని స్తోత్ర శ్లోకము గలవు.

---

## No. 1037. కపోతవాక్యము.

## KAPŌṬAVĀKYAMU.

Substance, palm-leaf Size, 17 × $1\frac{5}{8}$ inches Pages, 38. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

Complete but imperfect.

Same work as the above

(వి-వి.)—

సమగ్రమే. తొలియాకు పోయినది. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది 1035 రున వర్ణితమైనదే.

---

## No. 1038. కపోతవాక్యము.

## KAPŌṬAVĀKYAMU.

Substance, palm-leaf. Size, $10\frac{1}{2}$ × $\frac{7}{8}$ inches. Pages, 24. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old Mode of writing, bad and full of mistakes.

Incomplete and imperfect

A poem in the Dvipada metre narrating the main incidents that took place while Vibhīsana sought the homage and protection of Lord Rāma and Sugrīva objected to the accepting of Vibhīsana's homage. In the meanwhile a pigeon is said to have come and told Rāma that it was not proper to refuse protection to Vibhīsaṇa. After this Rāma promised to support him in getting the kingdom of Lankā.

**Beginning**:

"ఆదినారాయణుం డరగఁకు లేశు
పాదంబు మనసులో పాయక నిల్పి,
అభవుఁడు మొదలైన యమరుల నెల్ల
విభవంబు మీరగ విఘ్నేశు . . . .

* * * *

వ్యాస వాల్మీకుల వర్ణింతు నెలమి
భూసురపాదాబ్జ భృంగమైతనరు
వాసనగల కాళిదాసులఁ దలఁచి
వలనుకపోతవాక్యము . . "

**End:**

* * * *

మహితాత్మమానవమనుజనాయకులు
కట్టిది యీ ఘోర కాననంబులను
. . . . . . పతివ్రతోలనిలచి
యమతనూభవుఁడేడ్చె నతి దుఃఖమునను
శమ . . . .
. . జలియ నిట్లనియె
ధర్మంబు లెఱుఁగని ధరణీశుభంగి
ధర్మాత్మ . . . . .
అగ్నిహోత్రములు వారకయవ్వేల్చెదరు
అగ్నిప్రతాప . . . "

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది గాదు. శైథిల్య గ్రంథపాతములు గలవు. తప్పులున్నవి.

శ్రీమద్రామాయణమునందు విభీషణుఁడు శ్రీరాముని శరణముజొచ్చినపుడు సుగ్రీవుఁడు రామునితో, "విభీషణుఁడు శత్రుప్రాయుండైనను శరణాగతుఁడైనందున రక్షణీయుఁడ" ని చెప్పుచు, తదర్థబోధముగ "నొక కపోతము, తన భార్య ప్రాణములం గొనిన కిరాతునియందు వైరముంచక, స్వకీయ శరీరమాంసము నా బోయవానికొసఁగి, యతని తుత్తుం దీర్చినదని" చెప్పిన యొక కథ యిందు వర్ణింపబడినది. కర్త యెవ్వరో తెలియరాదు.

---

## No. 1039. కపోతవాక్యము.

## KAPŌṬAVĀKYAMU.

Substance, palm-leaf Size, 11 × 1¼ inches Pages, 90. Lines, 4 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as the above.

**Beginning:**

“ శ్రీలలనాధీశుఁజిరకృపావేశు
నీలనీరదగాత్రునిగమచారిత్రు
శాశ్వలోక . . .
విశ్వత శ్రీవత్సు జలజదళాక్షు
వివిధయోగాసీను, విబుధవిధాను
బహుదైత్యమదభంగు, ప్రణవాంతరంగు
నాశ్రితమునిసేవ్యునాద్యంతభావ్యు
నాశ్రిత సురముఖ్యు నమృతభావాఖ్యు
* * * *
నిరుపమసుజ్ఞాననియమచాతుర్య
వరకవికందాళ వరదయాచార్య
సకలవిద్యాధుర్యజలధిగాంభీర్య
నకలంక సౌందర్య నఖినుతి జేసి
* * * *
ఎల్లలోకంబులు నెఱుంగఁగపోతి
ఎల్లప్రాణంబులు నెఱుకకు నిచ్చి
యిచ్ఛమైఁబతిఁగూడి యెఱుగయఁకపోతి
యచ్చెరువునవ్రాలె నైకాంత మోము
వెలవెలంబాఱంగ వేగరుచుకట
పొలుపొంద దూర్పునఁ బొడిచి యేతెంచె
బొరిఁపొరితారకంబుల తెల్వి మాసె
మరియుఁజంద్రునికాంతిమాసెనాలోన ”
* * * *

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గలదు.

ఇది నె 1038 రున వర్ణితమైనదే. ఇందు గ్రంథకర్త తన యాచార్యుఁడగు కందాళ వరదయాచార్యునిఁబేరొకొని యున్నాఁడేకాని తన పేరును జెప్పలేదు.

---

No. **1040.** కాటమరాజు చరిత్ర.

KĀṬAMĀRĀJUCARITRA.

**Substance**, paper. Size, 12 × 7⅘ inches. Pages, 120. Lines, 22 on a page. Character, Telugu. Condition, fair. Appearance, very old. Mode of writing, good but full of mistakes.

Complete.

Similar to the work described under No. 1031 *ante*.

**Beginning :**

శ్రీజాహ్నవిగంగఁ జిత్తమునఁదలచి
రాజితంబుగ విఘ్నరాజుకు మ్రొక్కి

* * * *

హరిపాదసేవకుఁ డతి భక్తిపరుఁడు
గురుతైన కొమనాల గోత్రాబ్ధిచంద్రుఁ
డెనయంగ గంగుల యెల్లయమూర్తి
తనయుఁడు, సర్వనతగు సహోదరుఁడు
పినయెల్లయనువాఁడు ప్రియముతో జనుల
వలనొప్ప శ్రీనాథువచనపద్ధతిని
జెప్పెనుయదుశాస్త్రి చరిత మంతయును
వినుపింతు యాదవ వీరుల చరిత
యీ కథ యాదవ వీరపోట్లాట
ఆ కథ వృత్తాంతమది యెట్టిదనిన
శ్రీకరంబైనట్టి సృష్టి లోకమున
నాకాటరాజనుఘనత పుణ్యుండు

* * * *

పగకునై పశువులఁ బాకనాటమేపి
పుల్లరి యియ్యక పొగలుచువచ్చి
వెలయవైరంబున్న యొఱగడ్డపాటఁ
బల్లివాదిరా జాతోఁబగదీర్తుననుచు

**End :**

అల్ల కాశీయాత్ర యటుపోయినట్టు
వల్లవులబత్తికెన్నవచ్చినదనుక
గంగనురణము కాపాడవలెనని రాజువేడంగ

* * * *

సాధించిపగతులఁ జాల సమయించి
యరలేక యొఱగిరి యమరయాదవులు
రణము కాపాడితే నాకు రణభుక్తిగలదు

* * * *

అని తలఁచి గంగ యాపోతురాజు
వలదిరిగి యారణము బనరంగఁ జొచ్చి
వల్లవుల తిరుమందులమీఁదనైననైనాన
శేషగిన్నెలో వీరసేసలు చేఁబట్టి
అందరిపై చిలికించి యపుడు ముద్రించి
యీాగెవాలకుండ నీకెపెట్టకుండ

*　　　*　　　*　　　*

కొంతిగలదేవోలు ఈరీతిఁగందువారకుండఁ
గా పాడుచుండెను రణవీరగంగ.

(వి-వి).—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులు మెండు శైథిల్యము కలదు. దీని మాతృకలోఁ బెక్కులు గ్రంథ పాతములుగలవుగా బోలును. ఇట్లుఁ బెక్కుపట్టుల గ్రంథపాతములు వ్రాయకే విడువఁబడి యున్నవి.

కాటమ రాజు చరిత్రమని పేరుగల యీ ద్విపద వికారరచనమును కొమనాల గోత్రుఁడును గంగుల యెల్లయ కుమారుఁడును నగు పెనయెల్లయ యనువాఁడు శ్రీ నాథుని రచనము ననుసరించి రచియించెను. శ్రీ నాథుని రచనమేదో యెఱుఁగరాదు. ఈ గ్రంథమున ఖట్టురాయ వారవుఁబట్టు మిక్కిలి తక్కువగాను, ఎఱగడ్డపాటి పోరాటము విషయము స్పష్టముగాను హెచ్చుగాను గలదు. ఖట్టు రాయవారము హెచ్చుగాఁగల రచనము వేఱొకటిగలదు. దానికి దీనికి రచనలోనే కాక కథావిషయమునను హెచ్చు తగ్గులుగలవు. ఇది తొలుత సరియయిన ద్విపద రచనములోనుండి పామరపాఠకులవశమై చెడిపోయి యుండును. ఈ కాటమ రాజు కథావిషయము లోకల్ రికార్డు 18 వాల్యంలోఁగలదు. - చిత్రభాను సంవత్సర మాఘ బహుళామావాస్యా మంగళవారమునాఁడు ఎఱగడ్డపాటి పోరాటమున సిద్ధయ తిక్కనయు రుద్రయయు రణరంగమున నొకరినొకరు నఱికికొని వీరస్వర్గమున కరిగినట్లిందుగలదు. దీనిఁబట్టి యుద్ధకాలము సరిగా నిర్ణయింపవచ్చును. లోకల్ రికార్డు 18 వ వాల్యంలో గల కాటమరాజు కథా వివరణమిది:—

" ఈ నల్లసిద్ధిదేవ చోళమహారాజు నెల్లూరి పట్టణమందు సింహాసనాధి రూఢుండై పృథివీ సామ్రాజ్యము సేయుచుండంగాను వారివద్ద రణతిక్కన అనే బ్రాహ్మడు సేనాధిపతి. ఇతనికి ఖడ్గ తిక్కన్న అని పేరుగలదు. అప్పుడు యాదవ వంశోద్భవుండైన కాటమరాజు, ఇతని పినతండ్రి పోలమరాజు, ఈ పోలమరాజు కొమారుడు కరి ఆవులరాజు వీరు లంకమల, పాలకొండ, నల్లమల, మొదలయిన పర్వత ప్రదేశమందు అరణ్యములో పచ్చిక పట్లను తమయొక్క విస్తారమైన గోగణమున సంరక్షణ చేసుకొంటూ నల్లసిద్ధి చోళ మహారాజుకు పుల్లరికిగానున్ను తమ మందలలో పుట్టే కోడెదూడలు కొన్ని యిచ్చేటట్టున్ను, వారి దేశమందలి వుండే పచ్చికపట్లును తమయొక్క విస్తారమైన గోగణమున సంరక్షణ చేసుకొంటూ నల్లసిద్ధి చోళ మహారాజుకు పుల్లరికిగానున్ను తమ మందలలో పుట్టే కోడె దూడలను కొన్ని యిచ్చేటట్టున్నూ వారి దేశమందలి వుండే కసువు పచ్చికపట్లు తమ గోగ్రాసముగా ఇచ్చేటట్టు గాను, నిర్ణయించుకొని కొంత సైన్యం అండలాలు పసుగులతో ప్రసిద్ధిగా వుండేవారు. మరికొన్ని దినములకు క్షామదశవల్లను గోవులు గ్రామములలో యెక్కడెక్కడ ఉన్న సస్యాములను మనుష్యుల అంకిలో నిలవక మేశేది గనుక ప్రజలు రాజుతో ఈ సంగతి విజ్ఞాపనం చేసుకొన్న యెడల " బీడు పచ్చికపట్లు యావత్తు కాటమరాజు వారి గోవులు మేపుకొనేలాగున మాటయిచ్చినాము. పైర్లు వారు మేపుకోవలసినది కాదు. అయినాగాని మీరు పైర్లు జాగ్రత్తచేసుకొనేది" అని శెలవు ఇచ్చి "మీరు పైరులు మేపవద్దు. బీడు పచ్చిక మేపుటకునేది" అని కాటమరాజు గారికిన్ని వ్రాసిపంపిరి. ఇదిగాక అరణ్య ప్రదేశములందుల కాటమరాజుగారి విస్తారమైన గోగణంతిరిగి మేస్తూవుండేది మొదలు కొని గోరక్షణార్థమై కాటమరాజువారు అగుపడ్డచోట క్రూరమృగములను వారే వధచేస్తూవచ్చేవారు గనుకనున్నూ అరణ్యమందు గోగోపాలకులయొక్క సమ్మర్దము విస్తారమైనందున సాధారణముగా మృగములు అరణ్యమందు నిలవక పోతూవచ్చినందుననున్నూ మృగవధచేసుకొని తత్సామాన్య వృత్తివల్లనుజీవనోపాయంకునివుండే కిరాతకులకు జీవనహాని అయినందుననున్ను ఆకిరాతకులు కాటమరాజుయందు ద్వేషులై ఉండిరి. అదిగాక నల్లసిద్ధిరాజుగారు వుంచుకొన్న భోగము దానివద్ద వక పెంపుడుచిలక వకనాటి కాలమందు మ్యాడలోనుంచి తప్పించుకొనివచ్చి అరణ్య శుకములనుకూడి కాటమరాజు ఆవుల మందలకు సామీప్యములకు సమూహముగా వచ్చి ధ్వనులుచేయగా కొన్ని గోవులు బెదరి

ల్యాగలను కలగ తొక్కుకొని పారిపోయినవి. అప్పుడు కాటమరాజు పినతండ్రి అయిన పోలమరాజు చూచి బాణము సంధానంచేసి వేసినందున ఆ బాణం సమూహాములో ఉండే పెంపుడు చిలుకకు తగిలి ప్రాణంవిడిచెను. ఆ చిలుక కాళ్లలో గజ్జెలు, అందెలు వుండేది పోలమరాజు చూచి ఇది పెంపుడు చిలుక అని నిశ్చయం చేసెను. అంతట ఆ సామీప్యమందున ఉన్న కిరాతకులు నల్లసిద్ధిరాజు ఉంచుకొని ఉన్న భోగము దానివద్దకు తీసుకొనిపోయి అగపర్చి నీ చిలుక తెచ్చివచ్చినంతట అన్యాయముగా కాటమరాజు తనతండ్రి అయిన పోలమరాజు బాణ ప్రయోగంచేసి చంపినాడని చెప్పినంతట అది చాలా దుఃఖస్థురాలై అరణ్యములో ఉండే క్రూరమృగాదులను వధచేసేటట్టుగాను వ్యాట లాడుతూ ఉండి కాటమరాజుగారి గోవులనున్ను వధించమని వుపదేశించెను. గనుక ఆ కిరాతకులు కాటమరాజు వద్దకువచ్చి మేము సామాన్య మృగములను వధ చేసుక జీవనం చేస్తున్నామని మనవి చేసినంతట కాటమరాజు అనుకూలించి శెల్వుయిచ్చినందున ఆకిరాతకులు అరణ్య మధ్యమందు మృగాదులను చంపినట్టుగా వుండి కొన్ని గోవులను గుండుతో వధచేసిరి. ఈ సమాచారములు కాటమరాజు విని చాలా ఆక్రోశముతో ఆకిరాతకులను చంపించి తబారభర్త్యం నల్లసిద్ధి రాజుగారికియిచ్చే వుల్లరి యివ్వకనిలిపెను. అంతట నల్లసిద్ధిరాజు గారు వుల్లరి యివ్వమని అందుకు ఆవుల మందలతో వుండే కోడెదూడలు తమకుతోలి అంపించమని వర్తమానం అంపించగా అందుకు కాటమ రాజు గారు మీ సీమలో మా ఆవుల మందకు నిరోపాదిగా వుండినట్టయితే మీకు వుల్లరి యివ్వవలసిన కర్తవ్యం, అటుగాక మీ దేశములో ఉండే కిరాతకులు మా యావుల మందకు వుపద్రవంచేసి కొన్ని ఆవులను నిష్కారణంగావధించినారు గనుక మేము వుల్లరి యివ్వవలసిన నిమిత్తం లేదని ఖండనగా వ్రాసి పంపించినందున అదివరకు మందలలో ఉన్న కోడె దూడలను తోలుక రమ్మని కొంత సైన్యమును నల్ల సిద్ధిరాజు పంపించినందున వారువచ్చి కోడెలను తోలుకొని పోవచ్చినంతట కాటమరాజువారు వచ్చిన సైన్యములను లక్ష్యంచేయక తిరుగా కొట్టినారు. గనుక వారు తిరుగా నల్లసిద్ధిరాజు వద్దికిపోయి యీ వర్తమానములు ఎరుకచేసినంతట నల్లసిద్ధి చోళ మహారాజులుంగారు, ముఖ్యసేనాధిపతి అయిన రణ తిక్కన్నతో కూడా కొంత సైన్యమునుకూర్చి కాటమరాజువారు సమాధానముగా కోడెలు ఇచ్చినట్లైతే ఉత్తమం. అటుకాని పక్షమందు వారిమీద కార్య పెట్టినున్ను కోడెలు యీవత్తు మళ్లించుక రమ్మని పంపించిరి. అదే

ప్రకారం సేనాధిపతి రణతిక్కన్న వచ్చి సమాధానంగానే విహితంతో యెప్పుడూ వచ్చే ప్రకారం మందలలో కోడెలను, ఇప్పించమని కాటమ రాజువద్ద వర్తమానం అంపించగా వారు అనుకూలించక ప్రతి ఘటించి ఉత్తరవు ఇచ్చినందున కార్య తిక్కన్న యుద్ధసన్నద్ధుడాయెను. ఈ యత్నము విని కాటమరాజువారున్ను వారికి విహితులైన వారిని కొంద రిని సహాయముగా కూర్చుకొని బలిమిగల ఆవులు మేలైన కోడెలు సహా వెంటకూర్చుకొని యుద్ధసన్నాహమై నిలిచిరి గనుక ఉభయపక్ష ములవారికి అఘోరమైన యుద్ధమాయెను. ఆ యుద్ధసమయమందు కాటమరాజు వారి గోవులు యుద్ధభూమిని వచ్చినిలిచి యెదిరి సైన్య ములో కొంతమందిని హతంచేసినవి. అంతట రణతిక్కన కార్యం నిర్వహించలేక తిరిగీ స్థళంలోకి లేచిపోయను. ఇంటివద్ద భోజన సమయమందు తిక్కన్న భార్యను తాను స్నానంచేసే రహస్యస్థళమందు నాకు నీళ్లు ఉంచిన కారణంయేమి. అని అడిగినంతట తిక్కన భార్య ప్రత్యుత్తరం ఇచ్చిన క్రమం. ఏ స్థళం అయితే యేమి, రూపభేదంవల్ల విశేషంలేదు గనుక ఇక్కడనే స్నానం చేయవచ్చును అని చెప్పి నంతట తాను కార్యంలోనుంచి తిరిగి వచ్చినందున భార్య ఆ మాట చెప్పి నది అని తెలుసుకొని స్నానాంతరము భోజనసమయమందు తిక్కనకు తల్లి విరిగినపాలు వడ్డించినందున అతను చూచి విరిగిన పాలు వడ్డించిన కారణం యేమని అడుగగా, ఈదినమందు మన గోవులున్ను మేతకు నీవు పోయిన పాలానికే పోయివచ్చినవి అని చెప్పినది గనుక తాను కార్యక్రమములోనుంచి విరిగి వచ్చినందున యిందుకు దృష్టాంతముగా తల్లి ఆమాట చెప్పినది అని గ్రహించినవాడై భోజనోత్తరమందు తిరుగా కొంత సైన్యమునుకూర్చుకొని యుద్ధానికి పొయ్యేటప్పుడు తల్లిని తన భార్యను పిలిచి పూర్వమున ఒక భట్రాజు నామీద కృతిగా ఒక పద్యం చెప్పవలెనని ఉద్దేశించి నాల్గు చరణములు చెప్పినాడు. అది యేదంటే

* * * *

ఈ ప్రకారము భట్రాజు పద్యము పూర్ణంగా నాల్గు యతి గీతలు రణ తిక్కని తల్లివద్దికి పోయి చెప్పగా ఆమె బహు సంతోషురాలైనా నా గర్భవాసమందున పుట్టిన పుత్రుండు సుపుత్రుండని భట్రాజు రణ తిక్కన పూర్వమందు చెప్పిన ప్రకారంగానే నాల్గువేల వరహాలు భట్రాజుకు ఇచ్చి మరిన్ని తగిన బహుమతులున్ను చేసెను. అంతట రణ తిక్కనయొక్క భార్య తన పతి అయిన రణ తిక్కనతో సహగ మనంచేసే నిమిత్తమై సచేల స్నానముచేసి అనేక దానములున్ను

బ్రాహ్మలకు ఇచ్చి రణభూమిని ప్రదక్షిణ నమస్కారములు చేసి తనపతి యొక్క కళేబరము గురుతు కనపడక ఉన్నందున స్వామిని ప్రార్థించి నేను పతివ్రతనైతే పతియొక్క శిరస్సు కనుపడునని నిశ్చయంచేసుకొని రణ తిక్క అని నంతట

ఆరణ తిక్కన్న శిరస్సు యుద్ధభూమిని పడియున్న కళేబరముల మధ్యనుంచి పైకి యెగిసిపడినది గనుక ఆ శిరస్సు గుర్తుపెట్టి తీసుకువచ్చి అందుతోకూడా అనుగమనం చేసినది. కాటమరాజు వారి సైన్యములో హత శేషమైన యాదవులు యుద్ధరంగంబునందు శమతోకూడా నిల్చిన శత్రువులను హతంచేసినవారియొక్క రూపము శిలలపైన చెక్కించి వీరులు అనే ప్రతిమలు తాలూకు మజుకూరు సగిలపోయి కట్టుమాజే కుంభగిరి అనే గ్రామములోను ఉన్నవి. ఇదిగాక యుద్ధరంగంబున ప్రాణంబువదలి సద్గతినిపొందిన గోగణములయొక్క శిరస్సులు శృంగములతోకూడా తీసుకవచ్చి వాటికి పసుపురాచి నిత్య సాంబ్రాణిధూపములు ఇచ్చి ఇండ్లలో ఉంచుకుని ఇవిగాక గోవులు ఆకృతిగా శిలలపై చెక్కించి అవిన్ని వక స్థళమందువుంచి పూజచేస్తున్నారు. ఆ శిలలు వుంచిన స్థలానకు జనులు ఆవులమాలె అని చెప్పుకుంటున్నారు. ఆ ఆవుల మాలెవద్ద పైనచెప్పిన యాదవులు ప్రతి సంవత్సరమున్ను తాళమేళములు పంబజోళ్లు, వీరతాళ్లు, జమిడికెలు, పురవనమద్దెళలు, ఈ వాద్యములతో సంభ్రమంచేస్తున్నారు. ఈ సంభ్రమానకు వారి సంబంధికులైనవారున్ను వారు కట్టించిన ఆవుల మాలెయందు, అభిమానంగలవారు యెంతదూరంలో ఉన్నాగాని వారిని కాటమరాజుగారి పాంగస్తులని వాడుతున్నారు. ఆలాగంటి పాంగ్యస్తులు, అయినవారికి పసుపుగుడ్డను అక్షింతలు గట్టి సంభ్రమంచేసేదినం నిర్ణయం చెప్పిపంపించి వారిని పిల్వనంపించి అందరు గుంపుగూడి ఆవుల మాలెవద్ద సంభ్రమము చేసేటప్పుడు పాంగ్యస్థులు అయినవారిలో వారివారికి తానకములు అనే నిర్ణయము కలవు. ". . . . . . . ."

---

## No. 1041. కాటమరాజుచరిత్ర (భట్టురాయబారము.)

## KĀṬAMARĀJUCARITRA (BHAṬṬURĀYABĀRAMU.)

Substance, paper. Size, $10\frac{5}{8} \times 8\frac{5}{8}$ inches. Pages, 63. Lines, 19 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Contains the embassy portion complete.

A romantic poem in the Dvipada metre, on the embassy sent through Bhaṭṭu by Nallasiddhacōla, chieftain of Nellore, to Kāṭamarāju, a shepherd Zamindar, demanding the payment of the taxes due from him for grazing the cattle on the king's land. Kāṭamarāju refused to pay the taxes with the result that a battle took place between them at Erragaḍḍapāḍu. For other particulars regarding the story, etc., vide No. 1038 *ante*.

**Beginning:**

బ్రహ్మోయుపుర నీకు బహుకుటుంబాధార
రమణాత్ యాదవ రాజచంద్ర
శుభమస్తురా నీకు సమరనిశ్శంకసా
హసవిక్రమా అసహాయశూర

* * * *

జయమస్తురా నీకు జననాథమణియును
కరుణింపుయాదవ కార్యఘనుఁడ

* * * *

జయగుణశాలి జయావీరసర్వజ్ఞ
జయపెద్దిరాజుకు జనపాలతనయ

**End:**

వేగమెమీసిద్ధిరాజు వెడలిరమ్మనము
పట్టుకోకపాగొట్టుకు పలుపుగామెలఁచి
నీకుఁబెట్టఁటకాదు మీతల్లియెఱుఁగు
సిద్ధిరాజుఁకు దామెనపలుపు
అనియిల్లభట్టుతోఁ జెప్పియందఱుకూడ
వినయమునకట్నాలు ఇప్పించిభట్టు
పంపించెపశుపతి ప్రజలెల్లమెచ్చ॥
అప్పుడుసంతోష అతివైభవముల
వచ్చెను నెల్లూరు వడివేగభట్టు
ఇచ్చెనుశంభుండు ఇహపరసుఖము॥

**Colophon:**

ఇదివిన్నవ్రాసిన నిష్టభోగములు
సదయుఁడైయిచ్చును సర్వేశ్వరుండు
కాటభూపాలుని కథ యెవ్వరైన
వాటంబుగావిన్న వసుధేశ్వరులకు
రాయబారం బని రంజిల్లుజగతి

ఆయురారోగ్యసౌభాగ్యంబుగల్గి
పూజ్యమైయీకథ పూర్ణంబునందె.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యముగలదు. గ్రంథపాతములు లేవు.

నెల్లూరిప్రభువగు నల్లసిద్ధిచోళుని బీళ్లలోఁ బశువులమేపుకొని పుల్లరి యియ్యక తగవాడుచున్న యాదవ రాజగు కాటమరాజుదగ్గఱకు నల్లసిద్ధి చోళుఁడుఁ రాయబారినిగా నొకభట్టును బంపుటయు, నాభట్టును గాటమరాజు గర్జించి వెడల నడుచుటయు నిందలికథ. ఇది కాటమ రాజు కథలోనిభాగము. దీని తర్వాతిభాగమునకు 'ఎఱగడ్డపాటి పోరాటు' మనిపేరు. ఇది మంజరిగానో ద్విపద వికారమగు నొక పాటగానో తొలుత రచితమైయుండును. పామరులనోళ్లనుండి మాఱుచుమాఱుచు వికారమును బొందిపొంది లిఖితమైనదిగాన తొల్లిటి రచనమిందుఁ జాలఁగాఁ దాస్మారయినది. దీని రచయితపేరిందు గాన రాదు.

---

## No. 1042. కాటమరాజుచరిత్ర.

## KĀTAMARĀJUCARITRA.

Substance, paper. Size, 13½ × 8 inches. Pages, 32. Lines, 34 on a page. Character, Telugu. Condition, much injured. Appearance very old. Mode of writing, fair but full of mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిదేకాని తప్పులుమెండు. శైథిల్యము గ్రంథపాతములు అధికముగాఁ గలవు.

ఇది నెం 1041 రున వర్ణితమైనదే. ఇందీ యితరగ్రంథము లున్నవి :—1*a*. చాటుపద్యములు, 24*a*, ఎఱగడ్డపాటి పోరాటము.

---

## No. 1043. కాటమరాజుచరిత్ర (భట్టురాయబారము.)

## KĀṬAMARĀJUCARITRA (BHAṬṬURĀYABĀRAMU).

Substance, paper. Size, 12½ × 8 inches. Pages, 92. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Complete.

Same work as the above.

The MS. is dated 10th August 1842. English notes by Mr. C. P. Brown are found throughout the MS.

The following note is found in the beginning of the MS. :—

"The occurrences described in this poem took place at the time when Bhuja Bala Vīra Nalla Siddha Dēva Chola Maharaz (a little baron with a long name *) ruled Neloor. And it has been ascertained that this was in the year 1081 of Śālivāhana or A.D. 1157.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

ఈ ప్రతి 1842 వ సం॥ ఆగస్టు 10 వ తేదికి వ్రాయింపఁబడినదట! బ్రౌను దొరగారి యింగ్లీషు టిప్పణి యిం దకడకడ గలదు. భుజబలవీరనల్లసిద్ధిదేవచోళమహారాజు నెల్లూరి నేలుచుండగా శా.శ. 1081. క్రీ. 1157 ఈ గ్రంథ కథార్థము జరిగినదని, ఈగంత ప్రభువు "ఏనుగంత పేరు"గా పై మహారాజు విషయమున్నదని, మేకంజీ|లైబ్రరిలోని మాతృకనుబట్టి యిది వ్రాయఁబడినదని దీనికి మఱొక ప్రతి కలదని, రెండును భిన్నములని, ఇందలి కథయెల్ల లోకల్ రికార్డ్సు 18 వ వాల్యూంలో గలవని బ్రౌను దొరగారు వ్రాసిరి.

ఇది నె 1041 రున వర్ణితమే. 48*a*. ఎఱగడ్డపాటి పోరాటము ఇందుఁగలదు.

---

## No. 1044 కాటమరాజు చరిత్ర.

## KĀṬAMARĀJUCARITRA.

Substance, palm-leaf. Size, 15⅓ × 1¼ inches. Pages, 142. Lines, 7 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Complete but breaks off in many places.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రమే. కాని గ్రంథపాతము లెక్కువ. వ్రాఁత తిన్ననిదే. తప్పులు హెచ్చు.

ఇది నె 1040 రున వర్ణితమైనదే.

---

* "ఈగంత ప్రభువు, ఏనుగంత పేరు".

"ఇందుకు మాతృక—Mackenzie నెం 2 రు".

## No. 1045. కామేశ్వరీ చరిత్రము.
## KĀMĒŚVARĪCARITRAMU.

Substance, paper. Size, 12 × 7½ inches. Pages, 115. Lines, 17 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Complete.

A poem in the Dvipada metre narrating the story of the marriage of Kāmēśvarī also known as Ādilakṣmī with Lord Kṛṣna. A full sketch of the story in English is given in the description of the work "Ādilakṣmīvilāsamu" described under No. 388 *ante*: The author Rēṭūri Bhāvanāmātya a disciple of Addaṅki Śiṅgarācārya, was the son of Nācārama and Rāmadhīmaṇi, who was the son of Pregaḍayāmātya of Śrīvatsagōtra.

**Beginning :**

శ్రీకామినీకాంతు శ్రితగుణవంతు
లోకైకసంస్తుత్యు లోకైకనిత్యు

* * * *

నయకీర్తి రెట్టూరి నరసింహామూర్తి
ప్రియమొప్పనుతియించి పేర్మిఁదలంచి

* * * *

హాద్దు (?) గామద్గురుండై దనరునట్టి
యద్దంకి శ్రీసింగరాచార్యుఁదలఁచి
ద్విపదగా నొకకథ తెనిఁగింపఁబూని
యపరిమితానంద మందియున్నంత
శ్రీమహాలక్ష్మి యాశ్రితకల్పవల్లి
ప్రేమతో మముఁబ్రోవఁ బేర్మిఁదలంచి
కలలోనఁ తనరూపు కరుణించిచూపి
పలుమారు పలికె తాత్పర్యంబుమీఱ
నేమించివినుమన్న నె్రగుంటిచెలువు
కామేశ్వరినణంగఁ గలమహావేల్పు
శ్రీరామచంద్రుని చేతిశాపమున
ధారుణిఁ బుట్టితిఁ దప్ప దీమాట
శ్రీకృష్ణదేవుని చెలిమిగోరుచును
నాకుఁదోడైన కన్యలుమఱిఁ గలరు

* * * *

కరమొప్పు రేటూరి గంగమంత్రీంద్ర
యురవొప్పననుఁగొల్తు రెల్లకాలంబు
నీకవిత్వప్రౌఢి నెలకొననిపుడు
నాకథయెల్ల మన్ననలారఁ జెప్పు
మనువొంద నీకు నిష్టార్థంబు గలుగు
ఘనతతో నిచ్చితిఁ గైకొమ్ము వేగ
నిరువొందనిందున కెఱుకమీఁతల్లి
కురులపైనిల్చితిఁ గొలువుమీ నన్ను
అని ప్రసన్నతఁ బలికి యాజాడఁ దెల్ప
నానరంగ సాష్టాంగమొరగినవాఁడ
తెలిసి మేల్కని మహా దృఢచిత్తమలర
విలసితంబైనట్టి వేడ్కరచింప
రీతిగాఁ గామేశ్వరీ చరిత్రంబు
ప్రీతిఁ జెప్పెద సమర్పణసేయఁగోరి
శ్రీవత్సగోత్రుండఁ జెలువంబుగాను
భావయామాత్యుఁడ భవ్యమానసుఁడ
బ్రహ్మాండమన్వయ ప్రభునిసత్కవిని
బ్రహ్మకటాక్షంబుఁ బడసినవారు
మహిలోనఁ బ్రెగడయ మంత్రిపౌత్రుండ
మహి కెక్కు రామార్థిమనిపుత్రుండ
ననువొంద నాంచారమాంబకు సుతుఁడ
నొనర రెట్టూరిపురి నెప్పునవాఁడ
సాంద్రమై మద్వంశ చంద్రలక్ష్మీప
తీంద్రకీర్తుల మెఱుంగెక్కినవాఁడ

* * * *

ఆముక గుంటిచె ర్వంకున్నకుంచ
కామేశ్వరికి నియ్యఁగా వేడ్కఁబూని
సరసత గచియింప సమకట్టినట్టి
కరమొప్పుతత్కథా క్రమ మెట్టిదనిన.

**End :**

అనియిట్లు సూతుఁ డయ్యఖిలమానులకు
వినుపించి యీకామవల్లిచరిత్ర

అమవో శ్రీసేర నబ్జాక్షిపేరఁ
గామారిసుతపేర ఘనశక్తిపేర

*　　*　　*　　*

ఆరూఢినిలువేల్పై తమకెపుడు
ప్రేమమిచ్చినగుంట చెరువునఁ గుంచ
కామేశ్వరనుపేరు గలవేల్పుపేర
నంకితం బొనరించి యఖిలకవీంద్రు
లంకించి మేలుమేలౌనని పొగడ

**Colophon:**

పావనచరితుండు పరగ రేటూరి
భావయామాత్యుండు ప్రస్తుతికెక్క
భూచక్రమందు నీపుణ్యచరిత్ర
మాచంద్రతారాకమైయొప్పఁజేసె

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదేకాని తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు

'ఆదిలక్ష్మి కామేశ్వరి' యని 'కామవల్లి' యని 'అక్కలు' అని బ్రాహ్మణాదివర్ణములవారిచే నిలువేల్పుగా నారాధింపఁబడు కామేశ్వరీదేవి యొక్క యవతారాది చరిత్ర మిందు వర్ణింపఁబడినది. శ్రీరామచంద్ర మూర్తిని, ఆదిలక్ష్మి మోహించి యిష్టార్థసిద్ధిలేమిచేఁ గోపించి కృష్ణావతారమందునట్లు శపించి, కామేశ్వరిగాఁ దానవతరించునట్లు శపింపఁబడి, యన్లే సప్తకన్యలుగా నవతరించి శ్రీకృష్ణావతారమందిన తన ప్రియుని బొందఁజాలక లోకమున ననేకుల కిలువేల్పుగా నర్చింపఁబడుచు వారి కిష్టార్థములిచ్చుచు, విరహ వ్యథ నోర్చుచు వెలయుచున్న కథా విధ మిందు వర్ణితమయ్యెను. ఆదిలక్ష్మి విలాసమను పేర నె 388 రున వర్ణితమయిన గ్రంథములోని కథయు నిదియే. అది పద్య కృతి.

దీనిని శ్రీవత్సగోత్రుఁడు ప్రెగడయామాత్యుని పౌత్రుఁడు, నాంచారమా రామధీమణుల పుత్రుడు, అద్దంకి సింగరాచార్యుని శిష్యుఁడు నగు రేటూరి భావనామాత్యుఁడు రచియించెను.

గుంటుచెఱువు కుంచె కామేశ్వరీదేవి కీకృతి సమర్పింపఁబడినది. గుంటచెఱువు గ్రామ నామముగా వచ్చును. కామేశ్వరీదేవి డెబ్బది రెండు స్థానకములందు వెలసినట్లిందుఁ గలదు.

## No 1046. కుశలవోపాఖ్యానము.
## KUŚALAVŌPĀKHYĀNAMU.

Substance, paper Size, 8 × 6¼ inches. Pages, 310. Lines, 12 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

A poem in Dvipada metre describing the story of Kuśa and Lava as found in the Jaimiuibhārata. The author Lāvanūri Rāmanārya was the son of Autalamantri and belonged to Nandavarika sect of Brahmans. For other particulars see the extracts given below.

**Beginning :**

ద్విపద. ప్రాచీన వేదమార్గ ప్రతిష్ఠాప
నాచార్య శ్రీసింగరాచార్య పౌత్త్రు
* * * *
నిరుపమ సత్కృపానిధి వింజమూరి .
తిరుమలాచార్యుఁ గీర్తిం . . . .
అనఘుఁ డౌబళమంత్రి యఖిలనియోగి
జనసేవ్యుఁ డెవ్వని జనకుఁడై వెలయు
అరయ నెవ్వనిమామ యనదంగ . . .
* * * *
ధాత్రిలో నెవ్వఁడుత్తముఁడు వసిష్ఠ
గోత్రుఁడై యున్నతిఁ గొమరుదీపింప
భూతలంబున నందపురవంశఘనుఁడు
ఆలోకసుతునకు నతిపుణ్యనైన
* * * *
అనఘబ్రహ్మశిష్ట నామాత్యవరుల
యనుజుసి దుర్గాంకు నగ్రసంభవుని
మండితగుణశాలి నాచయప్రోలి
నరసుత చిలుకల నారయపుత్రి
చిరకీర్తినికురుంబ సిరియమాంబికను
నెమ్మి రెట్టింప జనించే నయ్యు . . .
వినుతాకళంకుఁడై విలసిల్లునట్టి
మనుతండ్రి నౌబళామాత్యు భావింతు
* * * *

మార్తురఁ గెలిచి రామాయణచక్ర
వర్తినాఁ గీర్తిపై వర్తించువాఁడ
కవిరామనాఖ్య విఖ్యాతాహ్వయుండ

* * * *

తన కథకంటె నందనుల చరిత్ర
వినుటతండ్రికిఁ గడు వేడుకగాన
దశరథసుతునకుఁ దనకథకంటెఁ
గుశలవ మీకథ కూర్మిఘటించు
ననుచు నంతర్యామి యగు నీశ్వరుండు
ననుఁ బ్రబోధించిన నంచితభక్తి
శ్రీయురంబునఁ గల్గి చెన్నొందు హరికి

* * * *

మేఘనీలద్యుతి మెయి విలసిల్లు
రాఘవునకును మార్గణ లాఘవునకు
వెలయ విన్నపముగా ద్విపదరూపమునఁ
బలికెదఁ గుశలవోపాఖ్యాన మెలమి.

**End :**

జనకజతో ననుజన్ములతోడ
ననురాగమునుబొంది యారామవిభుఁడు
క్రతువిశేషంబులు గావించి విప్ర
తతులకు దక్షిణ లత్తనియంగ నిచ్చి
తనకీర్తిచంద్రిక ధరయెల్ల నిండ
జనలోకచంద్రుండు జగ మేలుచుండె

* * * *

ఎప్పుడు నీకథ నేసరోత్తములు
చెప్పిన వినిన వ్రాసినఁ బేరుకొనిన

* * * *

దురితవిముక్తులై తోయజనయను
కరుణఁ గాంతురు నిత్యకైవల్యపదము

ననుచు సూతుఁడు చెప్ప నా శౌనకాది
మును లందఱును డెందముల మెచ్చి రనుచుఁ

**Colophon :**

కృతులకు నెక్కు సంగీత సాహిత్య
చతురుండై దిరుమలాచార్య శిష్యుండ
నతులోకుఁ డగునంద నగరాగ్రహార
పతి లావనూరి యాబళమంత్రిసుతుఁడ
రామకథా విశారదుఁడైన సుకవి
రామనార్యుఁడఁ గవిరాజ మిత్రుండ
నీకుఁ బ్రియంబుగా నృపసార్వభౌమ
కాకుత్స్థకులరామ కళ్యాణనామ
సమధురరీతిమై జైమినిభార
తమున విస్తరమునఁ దనరు వైఖరుల
నలవడఁ గుశలవోపాఖ్యానకమునఁ
బలికితి నుత్తర భాగంబు వినుము
ఆచంద్రతారార్క మాచక్రవాళ
మాచంద్రశేఖర మైయొప్పుఁ గాక.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పులు పెక్కులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు. అవతారిక యసంపూర్ణముగా నున్నది.

సీతారాముల కుమారులగు కుశలవుల చరిత్ర మిందు జైమినిభారత ప్రోక్తమగు తీరున వర్ణితమైనది. నందవరిక బ్రాహ్మణుఁడగు లావనూరి రామనార్యుఁడు దీనికిఁ గర్త. ఈతని తండ్రి యాబళమంత్రి. విశేషముల కుదాహృత గ్రంథభాగములఁ జూచునది.

---

No. **1047.** కుశలవోపాఖ్యానము.

KUŚALAVŌPĀKHYĀNAMU.

**Substance**, paper. Size, 8⅜ × 6⅝ inches. Pages, 38. **Lines**, 14 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, fair. Mode of writing, very good but not free from mistakes.

Incomplete and imperfect.

**Same work as the above.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

## No. 1048. కుశలవోపాఖ్యానము.

## KUŚALAVŌPĀKHYĀNAMU

ubstance, palm-leaf. Size, 18¾ × 1½ inches. Pages, 223. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, not bad but full of mistakes.

Incomplete and imperfect.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు. గ్రంథాది నించుమించుగా నిర్వది పత్రములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1049. గంగావివాహము.

## GAṄGĀVIVĀHAMU.

Substance, palm-leaf. Size, 15½ × 1½ inches. Pages, 43. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, very bad and full of mistakes.

Complete

A poem in Dvipada metre describing the marriage of Gaṅgā, born as the daughter of a fisherman, with God Śiva. The author Citāru Gaṅgādhara was the son of Vīrayya and Mallamāmba and grandson of Nāgaliṅgayya and Sōmāmba of Jaṅgama sect. The work is dedicated to God Rāmēśvara worshipped at Ciricakōḍūru.

Date of transcription—Thursday, the thirteenth day of the dark fortnight of the lunar month Āśvayuja in the year Saumya. Name of the scribe—Pandiri Nandayaliṅgam who copied from a MS. of Enugapilli Vēṅkaṭarāmudu The MS. under notice was transcribed from the MS. of Nandayaliṅgam by Śivaliṅgam who was a disciple of Parvatāla Mallēśvara.

**Beginning :**

శ్రీకరసత్పాత్ర శంభువరపుత్త్రి
కాకోదరస్తోత్ర కాళికాపుత్త్రి
సోమార్కశశినేత్ర సుస్థిరగాత్ర
బ్రహ్మాండచారిత్ర పరమపవిత్ర
కామితఫలదాక్ష కరుణాకటాక్ష
దక్షగర్వితశిక్ష ధర్మసంరక్ష

* * * *

విద్యల మొదలైన విఘ్నేశ్వరునికి
కడియపుటట్లును గమ్మనుండ్రాలు
పచ్చితేనియ మంచి పంచదారయును

* * * *

శైవమార్గము లన్ని చేకొని తెలిసి
గంగావివాహంబు గలదు సంస్కృతుల
తెలుఁగున ద్విపదగాఁ జెల్లమిపఱిచి
శాస్త్రియుక్తముగాను జాణత తనర
చిరిచకోడూర్పురీ క్షేత్రనివాసు
రామేశ్వరునిఁ గృతిరాజుఁగాఁ జేసి
వినిపింతు మద్వంశ విధ మెట్టిదనిన
జంగమరాయండు సద్గుణోన్నతుఁడు
నగధైర్యుఁ డైనట్టి నాగలింగయ్య
తరుణిమణిసోమాంబ తనయుఁడై వీర
యకువాణి నిజరాణి యగు మల్లమాంబ
పెక్కునోములు నోఁచి ప్రియమర్థిఁగనిన
చక్కనితనయులు సద్ధర్మపరులు
మల్లియ్య వీరయ్య మహనీయఘనులు
అతిశాంతు లీముద్దు లనుజులతోడ
బుట్టిన శ్రేష్ఠుండు పురుషరత్నంబు
సరసప్రవీణుండు సద్గోష్ఠితోను
ఘనుఁడైన చిత్తూరు గంగాధరుండు
విరచితంబుగ నార్య వేదోక్తమైన
యీగంగకళ్యాణ మిదియెట్టిదనిన
వినిపింతు నీకథ వీరశైవులకు.

**End:**

కరమొప్ప చిత్తూరు గంగాధరయ్య
విరచితంబుగ సర్వవేదోక్తమైన
స్కాందపురాణాది కథల నున్నట్టి
యీగంగకళ్యాణ మెవ్వరు నైన
చదివిన విన్నను సర్వేశుకృపను
సిరియు నాయువు గల్గి చెన్నుమీఱుచును
కరితురగభట సంఘములు సేవింప
పుత్రపౌత్రులతోను భూచక్రమందు

* * * *

శ్రీగంగ యెన్నాళ్లు సృష్టి యెన్నాళ్లు
భూచక్రమునను నీ పుణ్యచారిత్ర
ఆచంద్రతారార్కమై యుండు నెలమి.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పులు గలవు. శైథిల్య మించుక కలదు. గ్రంథపాతములు లేవు.

ఏఱారిలో జాలరికన్యయై వెలసిన గంగాదేవిని శివుఁడు పెండ్లాడుట యిందలి కథ. ఈ కథావిషయము కొంత పౌరాణికముగాను కొంత దేశీయముగాను గలదు. చిత్తూరు గంగాధరుఁడు దీని రచియించెను. చిరివ కోడూరిపురమున వెలసిన రామేశ్వరస్వామి కిది సమర్పితము. విశేషముల కుదాహృత గ్రంథభాగములఁ జూచునది.

గ్రంథాంతమం దిట్లు గలదు :

"సౌమ్యనామ సం॥ ఆశ్వీజ బహుళ ౧౩ గు॥ వరకు పసగపిల్లి వెంకట్రాముడు పుస్తకంలోవున్న క్రమానను పందిరి నందయలింగం వ్రాశెను. ఈ నందయలింగం పుస్తకంలోఉన్న క్రమానను పురాణం పర్వతాల మల్లేశ్వరస్వామి శిష్యుఁడు, శివభక్తుల శివలింగం గంగావివాహం సంపూర్ణంగా వ్రాశెను."

---

## No. 1050. గంగావివాహము.

## GAṄGĀVIVĀHAMU.

Substance, palm-leaf. Size, 18 × 1¼ inches. Pages, 30. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair and free from mistakes.

Begins or fol 1*a*. The other works herein are : Caturvēdasāramu 17*a*, Cāṭupadyamulu 58*a*, Ghanaśivarājayōgamu 60*a*, Bhavānīśaṅkaravacanamulu 68.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

ఈ పుస్తకమున నీక్రింది గ్రంథములును గలవు : 17*a* చతుర్వేదసారము, 58*a* చాటుపద్యములు, 60*a* ఘనశివరాజ యోగము,68 భవానీశంకరవచనములు.

---

## No. 1051. చొక్కనాథచరిత్ర.

## COKKANĀTHACARITRA.

Substance, paper. Size, $12\frac{1}{8} \times 7\frac{7}{8}$ inches. Pages, 644. Lines, 18 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Complete.

A poem in Dvipada metre describing the sixty-four wonderful and miraculous sports of God Cokkanātha, otherwise known as Sundarēśvara, worshipped at Madura. This poem consists of nine Āśvāsas and is based upon the Madhurākhaṇḍa of the Hālāsyamāhātmya.

The author Paccakappurapu Tiruvēngalakavi was the son of Tipparāju and belonged to Battu caste. Timmarāju, grand-father of the author, and Ayyalarāju, younger brother of Timmarāju, were appreciated by the Kannada king Prauḍharāya and got the title " Paccakappurapuvāru". The work is dedicated to Pedarāmanṛpāla, elder brother of Cinarāmanṛpāla, at the instance of the latter. For other particulars see the Telugu extracts given below.

The following note of Mr. C. P. Brown is found at the beginning of the manuscript :—

" This is a collection of 64 Tales or Legends (లీలలు) intended to describe the miracles or pranks of the god Śiva—It pretends to be translated from Sanskrit. It is also met with in Tamil. The Telugu style is low and easy enough."

**Beginning :**

ద్విపద. శ్రీగణనాథుఁ బూజితలోకనాథుఁ
ప్రాగల్భ్యబుద్ధిసం ప్రాప్తసంసిద్ధి
. . . . . . . .
దంతవక్త్రుని నేకదంతుని మదిని
జింతించి యిష్టార్థ సిద్ధిగాఁ గొల్చి
. . . . . . . .
బిరుదు వేములవాడభీము నన్నయను
అరయఁ దిక్కన నెఱ్ఱనార్యు శ్రీనాథు
నిలఁ గల్గు కవులనునెల్ల సద్భక్తి
విలసితసద్వాక్య వితతి నుతించి
యే కృతిఁజెప్పిన నిష్టార్థసిద్ధి
యాకృతి రచియింప నతిభక్తిఁబూని
శ్రీకరంబైయొప్పు చెయ్యేటిదరిని
వె(ఒ?)రవా(పా?)ండువారి యందోరుగంటమ్మఁ
బరమకళ్యాణి సాంభవి నేకవీర
నాదిపరంజ్యోతి నఖిలైకమాత
నాదరంబుగ భక్తి నాత్మ భావించి
యేఁ జేయు కృతికిని నిసుఁడైనవాఁడు
రాజపూజితుఁడును రణవిజయుండు
. . . . . . . .
వినయవివేక సద్వినుత సుస్థిరుఁడు
మనుజేంద్రుఁ డఖిలసామ్రాజ్య వైభవుఁడు
నిబిడశౌర్యౌదార్య నిజకీర్తులందుఁ
బ్రబలిన చినరామ పార్థివేశ్వరుఁడు
ఒకనాఁడు నాత్మనుద్యోగఁబు కల్మిఁ
బ్రకటితవైభవ పారీణుఁ డగుచు
. . . . . . . .
నిటలాక్షపదభక్తి నియతిఁ జెంపొందు
భటవంశమున మెచ్చు పచ్చకప్పురము
తిప్పరాజ సుతుండు తిరువెంగళుండు
చెప్పంగ నేర్పుఁ బ్రసిద్ధంబుగాఁగ

నని విన్నవించిన నా చిన్నరామ
మనుజేంద్రుఁ డధిక సమ్మదముతో నపుడు
ననుఁ బిలిపించి మన్నన గారవించి
వినుతించి కర్పూర విడియంబు లిచ్చి
యనఘుండు మీతాత యగు తిమ్మరాజు
తన తమ్ముఁ డయ్యలుఁ దాను నిమ్మహిని
ప్రౌఢుఁడై చదువులఁ బరగ మెప్పించె
ప్రౌఢరాయలచేతఁ బచ్చకప్పురము
రా జనంగాఁ దిమ్మరాజుకుఁ దిప్ప
రా జుదయించె విరాజితమ్ముగను
రాజుల మెప్పించె రసికుఁ డాతని త
నూజుఁడ వార్యసన్నుత కవీంద్రుఁడవు
ప్రావీణ్య మతివి శోభనకవి వీవ
కావున నీవొక్క కావ్యంబు మాకు
ద్విపదభావంబునఁ దెలివొంది మిగుల
నుపమగా సత్కవ్యు లుల్లంబు లలర
మధురవాక్యంబుల మదిఁ గొనియాడ
మధురాపురేశు నిర్మలపుణ్యచరిత
చౌవష్టిలీలావిలాసంబు లాంధ్ర
భాషను బెదరామ పార్థివు పేర
సుచరిత్ర వైభవ సుత్రాము పేర
రచియించి విఖ్యాతి రాఁజేయు ముర్వి
నని యానతిచ్చిన నా మహారాజు
ననుపమ మధురవాక్యములకు మెచ్చి

. . . . . . .

చెలఁగుచు నుపనూ(నూ)?రి సింహాంబుపేరఁ
బురుషోత్తమధ్యానపూర్ణాత్ము పేరఁ
దగు గోళ్ల బసవేంద్రు తనయుని పేర
సుగుణాఢ్య పరసతీ సోదరు పేర
ఘనత స్వామిద్రోహగండని పేరఁ
జినరామవిభునికి జ్యేష్ఠుని పేర
దీపించు నచ్యుత దేవరాయ ప్ర

తావదక్షిణబాహు దండాంకుపేరఁ
జతురత నీకావ్య సారంబునకును
బలియైన పెదరామ పార్థివుపేగ
. . . . . . .
గల్పాంతరస్థాయి గావించి వెలయఁ
గల్పింతు నా కథాక్రమ మెట్టి దనిన

**End :**

. . . . . యమ్మహాదేవు
చరితంబునకు మహైశ్వర్యంబు నొంది
మఱియుఁ గుంభజునిచే మన్నన ల్గాంచి
నారదవ్యాససన్మౌని సంఘముల
కారీతిఁ జేరి సాష్టాంగము ల్చేసి
మఱియును మఱియు నమ్మహనీయచరిత
మరసి పేరొక్కని మెత్తు రమ్మౌను లెపుడు
అరుణాచలేంద్ర పూజామోదవిభవ
ధరమించునన్న నందలి పురాధ్యక్ష
ప్రియబంధు వనచైత్ర పిప్పాలగోత్ర
దయసత్య దాక్షిణ్య ధర్మస్వరూప
తగమించు వ్యాసతీర్థ ప్రియశిష్య
సుగుణాఢ్య పరసతీసోదరచరిత
ఆయతోన్నతశౌర్యుఁ డచ్యుతదేవ
రాయప్రతాపకార్యధురంధరుండ
అంచితకొదను నా యంకరగండ
మించి వర్తించు స్వామిద్రోహగండ
చేకొన్న నుపనూరిసింహాఖ్యజాంక
వాకిటి చిన్న భూవరసహితుండ
. . . . . . .
బసవభూవరతపఃఫలసత్కుమార
వసుధఁ గల్గిన కమ్మవంశవర్ధనుండ
బాగొప్పఁ దిప్పమాంబాదేవిగర్భ
సాగరసంభవ సంపూర్ణచంద్ర

చిరకీర్తియుతుఁడైన చిన్నరామప్ప
పురుషరత్నంబునఁ బొగడంగ మించి
లలితకీర్త్యభిరామ లావణ్యసోమ
విలసిల్లు పెదరామవిభవసుత్రామ
నరనాథ శ్రీచొక్కనాథు సత్కృపను
ధర నేలు మాచంద్రతారార్కముగను.

**Colophon:**

ఇది సర్వఘనసత్కవీంద్రపాదాబ్జ
విదితపూజామోద విమలుండు పచ్చ
కప్పురసౌరభ్యకలితనామాంక
తిప్పరాజసుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితంబుగ లోకవిఖ్యాతమైన
సగసలక్షణకావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీచొక్కనాథచరిత్ర
మందును నిది నవమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

హాలాస్య మాహాత్మ్యమని, మధురాఖండమని, నామాంతరములుగల సంస్కృత పురాణగ్రంథము ననుసరించి రచింపఁబడిన తొమ్మిది యాశ్వాసముల యీ హృద్య ప్రబంధమున దక్షిణ దేశమందలి మధురాక్షేత్రమున వెలసిన చొక్కనాథ (సుందరేశ్వర) స్వామి వారి లీలలు అఱువదినాలుగు వర్ణితము లయినవి; ఈ కృతిని భట కులమువాఁడయిన (భట్రాజు?) పచ్చకప్పురపు తిరువేంగళకవి రచియించెను. ఈతని తండ్రి పేరు తిప్పరాజు. ఈతని తాతయుఁ బిన్నతాతయు నగు తిమ్మరాజును, అయ్యలును. కర్ణాటాధీశ్వరుఁ డగు ప్రౌఢరాయలచే సత్కృతులై పచ్చకప్పురమువారని బిరుదుపేరందిరి. ఈ కృతి కమ్మవంశ్యుఁడును, నన్ననందలి (?) పురాధ్యక్షుఁడును, ఉపనూరి (?) సింహా, బిరుదాంకుఁడును, అచ్యుత దేవరాయల వారికి దక్షిణబాహువై తనరినవాఁడును, వ్యాసతీర్థులవారికి శిష్యుఁడును, అగు గోళ్ల చినరామనృపాలుని యానతిచే నాతని యన్న

యగు పెద రామన్నపాలుని కంకితము చేయఁబడినది. విశేషముల కుదాహృత గ్రంథభాగములఁ జూచునది.

---

## No. 1052. చొక్కనాథ చరిత్ర.

## COKKANĀTHACA RITRA.

Substance, palm-leaf. Size, 14 × 1¼ inches. Pages, 425. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete.

Same work as the above

Date of transcription—12th day of the solar month Kārttiki in the year Āngīrasa Name of the scribe—Māmiḷḷapalle Perumāḷayya who copied for Ayyalaseṭṭi, son of Tirupati Muddiseṭṭi.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె.

గ్రంథాంతమందిట్లు గలదు:—

“ అంగీరసనామసంవత్సరం కార్తీకనెల ౧౨ తేది వరకు తిరుపతి ముద్దిసెట్టి కొమారుడికి అయ్యాలశెట్టి పుత్రపౌత్ర పారంపర్యం తరం చదువుకునేటట్టుగాను, మామిళ్లపల్లె పెరుమాళ్లయ్య వ్రాసియిచ్చిన మధుర చొక్కనాథలీల తొమ్మిది ఆశ్వాసాలు సంపూర్ణం.”

---

## No. 1053. చొక్కనాథ చరిత్ర.

## COKKANĀTHA CARITRA.

Substance, palm-leaf. Size, 15¼ × 1⅜ inches. Pages, 509. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Complete, but imperfect.

Same work as the above.

Date of transcription—13th day of the dark fortnight of the lunar month Śrāvana in the year Kīlaka.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చిన్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె.

గ్రంథాంతమున నీవ్రాఁత గలదు:—

"పరువడి శ్రీపైఁడిపాటి వంశాబ్ధి
గరిమలసంపూర్ణ కాంతి సోముండు
వీరార్యతనయుండు వితరణఘనుఁడు
ధీరుఁడు రాచయ్య ధీరసన్నుతుఁడు
అతని కులాంగన . . .
. . . . . . .
తనరు విశాలాక్షి దాక్షిణ్యశీల
. . . . . .
అరయ నెన్నఁగఁజిన్నమాంబయనంగ
నిరువురు సతులకు నెలమి ధవుఁడు
రాచయేంద్రుఁడు మది రమణ రంజిల్లి
. . . . . . .
శరభేశకృపగల సత్కవీంద్రుండ
గురుతింప నారాధ్యకుల శేఖరుండ
పేరైన యేగంటి పెదసోమసూను
ఆరూఢి శ్రీసోమనాహ్వయచంద్ర
నరులెంచ శ్రీచౌకర్నాథుని లీల
లఱువదినాల్గును వైనట్టి చరిత
వరుసగా మాకును వ్రాసియిమ్మనిన

* * * *

సరసకీలకనామసంవత్సరమున
. . . ణ మాసంబునందు
బహుళ త్రయోదశివఱకును నేను
విలఖితంబుగఁ జాల వెలయ వ్రాసితిని."

## No. 1054. ధర్మాంగద చరిత్ర.

## DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, 12¼ × 8¼ inches. Pages, 121. Lines, 21 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete, but imperfect. The variations in readings are interlined only up to the 18th page.

A poem in Dvipada metre describing the story of Dharmāṅgada and his wife Satyavati, who gave birth to a serpent which, by virtue of her chastity, was transformed into a child, when it was bathed in the Brahmakuṇḍa. The author Bommakanti Narasimhamu of Kauṇḍinyagōtra was the son of Mādhava and Narasamma. The work is dedicated to God Gōpāla. From the concluding portion of the work it is presumed that the author lived near Mārkāpūr.

**Beginning :**

ద్విపద. శ్రీరుక్మిణీశ రాజిత కీర్తిసాంద్ర
సారసదళనేత్ర సజ్జనాధార

* * * *

భార్గవకులరామ పాలితస్వర్గ
స్వర్గామగోపాలబాలను తించి

* * * *

చేసెద ధర్మాంగ చరితంబు నేను
వాసిగాఁ గవులెల్ల వర్ణనసేయఁ
జారుమదీయవంశం బెట్టిదనిన
సారసంబగు యజుశ్శాఖియనంగ
గురుతైన కౌండిన్యగోత్రంబునందుఁ
గగమర్థి శ్రీబొమ్మకంటివంశాబ్ధి
వరచంద్రుఁడగు మాధవాఖ్యుఁడనంగ
పరమవైష్ణవమూర్తి భవ్యసద్భక్తి
సరససాహిత్యుఁ డాచరితసత్యుండు
డతని పత్నియు నర్సమాంబయనంగఁ
బతిభక్తిగలయట్టి భాగ్యగంభీర
పుడమి నాథునులకుఁ బుత్రుండ నేను

దడయక జను లెల్ల దయచాలఁగూర్చి
యరయంగ నరసింహుఁ డందురు నన్ను
హరుషించి శ్రీహరి కర్పితంబుగను
గోమరొప్ప నేను నీకృతియొనర్చెదను
గమనీయ తత్కథాక్రమ మెట్టిదనిన.

**End :**

అని గౌతముఁడు చెప్పె వాల్యతో నపుడు
విని తాను నాశ్చర్యవివశాత్మయగుచుఁ
జెలఁగుచు ఖంతోవశరథినుప్పొంగె
అని యిట్లు శ్రీరాము . . పేర
స్థిర మొప్పఁగాను శ్రీ . . వ్వులిపేర
మారకాపురి చెన్నకేశవు పేర

* * * *

యీ కథ యెల్లకాలంబును భువిని
నెందాఁకఁ జంద్రుఁడు . . . .

* * * *

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లక్కడక్కడ గలవు.

13 వ పుట వఱకు పాఠభేదములు చేర్పఁబడినవి. అవి అత్యధికముగా నుండుటచేఁ గాఁబోలు నంతకుమీఁద నట్లు చేర్పఁబడ లేదు.

ధర్మాంగద మహారాజుకు సర్పాకారముతో కుమారుడు జన్మించుటయునాతఁడు దన్నుఁ బెండ్లాడిన సగ్యావతీ కన్య పాతివ్రత్య ప్రభావముచే మానవాకారమును బడయుటయు నాది గాఁగల కథావృత్తాంత మిందు వర్ణితమైనది. దీనికి "పాముకథ" పాముపాట" యనియు వాడుక పేళ్లు. మంచి తెలుఁగు పలుకు బళ్లుగల యీ ద్విపదకృతికిఁ గర్త బొమ్మగంటి నరసింహకవి. కౌండిన్యగోత్రుఁడు. నరసమాంబా మాధవాఖ్యులకుఁ గుమారుఁడు. గ్రంథాంత్యభాగమునుబట్టి యీ కవి మారాకాపుర ప్రాంత వాస్తవ్యుఁడుగానుండ ననుకొనఁదగును.

## No. 1055. ధర్మాంగద చరిత్ర.

## DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, $15\frac{1}{2} \times 1\frac{1}{8}$ inches. Pages, 107. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, not bad but full of mistakes.

Complete.

Same work as the above With good readings in many places.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదేకాని తప్పు లున్నవి. పూర్వవర్ణితములగు ప్రతులకంటె నిది మంచి పాఠములు గలది. శైథిల్యము గ్రంథపాతములు నల్పముగాఁ గలవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దిట్లు గలదు:

“ప్రమోదూతనామ సంవత్సర మార్గశిర శు॥ ౧౫ వ్రాశిన ధర్మాంగద చరిత్ర.”

---

## No. 1056. ధర్మాంగద చరిత్ర.

## DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, $17 \times 1\frac{5}{8}$ inches. Pages, 55. Lines, 9 on a page. Character, Telugu Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free f1om mistakes.

Complete, but imperfect.

Same work as the above.

Date of transcription—Thursday, the ?rd day of the dark fortnight of the lunar month Jyēstha in the year Parīdhāvin. Name of the scribe.—Śrngārakavi Ciʟavenkanna who copied from a Ms. which belonged to Ulapā Bhāvanna and completed the copying by the grace of gods Kēśavasvāmin and Sōmēśvarasvāmin worshipped at Śri Kōlaṅka.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము, గంథపాతములు గలవు.

పూర్వమువ్రాలే.

గ్రంథాంతమం దీ వ్రాంత గలదు :—

"శ్రీ మురుముళ్లపతి శృంగారకవి వెంకన్నను రక్షించును . . వి సంవత్సర జ్యేష్ఠ బ॥ 3 గురువారం రోజ్న పులపా భావన్నగారి యింట్లో వ్రతినున్న క్రమానను శృంగారకవి చినవెంకు ధర్మాంగ చరిత్ర శ్రీ కోలంక కేశవస్వామి సోమేశ్వరస్వామి అనుగ్రహాముువల్ల వ్రాసుకొనెను."

---

## No 1057. ధర్మాంగద చరిత్ర.

## DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, 13⅜ × 1⅛ inches Pages, 182. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old Mode of writing, not bad but full of mistakes.

Complete, but very imperfect.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు చాల హెచ్చు.

పూర్వమువ్రాలే.

---

## No. 1058. ధర్మాంగద చరిత్ర.

## DHARMĀṄGADA CARITRA.

Substance, paper. Size, 9⅜ × 7⅝ inches. Pages, 56. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Complete, but imperfect

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వము వ్రాలే.

ఈ పుస్తకమున నితర గ్రంథములుకూడఁ గలవు. *1a* అభిషిక్త రాఘవము (అవతారిక మాత్రము) *9a* పట్లవారిమీఁది చాటుధారలు, 12*b* నరసింహాశతకము, 13*b* కొన్ని శ్లోకములు పద్యములు.

---

## No. 1059. ధర్మాంగద చరిత్ర.
## DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, $17\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches Pages, 75 Lines, 6 on a page Character, Telugu Condition, injured Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Complete

Same work as the above

(మ.-మ.)—

సమగ్రము. వ్రాఁత యంతమంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

---

## No. 1060. ధర్మాంగద చరిత్ర.
## DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, $14\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 200. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, not bad but full of mistakes.

Incomplete and imperfect.

Same work as the above.

(మ-మ.)—

అసమగ్రము. గ్రంథాంత్య భాగము లేదు. వ్రాఁత తిన్ననిదే కాని తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు చాలఁగాఁ గలవు.

పూర్వము వోలె.

---

## No. 1061. ధర్మాంగద చరిత్ర.
## DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, $13\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches. Pages, 70. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete and imperfect.

Same work as the above

(వి-వి)—

అసమగ్రము. ధర్మాంగదుఁడు తనతప్పిదము నొప్పుకొనుట గల ఘట్టము పఱుకుఁగలదు. వ్రాఁత మంచిదికాదు. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు అల్పముగాఁ గలవు.

పూర్వము వ్రాఁతె.

---

No. **1062.** ధర్మాంగద చరిత్ర.

DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, $16\frac{1}{4} \times 1$ inches. Pages, 100. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair and free from mistakes.

Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువ్రాఁతె.

---

No. **1063**. ధర్మాంగద చరిత్ర.

DHARMĀṄGADA CARITRA.

Substance, palm-leaf. Size, $13\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches. Pages, 91. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

Date of transcription :—Monday the fifth day of the dark fortnight of the lunar month Mārgaśira in the year Siddhārthi. Name of the scribe :—Bayyaparāju who copied from a MS of Cintā Mallaparāju.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వ్రాఁతె.

గ్రంథాంతమం దిట్లు గలదు.

"సిద్ధార్థి నామసంవత్సర మార్గశిర బ ౫ సో॥ వరకు చింతా మల్లపరాజు ప్రతిచున్న క్రమానను చిట్టాప్రగడ బయ్యపరాజు ధర్మాంగద చరిత్ర సంపూర్ణంగా వ్రాసెను."

---

## No. 1064. నలచక్రవర్తి చరిత్ర.

## NALACAKRAVARTI CARITRA.

Substance, paper. Size, $8\frac{3}{8} \times 6$ inches. Pages, 487. Lines, 12 on a page Character, Telugu. Condition, good. Appearance, not old. Mode of writing, very good and free from mistakes.

Complete in two parts. But Mr. Brown designed to divide it into five parts. The errata list of the printed edition is copied at the end of the work; and it occupies about four pages.

Similar to the work described under R. No. 145 and 315, of the Triennial Catalogue of Telugu MSS Vol II The author Cakrapuri Rāghavācārya was the son of Tiruvēngalācārya and grandson of Doḍḍayācārya and has dedicated this work to God Nṛsiṃhasvāmin worshipped at Ghatikācalaksētra

**Beginning :**

ద్విపద. శ్రీసతీహృదయేశుఁ జిరకృపావేశు
వాసవనుతవేషు వరభక్తపోషు

. . . . . . .

నిరుపమజయబాహు నిత్యకళ్యాణుఁ
గరుణారసముల్లాసు ఘటికాద్రివాసు
దేవాదిదేవు సందీప్తప్రభావు
గోవిందు నిత్యంబుఁ గొలిచివేడుకను

. . . . . . .

అమితగుణోపేత యఖిలైకమాత
యమృతవల్లమ్మ మాయమ్మ పూఁగొమ్మ
చరణారవిందము లన్నుతిచేసి
యురవంద భూతపురీశు యతీశు

. . . . . . .

సరసచారిత్రుఁ గేశవగురుపుత్రుఁ
జిరకీర్తిగంభీరు శ్రీభాష్యకారు

నతిభక్తిఁ జెంపెకిఁ యర్థించి మ్రొక్కి
శ్రితజనాధారు సంచితకీర్తిహారుఁ
గందర్పసంకాశుఁ గరుణానివేశుఁ
గందాళగురుచంద్రు ఘనదయాసాంద్రు

. . . . . . .

వరపుణ్యచారిత్రు వాధూలగోత్రు
దురితఖండనశౌర్యు దొడ్డయాచార్యు
మఱవక సేవించి మదిఁ బ్రస్తుతించి

. . . . . . .

నలువైన ఘటికాద్రి నారసింహునకు
వెలయ నంకితముగా ద్విపదరూపమున
సలలితసారాంధ్ర శబ్దసంగతుల
వలనొప్ప నలచక్రవర్తిచరిత్ర
విరచింతు నానేర్పు విధమెల్లఁ దెలియఁ
గరమొప్ప దత్కథాక్రమ మెట్టిదనిన.

**End:**

పొందుగాఁ దమతమ పురవరంబులకు
నందఱుఁ జని రంత నారాజవిభుఁడు
దమయంతిఁ దాను మోదంబున మించి
సుమబాణకేళిలో సొంపుదీపింప
నాచంద్రధరసురేంద్రాదులు పొగడ
భూచక్రమెల్ల నేర్పున నేలుచుండె
ననియిట్లు బృహదశ్వుఁ డాధర్మజునకుఁ
జెనుపొంద మున్నుదా విన్నమార్గమున
వరుసతో నలచక్రవర్తి చరిత్ర
సరసత గ్రంథ విస్తారంబుగాఁగ
వినుత వాక్యంబుల వెలయంగఁ జెప్పె.

**Colophon:**

అనుచు వాధూలగోత్రాబ్ధిచంద్రుండు
చిరకీర్తిమంతుఁ డాశ్రితహితోదయుఁడు
కరుణాపయోనిధి కందాళదొడ్డ
యాచార్యునకు శిష్యుఁడైనట్టి వైష్ణ
వాచారమూర్తి సత్యదయాపరుండు

పొలుపుమీఱిన చక్రపురిదొడ్డ ఘనుఁడు
వలనొప్ప నతనికి వరకూర్మితనయుఁ
డకలంకమానసుం డతిసత్త్వధనుఁడు
సకల కవిత్వవాచావిశారదుఁడు
తనరును సకలవిద్యాప్రవీణుండు
జనలోకనుతుఁడు సజ్జనలోకహితుఁడు
తిరువెంగళార్యుండు ధీరాగ్రగణ్యుఁ
డరయ నాతనికి నే నాత్మసంభవుఁడ
నమలమానసుఁడ విద్యావిశారదుఁడ
రమణ నే వరకవి రాఘవాహ్వయుఁడ
నరహరి ఘటికాద్రి నాథుని పేరఁ
బరువడి నే నంధ్రభాషలో నెలమి
నవనిలోఁ గవిరాజులై కట్టి సరస
కవులసత్కృప నాకుఁ గల్గుటఁ జేసి
యలరార నీనలాహ్వయుని చరిత్రఁ
దలఁచి చెప్పితిని నుత్తరభాగ మెలమి
వలనొప్పఁ జదివిన వ్రాసిన వినిన
జనుల కాయుర్భాగ్య సంతతు ల్గలిగి
ఘనులనఁ దనరి ప్రఖ్యాతిని గాంతు
రీచక్రవర్తి నలేంద్రుచారిత్ర
మాచంద్రతారార్కమై యొప్పఁగాత.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత మిక్కిలి చక్కఁగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వభాగమని ఉత్తరభాగమని ద్విధావిభాగముగల యీ నల చరిత్ర ప్రబంధము చక్రపురి రాఘవాచార్యునిచే రచితమయ్యెను. ఈ కవికి తిరువెంగళాచార్యుఁడు తండ్రి, దొడ్డయాచార్యుఁడు తాత. ఈ తఁడు కందాళ దొడ్డయాచార్యుని శిష్యుఁడు. ఈ గ్రంథము ఘటికాచలేశ్వరుఁడగు నృసింహస్వామి కంకితముచేయఁబడినది.

ఈ గ్రంథరచనము క్రీ. 1620 అయియుండునని బ్రౌను దొరగారు వ్రాసినారు.

ఆర్. నె 145, 315 రుల వర్ణితమైనదే యిది.

## No. 1065. నలచక్రవర్తి చరిత్ర.
## NALACAKRAVARTI CARITRA.

Substance, paper. Size, 12¼ × 8⅝ inches. Pages, 278. Lines, 22 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, very old. Mode of writing, very good but not free from mistakes. The different readings are interlined.

Complete.

Same work as that described under previous No. which was transcribed from this MS.

The following note of C P. Brown is found at the beginning of the MS. :—

"This is the original of the Edition printed by me at Madras in 1841. The various readings of several Manuscripts are preserved in the present volume prepared in 1828.

C. P. BROWN".

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. బ్రౌను దొరగారు 1828 వ సం॥ అనేక పుస్తకాంతరములనుండి పాఠభేదముల ననేకముల సేకరింపించి యందు పంక్తుల నడుమను, ప్రక్కలను జేర్పించిరి. 1841 వ సం॥ బ్రౌను దొరగా రచ్చువేయించిన ప్రతి కిది మాతృకయట.

పూర్వమువోలె, పూర్వపు దాని కిది మాతృక.

---

## No. 1066 నలచక్రవర్తి చరిత్ర.
## NALACAKRAVARTI CARITRA.

Substance, palm leaf. Size, 17½ × 1⅝ inches. Pages, 185. Lines, 8 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Complete, but imperfect.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు చాల హెచ్చుగా గలవు.

పూర్వమువలె.

గ్రంథాంతమున నీవ్రాంత గలదు. "జానసాల గురువయ్యగారి పుస్తకం".

## No. 1067. నలచక్రవర్తిచరిత్ర.

### NALACAKRAVARTICARITRA.

Substance, palm-leaf. Size, 13½ × 1¼ inches. Pages, 320. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు సమితముగఁ గలవు.

పూర్వమువోలె.

---

## No. 1068. నలచక్రవర్తిచరిత్ర.

### NALACAKRAVARTI CARITRA.

Substance, palm-leaf. Size, 13⅝ × 1¼ inches. Pages, 184. Lines, 6 on a page. Character, Telugu Condition, Slightly injured Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Complete, but imperfect

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. కాని ద్వితీయభాగపు తుది నించుక కొఱఁత. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు కలవు.

పూర్వము వోలె.

---

## No. 1069. నలచక్రవర్తి చరిత్ర.

### NALACAKRAVARTI CARITRA.

Substance, palm-leaf. Size, 14⅞ × 1⅜ inches. Pages, 130. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete and very imperfect.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. పూర్వభాగాంతమున 12 ఆకులు కొఱంత. ద్వితీయభాగమునను లోపములు గలవు. వ్రాఁత మంచిదే. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు హెచ్చుగా గలవు.

పూర్వము వోలె.

---

## No. 1070. నలచక్రవర్తిచరిత్ర.

## NALACAKRAVARTI CARITRA.

Substance, paper. Size, $12\frac{1}{2} \times 7\frac{7}{8}$ inches. Pages, 143. Lines, 19 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

The other work herein is :—Navanāthacaritra, 1a.

Begins on fol 237a.

Complete in three cantos, but imperfect.

Same work as that described under R. No. 166(b)

**Beginning:**

ద్విపద. శ్రీరామ రఘురామ సీతాభిరామ
ధారుణీపతిరామ దశరథరామ
కాకుత్స్థకులసోమ కళ్యాణధామ
నీకర్పితంబుగా నే రచియింతు
భారతకథలోనఁ బంచమవేద
సారంబు కీర్తిగా సాధించెఁ గాన
వార్తగా నలచక్రవర్తి చరిత్ర
కీర్తింప వారికి నంకితముగా ద్విపదఁ
గావింతు . . . . . .

**Colophon:**

ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభ సూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మన నామధేయ
విరచిత నలచక్ర విభుసుచరిత్ర
నరుదు మీఱంగ ద్వితీయాశ్వాసమయ్యె

**End:**

గారవింపుచు మహీకాంతులు దన్నుఁ
జేరి కొల్వంగ రాజేంద్రుఁడు మించి

ధర్మమార్గమ్మున ధరణి పాలించె
ధర్మజ యని బృహదశ్వుండు చెప్పె
శ్రీరంగరాజ యాశ్రితకల్పభూజ
నీరజదళనేత్ర నిత్యచారిత్ర

*          *          *          *

రంగు చెలంగు భారతపురాణమునఁ
బన్నుగా నారణ్య పర్వంబునందు
వన్నెగా నలచక్రవర్తి చరిత్ర
వినిన వ్రాసినఁ జదివినఁ బేరుకొనిన
జనుల నెవ్వరి కైని శ్రీరంగ వెలచు

*          *          *          *

తలకొని యాచంద్ర తారార్కముగను
వెలయుఁ గీర్తుల నభివృద్ధిఁ జెందుదురు.

(వి.-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లల్పముగాఁ గలవు. ఈ ప్రతివిలేఖనము 1841 మే 21 తేది ప్రాంతముల ముగిసినది.

వల్లభసూరికుమారుఁ డైన తిమ్మయకవి రచియించిన ద్విపదభారతము నరణ్యపర్వైకదేశ మిది కాఁదగును. ఇది మూఁడాశ్వాసములు గలది. ద్విపదభారతము నెం 974 చూచునది. ఆర్ నె 145, 315 రున వర్ణితమైన నలచరిత్రము వేఱు ఇది వేఱు. ఆర్ నె 166-*b* రున వర్ణితమైనదియు నిదియు నొక్కటే.

ఈ పుస్తకమున 1-*a* నవనాథ చరిత్ర గలదు.

---

## No. 1071 నలచక్రవర్తిచరిత్ర.

## NALACAKRAVARTICARITRA.

**Substance**, palm-leaf. Size, 14½ × 1¼ inches. —Pages, 116. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, not good and not free from mistakes.

Incomplete and imperfect.

Same work as that described under R No 166 (b), but contains many different readings.

(వి-వి.)—

అసమగ్రము. దమయంతీ స్వయంవరఘట్టముదాఁకఁ గలదు. వ్రాఁత మంచిది గాదు. తప్పు లెక్కువ. శైథిల్యము, గ్రంథపాతములు చాలఁ గలవు.

డి. నె 1070 రు, ఇదియు నొకటే కాని పాఠభేదములు పెక్కు లున్నవి.

---

No **1072** నలచక్రవర్తిచరిత్ర.

NALACAKRAVARTICARITRA

Substance, palm-leaf. Size, $17\frac{5}{8} \times 1\frac{1}{4}$ inches Pages, 140. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Almost complete but imperfect Leaves 14 to 27 are missing.

Slightly different from the work described under No. 1070 *ante*.

**Beginning:**

ద్విపద. శ్రీరమణీనాథు శృంగారనాథు
భూరికృపాలోలు భువనాలవాలు

* * * *

చారణసిద్ధఖేచర శుభాకారుఁ
గారుణ్యగుణధాము ఘను రంగధాము
నిష్కళంకోన్నతి నెఱికొప్పు చంద్ర
పుష్కరిణీతటంబున మహోన్నతిని
విలసిల్లు నుభయ కావేరిమధ్యమునఁ
జెలువొందు గోవిందుఁ జితరానందు
పరమమౌనిజవేల్పు ఫణిరాజతల్పు
మఱవక భావించి మదిని సేవించి

* * * *

పరమకృష్ణక్సేనపతిఁ గొనియాడి
గరుడాదినిత్యులఁ గొనఁక వర్ణించి
ధీరుల బుణ్యమం దిరు లయివెలయు
వారల సయ్యాళువారులఁ దలఁచి

రామానుజుల పాద రాజీవయుగము
నామనంబున నెంచి నమ్మి సేవించి
సారెకుఁ దిరుమలాచార్యుల పాద
నీరజయుగళంబు నెమ్మి సేవించి

*　　*　　*　　*

భారతకథలోనఁ బంచమవేద
సారంబనఁగఁ గీర్తి సాధించెగాన (సాంగంబుగాఁగ)
వార్తగా నలచక్రవర్తి చరిత్ర
కీర్తింప హరికి నంకితముగా ద్విపద
గావింతు నారాజ కరిగిరీంద్రునకుఁ
దావేడ్క నాచంద్రతారార్కముగను
ఘనులెల్ల సలపదకములనియెన్న

*　　*　　*　　*

వినుతతత్త్వజ్ఞుఁ పృథ్వీపతియనఁగఁ
దనరిన వాక్యంబు దలఁచి యీ చరిత
మనువొప్ప రంగనాథుని కటాక్షమున
విరచింతుఁ దత్కథావిధ మెట్టి దనిన.

(వి-వి)—

అసమగ్రము. తుదిపట్టు కొంచెము కొఱఁత. వ్రాఁత తిన్నని దేకాని తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు మిక్కిలి యెక్కువగ నున్నవి.

ఇది నెం 1070 రఁగ వర్ణితమైనదే. కాని పాఠభేదములు పెక్కు లున్నవి

---

## No 1073. నలచక్రవర్తిచరిత్ర.

## NAḶACAKRAVARTICARITRA.

Substance, palm-leaf. Size, 12⅜ × 1½ inches. Pages, 84. Lines, 6 on a page. Character, Telugu Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Similar to the work described under No. 1070 *ante* The story herein is based on the version contained in the Rāmāyaṇa, as narratek by Agastya to Rāma It is dedicated to God Rāma. The name of the author is not given.

**Beginning:**

ద్విపద. శ్రీరామచంద్రుఁడు రాజీవదళాక్షుఁ
గారుణ్యవారిధిఁ గమనీయగాత్రు

* * * *

మనమునఁ దలఁచి తామరచూలిఁ గొలిచి
యనువొందఁగా శారదాంబను బొగడి

* * * *

సరసులు బుధులు మెచ్చఁగ నలచరిత
తెరగొప్పఁ దెనుఁగున ద్విపద చేసెదను
అరుదారఁ గుంభజుం డారాఘవునకుఁ
గరమొప్పఁ జెప్పె నకథ యెట్టిదనిన॥

**End:**

కదనంబు సదనంబు గాఁజేసి మఱియు
మదము నేనుఁగుల నుత్తలై కొలిపి
చెక్కును ముక్కును శిరమును నురముఁ
బ్రక్కయుఁ బిక్కయు బరులును గురులుఁ
గాలును గీలును గరమును . . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే కాని తప్పులు గలవు. శైథిల్య మించుక కలదు. గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1070 రున వర్ణితమైన గ్రంథమును బోలినదే కాని యది గాదు. ఇందు కథానుసర్గ్రాకర్త యగస్త్యుఁడు శ్రీరామచంద్రమూర్తికిఁ జెప్పినట్లున్నది. ఈ గ్రంథము శ్రీరామాంకితము, కర్త పేరెఱుఁగ రాదు.

---

## No. 1074. నలచక్రవర్తిచరిత్ర

## NALACAKRAVARTICARITRA.

Substance, palm-leaf. Size, 13⅝ × 1⅞ inches. Pages, 52. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

**Incomplete and imperfect.**

**Slightly different from the work described under No. 1070 *ante*.**

(వి-వి.)—

అసమగ్రము. ఉత్తర భాగము కొంతనుండి గ్రంథముతుదిదాకఁ గలదు. వ్రాఁత మంచిదే. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

నె 1070 దున వర్ణితమైనదే. అయినను నిందుఁ బెక్కు భిన్న పాఠము లున్నవి.

---

## No. 1075. నలచక్రవర్తిచరిత్రము.

## NALACAKRAVARTICARITRAMU.

Substance, palm-leaf. Size, 15½ × 1½ inches. Pages, 16. Lines, 8 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good and free from mistakes

Incomplete.

Same work as that described under No. 1070 *ante*.

(వి-వి.)—

అసమగ్రము, వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

ఈ సంపుటమున 9ᵃ ప్రబంధరాజశిరోభూషణవిజయవేంకట విలాసము గలదు.

---

## No. 1076. నలచక్రవర్తిచరిత్రము.

## NALACAKRAVARTICARITRAMU.

Substance, palm-leaf. Size, 14 × ⅘ inches. Pages. 220. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as that described under No. 1070 *ante*.

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథాంత్య భాగము లేదు. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

## No. 1077. నవచోళచరిత్ర.

## NAVACŌLACARITRA.

Substance, paper. Size, 13⅜ × 8 inches. Pages, 179. Lines, 25 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Begins on fol. 205*a*. The other works herein are 1*a* Pāvulūrigaṇitamu, Nalarājacaritramu 47*a*, Nigamārthatattvamu 85*a*, Śālihōtrīyamu 105*a*, Hayalakṣanavilāsamu 111*a*, Vaidyaviṣayamu 131, Nandavaracaritramu 137*a*, Dēvamallucaritra 163*a*

Complete.

A poem in the Dvipada metre describing the story of nine Cōla kings such as Karikālacōla, Vikramacōla, etc. The author Pōlisetti Liṅganakavi has dedicated this work to God Mrtyuñjayēśvara of Bagirāmapalli. The work was written at the instance of Cakilāla Lingayya The author has also written Śaṅkaradāsamayyacaritramu, Vīrasangayyadēvacaritramu, Malhaṇacaritramu, and Śisyaprabōdhamu

**Beginning :**

శ్రీగురుమూర్తి భ్రాజితయశస్స్ఫూర్తి
నాగమార్గవిచారు నఖిలోపకారు

* * * *

వరకరస్థలపద్మవాసు మహేశుఁ
బరమేశు నాత్మలోఁ బ్రస్తుతిసేసి

* * * *

అభినవమల్లేశు నఖిలైకగురుని
నభిమతసిద్ధిగా నాత్మలో నిల్పి

* * * *

గురుమూర్తి శ్రీపాలకరికి సోమేశు

* * * *

చరణంబులకుఁ జకర జాఁగిలి మ్రొక్కి
వీరభద్రేశ్వరు విజయసాహసము
వీరరసంబున విరచించి తానె

* * * *

(పా)టలసద్భక్తిపరులు నుతింప
కాటకేకిన గొర్లపాటి లక్ష్మణుని
వెలయఁగా వినుతించి విజ్ఞానమునను

గలుగు నాది శివకవి ప్రౌఢ భజించి
విమలశివాచార విభవసంప్రీతి
రమణతో నవచోళరాజుల మహిమ
నిర్ణయంబుగఁ జేసి నిపుణత మెఱసి
వర్ణించునట్టినా వంశ మెట్లనిన

* * * *

శంకరదాసయ్య శరణవంశజుండ
శంకరదాసయ్య శరణగోత్రజుండ
మూలమౌ శ్రీగురుఁ బూజించు శ్రీల
లీలమై పో(ల్ ?) పెట్టె లింగ నామమునఁ
బరగినవాఁడ సద్భక్తుల కరుణ
స్థిరభక్తిమహిమలఁ జెందినవాఁడఁ
బ్రాకటవరబుద్ధిఁ బరగనేఁ బూను
నీ కథావృత్తాంత మిది యెట్టిదనిన

* * * *

[భక్తి
పరులు శ్రీగుండయ్య బ్రహ్మయ్యగారు
దురితమదేభసందోహపంచాస్య
లమితులు వారి నిజాంశంబునందుఁ
బ్రమథపదధ్యానభావసంధాను

* * * *

పరమాత్ముఁ డుద్దాము బగిరాముపల్లి
గురుపదధ్యానుండు గురుపూజరతుఁడు
సంగతభక్తిభూషణుఁడు చకిలాల
లింగప్ప సద్భావలీలలనొప్ప
నన్నారాధించి మన్ననగారవించి
మున్నుగా భూతితాంబూలంబు లొసఁగి
విరివొప్పనీవులు వేడ్కతో నొసఁగి
యరుసంబుతోడుత నప్పు డిట్లనియె
నిరవొందమునిముక్తి యీశు రామేశు
వరలబ్ధమున భక్తవరు లవు ననఁగ
గరమర్థి వెలయు శంకరదాసమయ్య
చరితంబు నర్థిర సంగయ్యదేవు

చరితంబు మల్హణచరితంబు మఱియు
సరసంబు దనర శిష్యప్రబోధనము
నచలితప్రీతిఁ బరానురాగమున
రచియించి వరభక్తి రచనవిష్ప్పాపి
కావునసట్టి సంసారివిగాన
భావజ్ఞులగు భక్తిపరులు కారణులు
రసికులు సపచోళరాజులు మున్ను
అసలారఁ బూజించి యాఢ్యత మించి
వలనొప్ప మోక్షంబు వడసిన మహిమ
సలకన్నడముచేసి రాధ్యులు మున్ను
వెలయఁగా నీవును విజ్ఞానమునను
తెనుఁగున ద్విపదగాఁ దేటతెల్లమిగ
ఘనకీర్తిప్రియపూర్వకంబున మెఱసి
శ్రీగురుమూర్తిదేశికచక్రవర్తి
పరమాత్మ శ్రీ(బగి)రాముపల్లి నివాసః
ధ్రువయశస్సారుఁడు మృత్యుంజయేశ్వరుఁడు
అవిరళభక్తిసామ్రాజ్యపూజ్యుండు
సద్గుణనిధి సత్యసంధుండు మహాయశుఁడు(?)
మద్గురునాథుండు మన్మనోహరుఁడు
అనురక్తినట్టి మహాత్ముని పేరఁ
దనరారఁగా నంకితము సేయవలయు
అని యానతిచ్చిన నమ్మహామాని
వినయోక్తులకును . . . లట్ట(ంటి)

* * * *

కరుణాత్మ మిమ్మునుండి గలిగెఁగా మాకు
శరణులఁ గొనియాడు సచ్చరిత్రంబు
శివపదాంబుజభృంగశీలాంతరంగ
అవధరింపుము లింగ యార్యప్రసంగ

**End:**

ఆ మహాభైరవుఁ డతని పత్నియును
క్షేమస్థులైయుండ్రి శివుని సన్నిధిని

* * * *

ఈ మహాత్ముని చరిత మెవ్వరేనియును

ప్రేమతోఁ జదివిన . . .
. . . . . . . కెల్లి
నీశానుఁ డొసఁగు మహేష్టసంపదలు

**Colophon:**

ఇది పరవీరమాహేశ్వరదివ్య
పదపద్మమకరందపానమధూక
భవ్యజంగమలింగభక్తిలిప్తైక
దివ్యసదానంద ధీయుతయుక్తి
కన్నరమఠసదాగారగురుశిష్య
చన్నబసవన్నప్రసాదసతాటవ్య
వరలబ్ధభాసురవాక్ప్రౌఢిదనర
నిరతమై శోభిల్లు నిత్యసౌభాగ్య
సాగరశంకరజాత సద్వంశజాత
వీరవ్రతాచార వినయప్రచార
మూలమౌ శ్రీగురుఁ బూజించు శీల
లీలల పోశెట్టి లింగాఖ్యసుకవి
రచితమౌ నవచోళరాజుల చరిత
మచలితంబుగఁ బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పులు మెండు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

నవచోళ చరిత్రమని పేరుగల యీ ద్విపద ప్రబంధమున కరికాల చోళ, విక్రమ చోళాదులగు తొమ్మండ్రు చోళరాజుల చరిత్రము వర్ణితమైనది. పోలిసెట్టి లింగనకవి దీనికిఁ గర్త. బగిరాముపల్లి మృత్యుంజయేశ్వరున కంకితముగా చకిలాల లింగప్ప ప్రేరణమున నీ కృతి రచియింపఁబడినది. ఈ కవి యింతకుముందు శంకరదాసమయ్యచరితము, వీరసంగయ్యదేవచరిత్రము, మల్హణచరిత్రము, శివభక్త్రప్రబోధము అను గ్రంథములు రచియించినట్లుందు గలదు. గార్లపాటి లక్ష్మణుఁడను కవీశ్వరుఁడు భక్తిపరులు నుతించునట్లు పాటలను రచించి ప్రఖ్యాతికెక్కెనని యీ కవి స్తుతించినాఁడు.

ఇందు యితర గ్రంథములు గలవు: 1a పావులూరిగణితము, 47a

నలరాజచరిత్రము, 85*a*. నిగమార్థతత్త్వము, 105*a* శాలిహోత్రీయము, 111*a*. హాయలక్షణ శిలా ము, 134 వైద్యవిషయము, 137*a* నందివరచరిత్ర, 163*a* దేవమల్లుచరిత్ర.

---

No 1078. నవచోళచరిత్ర.

NAVACŌḶACARITRA.

Substance, paper. Size, $11\frac{5}{8} \times 8\frac{3}{8}$ inches. Pages, 145 Lines, 20 to 35 on a page. Character, Telugu. Condition, much injured. Appearance very old. Mode of writing, bad and full of mistakes

Complete.

Same work as the above, which was transcribed from the MS described under this No.

(వి-వి)—

సమగ్రమే. వ్రాంత మంచిది గాదు. తప్పులకుప్ప శైథిల్యము లేదుగాని గ్రంథపాతములు పెక్కులు.

నె 1077 రున వ్రాతమైన గ్రంథమే. ఆ పుస్తకమున కిది మాతృక.

---

No. 1079 నవనాథచరిత్ర.

NAVANĀTHACARITRA.

Substance, paper. Size, $12\frac{1}{2} \times 7\frac{1}{4}$ inches Pages, 463. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair Appearance, old Mode of writing, fair but full of mistakes.

Begins on for —*a* The other work herein is Nalacakravarticaritra 237*a*

Complete

A poem in Dvipada metre describing the story of the well-known Rasasiddhas who are nine in number, i. ., (1) Śiva, (2) Mīnanātha, (3) Caurangi (Sārangadhara), (4) Gōraksanātha, (5) Mēghanātha, (6) Nāgārjuna, (7) Siddhabuddha, (8) Virūpākṣa and (9) Kaṇika. It is stated that the last six Siddhas went all over the world preaching the Siddhakriyā The author Gauranāmātya, son of Ayyal umantri of Gautama gōtra, has based this work on a prior Telugu work by Śrīgiri and has dedicated this work to Muktiśāntabhikṣāvṛttirāyuḍu who was the agent of the temple of Śri Mallikārjuna at Śriśailam.

The author was the son of Ayyalu mantri, who was the younger brother of Potarāju the minister of Siṅgavamādhava Kṣitipāla

**Beginning:**

శ్రీసర్వమంగళాంచిత వామభాగు
భాసురభక్తాఘపాటనోద్యోగు

*  *  *  *

రుచిరాంగు మల్లికార్జునమహాదేవు
నచలితభక్తి మదాత్మలో నిలిపి

*  *  *  *

సుచిరమద్వచస్స్ఫురణ శోభిల్ల
విరచింతు నొకకథావృత్తాంత మనఘ
నకలంకముగఁ గోరుట్ల అడరుచున్నంత
నొకనాఁడు మద్భాగ్య యోగంబు కతన
శ్రీమహానీయ ప్రసిద్ధిఁ బెంపెసఁగ
శ్రీమల్లికార్జున శ్రీమహాలింగ
సర్వలోకోత్తమ సామ్రాజ్యభార
నిర్వాహకప్రౌఢి నీతికోవిదుఁడు
కుహనావిరుద్ధజైనకోలాహలుండు
మహిత బిజ్జలరాయ మానమర్దనుఁడు
సన్నుతశైవదీక్షాగురుం డసమ
సన్నాహగణపతి సప్తాంగహారుడు
శ్వేతాంబర ప్రాణవితతజీమూత
జాతమహోదగ్రజంఝానిలంబు
పరసమయాంభోధి బడబానలుండు
వరశరణాగతవజ్రపంజరుఁడు
విపులవిశ్వంభరావిశ్రుతాశేష
నృపసరసీకృతనిజశాసనుండు
బంధురసుజతపోబలవిశేషాను
సంధానరక్షిత సకలకర్ణాట
మండలాధీశరమా విలాసనుఁడు
చండవిరోధితుషారభాస్కరుఁడు

*  *  *  *

అవిరళయోగవిద్యానిధి యపర
శివమూర్తి సంతతాశ్రితకల్పతరువు
ఘనముక్తిశాంతభిక్షావృత్తిరాయఁ

డనుపమంబైన మహావైభవంబు

* * * *

సరిలేనినటనటీజనులు పాటకులు
దారలు భృత్యులు నమాత్యులు పురోహితులు
పరిచారకులు రాయబారులు వైద్య
వరులు దైవజ్ఞులు వరుసగాఁ గొలువఁ
గొలువుండి బహుళకథాగోష్ఠులు వినుచు
నవిరళయోగవిద్యాధికులైన
నవనాథవరుల పుణ్యాపవర్తనములు
పరగ శ్రీగిరికవిపద్యబంధముల
విరచించినాఁ డది ద్విపదకావ్యమునఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధిఁ బెంపలర
నిప్పుడుగల సుకవీంద్రులలోన
సరససాహిత్యలక్షణవివేకముల
సురుచిరమధురవచోవిలాసములఁ
గులశీలములను సద్గుణకలాపముల
గలవాఁ డెవ్వఁ డని విచారించి
సింగయమాధవక్షితిపాలమంత్రి
పుంగవుఁ డైనయొప్పు పోతరాజునకు
ననుజాతుఁ డగుచు నయ్యలమంత్రిమూర్తి
తనయుఁ డుత్తముఁడు గౌతమగోత్రజుండు
భ్రమరాంబికావరప్రాప్తవిచిత్ర
విమలసాహిత్యప్రవీణాధికుండు
ననఘచిత్తుఁడు గౌరనాహ్వయఖ్యాతుఁ
డన సముఖమునకుఁ దగఁ బిలిపించి
కరుణామృతము నిండఁ గడలొత్తు మాపుఁ
బరగించి యుచితసంభావన నెఱయ
మన్నించి మాకోర్కి మధురమై వెలయు
సున్నత నవనాథచరితంబు ద్విపద
కావ్యంబుగాఁ జెప్పి కమలజవిష్ణు
సేవ్యమానునకును శ్రీశైలపతికి
శంకరునకు బాలశశిశేఖరునకు
నంకితం బొనరింపు మనుచుఁ గర్పూర

పూరితంబైన తాంబూలంబు లొసఁగి
గారవించుటయు దిగ్గనఁ బ్రమోదంబు
దలకొని మత్కవితా విలాసంబు
వెలయు మీవంపు గావింప భాగ్యంబు
గలిగి ధన్యుఁడనైతిఁ గామితార్థములు
ఫలియించె ననుచు సద్భక్తి దదాజ్ఞఁ
దలమీఁద నిలిపి డెందపుఁదమ్మిలోన
నెలకొన భ్రమరాంబ నిలిపి పూజించి

*    *    *    *

పావనునకు సర్వభాషా విశేష
కోవిదునకు రాయగురుశిఖామణికి
దుర్వారజైనసింధురమృగేంద్రునకు
సర్వజ్ఞునకు ముక్తిశాంతరాయనికి
ననవరతాభ్యుదయాభివృద్ధియును
ఘనతపోరాజ్యసౌఖ్యప్రసిద్ధియును
గృపమీఱ నొసఁగు శ్రీగిరిభర్త పేరఁ
త్రిపురదానవమదద్విపసింహు పేర

*    *    *    *

వామదేవుని పేర వరదుని పేర
శ్రీ మల్లికార్జున శ్రీ మహాదేవు
పేర నే నొనరించు ప్రియకథా సూత్ర
మే రీతి ననిన—ము న్నెల్లకాలమును . . .

**End :**

ఆ సిద్ధవరుని మహానుభావంబు
భాసురంబగు నా కృపాలు భాగ్యంబు
ఘనమైన యా తటాకము విశేషంబు
వినుత . . . వేలు చందముల
నడర భూవిభుఁడు నిష్టాన్నసువర్ణ

*    *    *    *

దంతితురంగగోధనధాన్యదాన
వస్త్రభూషణభూమి వరదానములను

. . . . . .

. . . . . గె సంపూర్ణ భోగములఁ
జెలలీల రాజ్యంబు సేయుచునుండె

**Colophon :**

అని చతుర్దశభువనాధీశు పేర
వినుతవేదాగమవేద్యుని పేర
ఘనముక్తికాంత భిక్షావృత్తిహృదయ
వనజప్రభాతదివాకరు పేర
నారవితారాంశశాంకమై మెఱయ
గౌరనామాత్యపుంగవకృతం బగుచు
ననువొందు నీ నవనాథచరిత్ర
మను కావ్యమునఁ బంచమాశ్వాస మయ్యె
నయ మొప్ప నీ నవనాథచరిత్ర
రయమునఁ జదివిన వ్రాసినవార
లవిరళభోగభాగ్యము లెల్లఁ గలిగి
భువిలోన నత్యంత పుణ్యు లగుదురు.

౧౮౪౧ వ సం॥ మే నెల ౭ వ తారీకున యీ గ్రంథము తిరుమల నాయడు బ్రహ్మయ్య వీర్ల చేత శ్రీమలోనుంచి వచ్చిన మాతృకతో మఖా విలా చేయబడ్డది.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు చిన్నచిన్న గ్రంథపాతములు పెక్కులు గలవు. శైథిల్యము లేదు.

(1) శివుఁడు, (2) మీననాథుఁడు, (3) చౌరంగి, సారంగధరుఁడు, (4) గోరక్షనాథుఁడు, (5) మేఘనాథుఁడు, (6) నాగార్జునుఁడు, (7) సిద్ధబుద్ధుఁడు, (8) విరూపాక్షుఁడు, (9) కణికుడు ఁను తొమ్మండ్రు రసయోగసిద్ధుల చరిత్రను లిందు వర్ణితములయినవి. ఇందుఁ గడపటి యార్వురు దేశాటనమొనర్చి శిష్యుల ననుగ్రహించి వారికిఁ దమ విద్యల నేర్పుట మొదలగు విషయములు నిండఁ గలవు. విరూపాక్షుఁడో ఆతని శిష్యులో "అమృతఘ్నసిద్ధి" "అమృతము" అను గ్రంథముల రచించిరఁట !

శ్రీగిరి యను కవీశ్వరుఁడు రచియించిన యాంధ్రపద్య ప్రబంధము ననుసరించి గౌరనామాత్యుఁడను ప్రశస్తకవి **యీ ద్విపద కృతిని**

రచియించెను. శ్రీగిరి నిపద్యకృతి యెప్పుడు గానరాదు. గౌర నామాత్యుఁడు, గౌతమగోత్రుఁడు, అయ్యలు మంత్రి కుమారుఁడు. సింగయమాధవక్షితిపాలుని మంత్రి నాగు పోతరాజున కీయయ్యలు మంత్రి తమ్ముఁడు. హరిశ్చంద్రోపాఖ్యాన మీ గౌరనమంత్రి కృత్యం తరము.

ఈ గ్రంథము ముక్తిశాంతభిక్షావృత్తిరాయని కంకితము సేయఁ బడినది. ఈతఁడు శ్రీశైల మల్లికార్జునస్వామి సర్వసామ్రాజ్య భారమును నిర్వహించుచుండు మఠాధిపతి. ఈతనికి, కుమారనాబిరుదవైరికోలాహలుఁడని, బిజ్జలరాయమానమర్దనుఁడని, గజపతి సప్తాంగహరుఁడని, ఇత్యాదులు బిరుదులు గలవు.

237-A నలచక్రవర్తి చరిత్ర యిందు గలదు.

---

## No 1080. నవనాథచరిత్ర.

## NAVANĀTHACARITRA.

Substance, paper. Size, 12⅝ × 7⅝ inches Pages, 388. Lines, 24 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes

Complete

Same work as the above from which the MS. under notice was transcribed.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఇది నె 1079 దున వర్ణితమగు ప్రతికి పుత్రిక.

---

## No. 1081. నవనాథచరిత్ర.

## NAVANĀTHACARITRA

Substance, palm-leaf. Size, 14 × 1⅜ inches Pages, 358. Lines, 6 on a page. Character, Telugu Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes

Complete

Same work as the above.

Date of transcription—Second day of the dark fortnight of the lunar month Bhādrapada in the year Piṅgala. Name of the scribe—Siddhāpuram Veṅkayya.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

గ్రంథాంతమం దిట్లు గలదు :—

"పింగళ సం॥ భాద్రపద బ ౨ లు . . శిద్ధాపురం వెంకయ్య వ్రాసెను."

---

## No 1082. నవనాథచరిత్ర.

## NAVANĀTHACARITRA.

Substance, palm-leaf. Size, 16¾ × 1 inches. Pages, 78. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Contains the latter portion of the first Āśvāsa and the beginning portion of the second Āśvāsa.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. ప్రథమాశ్వాసము కడపటి భాగమును, ద్వితీయాశ్వాసము మొదటి భాగమును గలవు. వ్రాంత మంచిదే. తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు.

చౌరంగియను నామాంతరముగల సారంగధరుని చరిత్ర మాత్రమిందు గలదు.

---

## No. 1083. నవనాథచరిత్రము (సటీకము).

## NAVANĀTHACARITRAMU (SAṬĪKAMU).

Substance, paper. Size, 12¾ × 7⅞ inches Pages, 95 Lines, 24 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Variations in the readings are interlined throughout the MS Mode of writing, fair but full of mistakes.

Begins on fol 288-a

The other works herein are—Hariścandracaritra (Dvipada) 1 a, English translation of Hariścandracaritra (Dvipada) 338.

Contains the commentary on a small portion in the third Āśvāsa.

Same work as that described under No. 1079 ante.

**Beginning:**

Text—తనశిష్యవరులతోఁ దడయక కదలి. వ్యాఖ్య—తన శిష్యవరులతో తనయొక్క విద్యార్థిశ్రేష్ఠులతోఁ గూడాను। తడయక ఆలస్యముఁజేయక। కదలి తర్లి.

మనమార నరుగుచో మత్స్యేంద్రుకెదుర. మనమారను సంతోషముతోను। అరుగుచో పోవుచున్నుండగాను। మత్స్యేంద్రుకెదుర మీననాథునికి ముందుగాను.

కడిఁది భల్లూకంబు కసిమసరేగి. కడిఁది గొప్పదైనటువంటి। భల్లూకంబు ఎలుగుబంటి। కసిమసరేగి అత్యంతము విజృంభించి.

బెడిదంపుఁగోరల బెట్టు నొగిల్చి. బెడిదంపుఁగోరల గొప్ప పక్కపండ్లచేతను। బెట్టు దుస్సహముగాను। నొగిల్చి బడలేటట్లుచేసి.

**End:**

ఈకల్ల కిటుదగు నిటమీఁద నెట్లు. ఈ కల్లకు। ఈ నేరమునకు। ఇటువగు ఈలాపత్తిదైయుండ నొప్పును। ఇటమీదను ఇకపిమ్మటను। ఎట్లు ఏలాగున.

Text—శాపమోక్షము నాకు సమకూరు నట్టి. వ్యాఖ్య—శాపమోక్షము శాప విమోచనము। నాకు సమకూరును సిద్ధించును। అట్టి ఆలాటి ॥

ఇత్యాది.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథ పాతములు లేవు.

నవనాథ చరిత్రము తృతీయాశ్వాసములోని యంజిబీ విప్రుల యుపాఖ్యానమునకు మాత్రము టీక గలదు. సంస్కారములు పెక్కులు బంతులనడుమఁ జేర్పఁబడినవి. ఈ టీక బ్రౌను దొరగారి యానతిచేఁ జేయఁబడినదై యుండును. ఈ కథాభాగమందలి విషయములనెల్ల బ్రౌను దొరగారు 4 పుటలలో నింగ్లీషున వ్రాసిరి. అది 353 పత్రము తొలివైపుననుండి కలదు. గ్రంథారంభమున నిట్లుగలదు:

"గౌరనకవిప్రణీత ద్విపద కావ్యంబగు నవనాథ చరిత్ర మూడవ యాశ్వాసంబునఁ సిద్ధ శ్రేష్ఠుండగు నమ్మిన నాథునకొక బోయ చెప్పిన విప్రకథా సంక్షేపమును సటీకగాఁ జేయఁబడినది.

ఇందీ యితర గ్రంథములు గలవు 1 హరిశ్చంద్ర చరిత్రము (ద్విపద). 338 హరిశ్చంద్ర చరిత్ర ఇంగ్లీషు భాషాంతర కరణము.

---

## No. 1084. నవనాథ చరిత్రము (సటీకము.)

## NAVANĀTHACARITRAMU—SATĪKAMU.

Substance, paper. Size, 12⅜ × 7¾ inches. Pages, 58. Lines, 28 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair.

Begins on fol. 346*a*. The other work here in is Hariścandracaritra — Satīka 1*a*.

Incomplete.

Same work as the above which was transcribed from the MS. described under this No.

Date of transcription —11th day of June 1846.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. శైథిల్య గ్రంథ పాతములు లేవు. ఈ ప్రతి "1846 జూన్ 11 వ తేదిని ముగిసిన" దట.

నెం 1083 రున వర్ణిత మే. దాని కిది మాతృక. ఇందు గ్రంథాంతరము గలదు 1 *a* హరిశ్చంద్ర చరిత్ర (సటీకము).

---

## No. 1085. నవనాథ చరిత్ర (సటీకము.)

## NAVANĀTHACARITRA—SAṬĪKAMU.

Substance, paper. Size, 12⅝ × 8½ inches. Pages, 65. Lines, 26 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but full of mistakes. Variations in the reading are interlined.

Begins on fol. 251*a*. The other work herein is **Hariścandracaritra —Saṭīka 1*a*.**

**Incomplete.**

**Same work as the above.**

**Date of transcription—22nd July 1845.**

**(బి-బి.)—**

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. సంస్కారములు బంతులనడుమఁగలవు. ఈ ప్రతి 1845 జూలై 22 కు ముగిసినదట !

నె 1084 రున వర్ణితమైనదే. 1 *a* హరిశ్చంద్ర చరిత్ర సటీకము గలదు.

---

## No. 1086. పండితారాధ్య చరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, paper. Size, 12 × 7¾ inches. Pages, 930. Lines, 25 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete in five Prakaranas.

A poem in Dvipada metre describing the story of Mallikārjuna-panditārādhya, a well-known teacher of the Śaiva philosophy. The author Pālkurıkisōmanātha has dedicated this work to Pālkurikisūranāmātya of Haritasagōtra and Āpastambasūtra. The work also describes the biography of some other saints of the Śaiva religion.

The following note is found on the fly-leaf of the MS.

" The Charitra or Pandit Aradhya Charitra a favourite book among the Jangams.

A new edition prepared by Virabhadraya a learned Jangam priest: under the directions of C. P. Brown: corrected on a comparison of the various readings found in numerous manuscripts. The present volume was prepared under the inspection of the Editor. "

**Beginning :**

శ్రీ గురుమూర్తి నూర్జిత పుణ్యమూర్తి
నాగమాంతస్ఫూర్తి నానందవర్తి
వృషభస్వరూపు నవిద్యాదురాపు
విషమప్రతాపు నిర్విషయకలాపు

పరమకళ్యాణు సద్భక్తధురీణు
శరణగణప్రాణు సజ్జనత్రాణు
ప్రమథైకవిశ్రాము భసితలలాము
కమనీయగుణధాము గణసార్వభౌము
నీతజంగమదాస్యు నిగమమయాస్యు
భూతలైకనమస్యు బుధజనోపాస్యు
శివభక్తసింహంబుఁ జిన్నివాసంబు
భవగిరికులిశంబు బసవలింగంబు
తెల్లంబుగా నస్మదీయేశుఁ జెన్న
మల్లికార్జునదివ్యమహితరూపంబు
దానైన బసవన నందనాయకుని
జానొంద మత్ప్రాతిస్వామిఁ గావించి

* * * *

ఆరూఢముగ మల్లికార్జునపండి
తారాధ్యులచరిత్ర మర్థి వర్ణింతు

* * * *

చిరతమోగుణ పరిస్ఫీతుండు శివుఁడు
వరసత్వగుణైకస్వరూపుఁడు పండితుఁడు
అరయ నచరలింగ మాంగమూర్తి
అరుదైన చరలింగ మాపండితయ్య
అసమలోకాధీశుఁ డంబికాధవుఁడు
అసమలోకారాధ్యుఁ డాపండితయ్య
అఖిలలోకమయుండు హైమవతీశుఁ
డఖిలలోకాతీతుఁడా పండితయ్య
లోకానుసారి త్రిలోచనుం డిలను
లోకానుసారశీలుఁడు పండితయ్య

* * * *

**End:**

అరయ నీకృతిసార మగు చతుర్థప్ర
కరణమధ్యమునఁ సంకలితమై వెలుఁగ

నవ్యగణసహాహ్రస నామస్తవంబు
భవ్యముగఁ బఠియించు ఫలలేశమునను
ఐహికాముష్మికోద్యత్సనాతనస
మాహితాభీష్టసౌఖ్యము లొందు నఱిన
ప్రమథరుద్రాదిపురాతనసూత
సమహాగణాభివర్ణనము లోకముల
నారూఢమగు మల్లికార్జునపండి
తారాధ్యచరితతథ్యంబుగా వినిన
చదివిన వ్రాసిన సంగ్రహించినను
ముదితాభిమతఫలంబులఁ బొందు టరుద
కావున నీకృతి గారవించినను
వారిరిఁ జదివిన వ్రాసిన విన్న
నరుదొంద వారికి నభిమతార్థములు
కరుణించు శివుఁడు మంగళమహాశ్రీలు.

**Colophon:**

ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య
పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమలింగ ప్రసాదోపభోగ
సంగతసుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మపాల్కురికి సోమనాథార్య(రాధ్య)
సుకవిప్రణీత భాసురతరదండ
నాయకబసవాంకనఖ్యాతగుణగ
ణాయత కీర్తిదిగంత త్రిలోక
గురుపండితారాధ్య చరితంబునందుఁ
బరువడిఁ బంచమ ప్రకరణ మొప్పు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. గ్రంథారంభమునఁ బదునాలు పుటలలో గ్రంథ విషయానుక్రమణికయు, ప్రకరణ ద్విపద సంఖ్యానమును గలవు.

గోదావరీమండలమందలి దాక్షా[illegible]మమున జన్మించి, శైవమతోద్ధారకుఁడై పేర్వెలసిన మల్లికార్జున పండితారాధ్యుల చరిత్ర మైదు ప్రక

రణములలో నిందు వర్ణింపఁబడినది. గ్రంథకర్త పాల్కురికి సోమనాథకవి. ఆతఁడు బసవపురాణము, చతుర్వేదసారము మొదలగు కృతుల రచియించిన తర్వాత దీనిని రచియించెను. ఆపస్తంబసూత్రుఁడును హారితసగోత్రుఁడును నగు పాల్కురికి సూరామాత్యున కీది యంకితము సేయఁబడినది. మల్లికార్జున పండితారాధ్య చరిత్రము ప్రధానముగా నున్నను నిందు అనుప్రసక్తములుగా పలువురు శైవాచార్యుల చరిత్రములును వర్ణితములయినవి. విశేషముల కుదాహృత గ్రంథభాగమును జూచునది.

---

## No. 1087. పండితారాధ్యచరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA

Substance, paper. Size, 12⅝ × 7½ inches. Pages, 1535. Lines, 15 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Variations in the readings are interlined and English notes by C. P. Brown are written in the margin. Bound in two volumes.

Complete.

Same work as the above.

The following notes by C. P. Brown appear on a fly-leaf of the first volume :—

"This volume contains the Pandit Aradyha Charitra being a continuation, of the Basava Puranam, by (the same author) Palcuriki Somanadha. It is complete in two volumes. See the remarks on this work in my Essay on the Jangam Literature printed in the Madras Journal in 1840.

This work being so voluminous, I wish to have it abridged by leaving out the verbose theological discussions and preserving only the legends ; some of which are very amusing.

In 1841 this book was well edited under my directions by Vira Bhadraya a learned Jangam Guru . who adopted the present volumes as the basis of the new edition which he has prepared

The present manuscript is founded on one in my library : it has been collated with three other manuscripts which furnished the various readings interlined in every page.

But two of these copies contained only the first volume. Thus more manuscripts are requisite for the second volume.

There are likewise two imperfect manuscripts : one of which contains little more than the First Book : the other contains only a part of the third Book.

The preface, being in prose, and intricate in style, deviates greatly in every copy.

After writing the above lines I obtained and collated a complete and good MS. which I found in the Mackenzie Library. And another was sent me by Mr. Walker."

At the end of the first volume the manuscript is dated " July 1839".

The following note is found on the fly-leaf of the second volume :—

" This roughly written volume is of great value. It was prepared under my directions and the interlineations preserve the various readings found in six manuscripts.

A new edition, on this basis, has been prepared by a learned Jangam Guru in my employ. Completed April 1841. "

The following note is found at the end of the work :—

" This manuscript was prepared in 1839. The various readings were inserted. June—November 1840.

The new edition was prepared in 1841 by Vira Bhadraya."

(వి-వి.)—

రెండు సంపుటములలో సమగ్రముగాఁ గలదు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లంతగా లేవు. కాగితములు పొట్టిపోవుటచే శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు. ప్రత్యంతరములలోని పాఠభేదము లిందు బంతుల నడుమఁ జేర్పఁబడినవి. బ్రౌను దొరగారి యింగ్లీషు సూచిక లక్కడక్కడ గలవు.

పూర్వమువోలె.

---

## No. 1088 పండితారాధ్యచరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA

Substance, paper. Size, 12½ × 8 inches. Pages, 945. Lines, 25 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old Mode of writing, good but full of mistakes. Bound in two volumes. Brief notes are given here and there

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. రెండు సంపుటములుగా నున్నది వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్య మించుక కలదు. గ్రంథపాతములు లేవు. అక్కడక్కడ పద పదార్థ విచారము లఘువుగాఁ గలదు.

పూర్వమువ్రాఁతె.

---

## No. 1089. పండితారాధ్యచరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, paper. Size, 13½ × 8⅝ inches. Pages, 444. Lines, 24 on a page. Character, Telugu. Condition, injured Appearance, very old Mode of writing, bad and full of mistakes.

Complete.

Same work as the above.

Date of transcription – October 1840

The following notes by C. P. Brown are found at the beginning of the work :—

" The Pandit Aradhya Charitra a Veera Saiva Poem intended to support the Creed of the Jangams or adorers of Basava.

I have marked in the margin the pages of my Collated manuscript bound in two volumes similar to this It is No. 330.

This MS has been collated throughout."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువ్రాఁతె

గ్రంథాంతమున నీవ్రాఁత గలదు :

" శ్రీమత్స్వస్తి సమస్త విజయాభ్యుదయ శాలివాహన శకాబ్దాః ౧౭౫౮ విజయనామ సంవత్సర మార్గశీర్ష మాసే శుక్లపక్షే పంచమీ సప్తాశ్వవాసరసంగమే శ్రీమచ్ఛిల్లకూరు మఠాధివాసభోగ . . . ఖ్య ద్విజతనూజాత మల్లయాభిధానః శ్రీమత్కామి సెట్టి . . . ఖ్య కుమార ఈశ్వరనామధేయస్య ఆరాధ్య చరిత్ర సంపూర్ణం.

ఇది ఆఖరు పర్యంతము మొకాబిలా చేయడమయినది. ఆ ౧౮౪౦ సంవత్సరం అక్టోబరు నెలలో తీరినది."

## No. 1090. పండితారాధ్యచరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA

Substance, paper Size, 12 × $9\frac{1}{2}$ inches Pages, 644. Lines, 22 on a page Character, Telugu. Condition, good. Appearance, new. Mode of writing, bad and full of mistakes. Bound in two volumes.

Complete.

Same work as the above.

(వి-వి)—

సమగ్రము. రెండు సంపుటములుగా గలదు. వ్రాంత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లల్పముగాఁ గలవు.

పూర్వమువలె.

---

## No. 1091. పండితారాధ్యచరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, paper. Size. $10\frac{1}{8}$ × $7\frac{1}{8}$ inches. Pages, 348. Lines, 25 on a page. Character, Telugu Condition, injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

This volume and the volume described under the next No. make one complete copy of the work.

Same work as the above.

The following note by C. P. Brown is found on the fly-leaf of the manuscript :—

" Charitragrundhum—or Remarkable actions of the religious priests of the Jungum sect

This is a poem in 5 books (contained in these two volumes), the title is Pandit Aradhya Charitra ; it is written in Telugu (translated from Canarese) in the metre called Dwipada. The author's name is Palcuriki Somanadha, (who also wrote the Basava Puran) and the book is very popular among Jangamas ——more particularly among the Aradhyas. The present manuscript is in two volumes--it is ill bound, the sheets being misarranged — the true order is shown by the pencil paging. It is in two volumes—of which this is the *first*.

This copy was examined throughout, when the new edition of the Charitra was prepared, under my directions in 1841. "

(ఐ-ఐ.)—

అసమగ్రము. మొదటనుండి రెండు ప్రకరణములు గలవు. మూఁడవ ప్రకరణమునఁ గొంచెము పట్టు గలదు. వ్రాఁత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

### No. 1092. పండితారాధ్యచరిత్ర.

### PANDITĀRĀDHYACARITRA.

Substance, paper. Size, $9\frac{7}{8} \times 6\frac{3}{4}$ inches. Pages, 290. Lines, 28 on a page Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

The M S. described under the previous No. and the MS. described under this No. make one complete copy of the work.

Same work as the above.

The following note is found in the beginning of this volume :—

"This is a favourite work among the Aradhyas or Jangam-Brahmins. This is the second and last volume. This volume is wrongly bound as the paging shows."

(ఐ-ఐ.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది పూర్వపు నెం 1091 దు పుస్తకమునఁగల భాగమునకుఁ దర్వాతి పట్టు. రెండు పుస్తకములను గూర్చఁగా సంపూర్ణ గ్రంథమగును.

---

### No. 1093. పండితారాధ్యచరిత్ర.

### PAṆḌITĀRÁDHYACARITRA.

Substance, palm-leaf. Size, $12\frac{3}{8} \times 1\frac{5}{8}$ inches. Pages, 20. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes. Breaks off in some places.

Incomplete.

Same work as the above.

(ఐ-ఐ.)—

అసమగ్రము. పండితారాధ్యుల శివపూజావసరవర్ణనము మాత్ర మున్నది. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము హెచ్చు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

## No. 1094. పండితారాధ్యచరిత్ర.

## PANDITĀRĀDHYACARITRA

Substance, palm-leaf. Size, 8½ × 1¾ inches. Pages, 28. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. పండితారాధ్యుల శివపూజాప్రశంస పట్టు మాత్రము గలదు. వ్రాఁత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1095. పండితారాధ్యచరిత్ర.

## PANDITĀRĀDHYACARITRA.

Substance, paper. Size, 12½ × 7½ inches. Pages, 49. Lines, 17 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Begins on fol. 1(*a*). The other works herein are Jaṅgamakālajñānamu 31*a*, Ēgaṇṭivārivacanamulu 56*a*, Bhallāṇacaritramu 76*a*, Śakuntalāpariṇayamu 121*b*, Śaśirēkhāpariṇayamu 134*a*, Madanamōhinīvilāsamu 146*a* and Cāṭuvisayamulu 160.

Contains only the Śivapūjāprakāra of Paṇḍitārādhya.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. పండితారాధ్యుల శివపూజాప్రకారవర్ణన మాత్రమే కలదు. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

ఇందు యితర గ్రంథము లున్నవి: 31-*a* జంగమకాలజ్ఞానము, 56,*a* ఏగంటివారి వచనములు, 76*a* భల్లాణ చరిత్రము, 121*b* శకుంతలాపరిణయము, 134 *a* శశిరేఖాపరిణయము, 146*a* మదనమోహినీ విలాసము, 160 చాటువిషయములు.

## No. 1096. పండితారాధ్యచరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, palm-leaf Size, 12⅝ × 1¼ inches. Pages, 25 Lines, 5 on page Character. Telugu Condition, much injured Appearance, very old. Mode of writing, bad and full of mistakes

Incomplete.

Same work as the above

Date of transcription—5th day of the dark fortnight of the lunar month Bhādrapada in the year Kālayukti.

(వి-వి.)—

అసమగ్రము. గణసహస్రనామస్తవము మాత్రము గలదు. వ్రాంత మంచిదే. తప్పు లెక్కువ. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమందీ వ్రాంత గలదు :—"కాళయుక్తినామ సంవత్సర భాద్రపద బహుళ పంచమిలవరకు, గణమాలిక శివపూజ మంత్రాలు జంప్పుని అంచెప్పు చన్నపట్నంలో వీరణ్ణాకు సంపూర్ణంగా వ్రాసి యిచ్చినాడు. సామత్తిన అచ్చయ్య అయ్యవాల్లనగారి పాదార్చనపరుడు."

---

## No. 1097. పండితారాధ్యచరిత్ర.

## PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, palm-leaf Size, 14¼ × 1⅝ inches. Pages, 18. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured Appearance, very old. Mode of writing, bad and full of mistakes

Begins on fol. 8-*a* The other work herein is Bhavānīmanōharavacanamulu 1*a*.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. గణసహస్రనామస్తవము మాత్రము గలదు. వ్రాంత మంచిదిగాదు. తప్పు లున్నవి శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

1-అ, భవానీమనోహరవచనములు గలవు.

## No. 1098. పండితారాధ్యచరిత్ర.
## PANDITĀRĀDHYACARITRA.

Substance, palm-leaf. Size, 16¼ × 1¼ inches. Pages, 12. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, not bad and not free from mistakes.

Begins on fol. 7*a*. The other work herein is Cannamallusīsamulu 1*a*.

Incomplete.

Same work as the above.

(ఐ-ఐ.) —

అసమగ్రము. గణసహస్రనామస్తవముమాత్ర మున్నది, వ్రాంత యొకమాదిరిగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

1*a* చెన్నమల్లుసీసములు గలవు.

---

## No. 1099. పండితారాధ్యచరిత్ర
## PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, palm-leaf. Size, 15⅞ × 1⅝ inches. Pages, 10. Lines, 7 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol 10 *a*. The other work herein is Sarvēśvaraśatakamu 1*a*.

Incomplete.

Same work as the above

Date of transcription—15th day of the dark fortnight of the lunar month Kārttika in the year Bahudhānya.

(ఐ-ఐ.)—

అసమగ్రము. ప్రమథగణసహస్రనామస్తవము మాత్రమే కలదు. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

1*a* సర్వేశ్వరశతకము గలదు.

గ్రంథాంతమున నిట్లు గలదు :

"బహుధాన్య సంవత్సర కార్తిక బ 30 నాటికి ప్రమథ గణ మాలిక సంపూర్ణము శ్రీరామ . . ."

No. **1100.** పండితారాధ్యచరిత్ర.

PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, palm leaf. Size, 15⅞ × 1¾ inches. Pages, 17. Lines, 6 on a page. Character, Telugu Condition, very much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. గణసహస్రనామావళి మాత్రము గలదు. వ్రాంత చెడ్డది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము హెచ్చుగాఁ గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

No. **1101.** పండితారాధ్యచరిత్రము.

PANDITĀRĀDHYACARITRAMU.

Substance, palm-leaf. Size, 15 × 1¼ inches. Pages, 406. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు.

పూర్వమువలె.

No. **1102.** పండితారాధ్య చరిత్ర.

PANDITĀRĀDHYACARITRA.

Substance, paper. Size, 11¾ × 7 inches. Pages, 147. Lines, 17 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ప్రథమ ప్రకరణ మేని కడదాఁక లేదు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గలదు, గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఇందీ యితరగ్రంథము లున్నవి:—1*a* సానందోపాఖ్యానము, 72*b* సురాభాండేశ్వరము (సటీకము), 180*b* చతుర్వేదసారము, 317 సనత్కుమారవాస్తుశాస్త్రమ్, 353*a* శివపురాణవిషయ సూచికా.

---

## No. 1103. పండితారాధ్యచరిత్ర.
## PAṆḌITĀRĀDHYACARITRA.

Substance, palm-leaf. Size, 15⅜ × 1¼ inches. Pages, 20. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. పంచమ ప్రకరణములోని కొంత పట్టు గలదు. వ్రాఁత మంచిదే. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

---

## No. 1104. పతివ్రతాచరిత్ర.
## PATIVRATĀCARITRA.

Substance, paper. Size, 12⅜ × 1⅜ inches. Pages, 959. Lines, 24 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Incomplete.

A collection of stories dealing with the chastity of Arundhatī, Sāvitrī, etc. These stories are said to have been related by Siva to Pārvatī. From the introductory portion of this work it is presumed that this work consists of seventy stories.

**Beginning:**

శ్రీమహితమహర్షిసేవ్యమై వెలయు
నైమిశారణ్యపుణ్యక్షేత్రమునను
శౌనకాదికమునీశ్వరు లొకనాఁడు
జ్ఞానియౌ రోమహర్షణుఁ జూచి యనిరి
మును శైలసుతకు శంభుఁడు పూర్వ కథలు
విలిపించె నని బుధుల్ వివరింప మేము
విని యుందు మాకథల్ వివరింపవలయు
ననిన సూతుం డా మహర్షుల కనియె

* * * *

ఆ కలధౌతహర్మ్యమున మాయమ్మ
కేకతంబున మీర లెఱిఁగించు కథలు
వినఁగోరి నేరాగ వెస నడ్డగించె
నను నందు రానీక నందికేశ్వరుఁడు
మంచిదే యనిపోక మాయావి నగుచు
వంచనఁ జొచ్చితి వాయురూపమున
నటు చొచ్చి సుమవితానాంతరస్ఫురిత
పటుమధువ్రతరీతి బ్రాపించియుండి
నానాటి కగజ కానతియిచ్చు కథలు
నే నాలకించి నా నెలతకు జయకు
దినమును చెప్పుదు దేవాధిదేవ
విని యది యంబకు వివరించె నేమొ

* * * *

శాపమోక్షంబు ప్రసాదింపు మనుచు
నాపుష్పదంతమహానందు లడలి
వేడినై కన్నీరు వెడలఁ గాఁసిలుచు
వేఁడిన శివుఁడు శాపవిముక్తి
వీరిపైఁ గృపయుంచి వివరింపుమనినఁ
గూరిమి పొడమి యక్కోమలి యనియెః
బుడమి రత్నావతీపురమున వైశ్య
కొడుకవై మతిరత్నగుప్తనామమున
జనియించి నీవు నిర్జనవనభూమి
దనుజుఁడౌ నీ పుష్పదంతుని చేత

గ్రహింపఁబడి వీఁడు గణియించు కథలు
రహి వినెదు నందున రాక్షసత్వంబు
విడిచి యెప్పటివలె వీఁడు మేమున్న
యెడకేఁగుదెంచు నయ్యేడులక్షలగు
కథలు లిఖించి లోకములఁ బ్రఖ్యాత
గతినించి శాపమోక్షముఁ జెంది నీవు
నరుదెంచె దిటకు మహానంద యనుచు
గిరిజ యానతి యియ్యఁ గేల్దోయి మొగిచి
వారియనుజ్ఞచే వసుధ జన్మించి
యారీతి వర్ధిల్లి రది యెట్లు లనిన

*　　*　　*　　*

ఇటు రత్నగుప్తుండు నెలమితో నాత్మ
కటకంబునకుఁ బోవఁ గణఁగి యాకథల

*　　*　　*　　*

దళములపొత్తర తలక్రింద నుంచి
నెలకొని శయనించి నిద్దురఁ జెంచె

*　　*　　*　　*

నెలలు కొన్ని క్రమింప నెటిదప్పి యతని
తలక్రిందనున్న పత్రములపొత్తరలు
వదలి నల్దిక్కుల వాయువశమునఁ
జెదరిన వేఁటవచ్చిన శకాధిపుఁడు
అయ్యాకు లొకకొన్ని యనుచరసమితి
నయ్యనఁ దెచ్చినఁ జదివి యాకథల
సారస్యమున నాత్మ సంతోష మంది
చేరువదవ్వులఁ జెదరినపర్ణ
చయములుగూర్చి లక్షకథ ల్సమగ్ర
మైన పల్లకిమీఁద నకట్టి యునిచి
తనపురంబునకేఁగి తత్కథలెల్ల
ననఘుఁడౌ క్షేమేంద్రుఁ డను మానిచెంత
నిలిపిన నాతఁ డన్నియుఁ జదివికొని
భళి మంచి కథలని పరితోష మంది
రతరాజు ప్రార్థింప నాలక్షకథలు
పదాపెక సంస్కృతమునఁ గావించె

నప్పురాణము భూమి నందందు వెలసె
నప్పుడు కొన్నాళ్ల కవ్వైశ్యసుతుని
తలక్రిందనున్న పత్రముల పాత్తరలు
కలుఁగడఁ జెదర గంధర్వులు గొన్ని
గరుడులుకొన్ని రాక్షసు లొకకొన్ని
యురగులుగొన్ని సాధ్యులు మఱికొన్ని
యమరులు గొన్ని విద్యాధరు ల్గొన్ని
క్రమమునఁగొనుట లోకము లెల్ల నిండె
నంతనిద్దురదేరి యవ్వైశ్యసుతుఁడు
చింతించి తలక్రిందఁ జేర్చిన కథల
పాత్తరల్ గానక పొగులుచునున్న
నత్తెఱం గెఱిఁగించె నాకాశవాణి

. . . . . . .

దీపించుఁ జంద్రావతీనామపురము
భూపాలకృతపుణ్యములకు దాపురము
ఆపురంబేలు న్యాయమునఁ జండప్ర
తాప భూపాలుండు . . .

. . . . . . . .

వారిలోన సుకీర్తి వరపుణ్యమూర్తి
యారాజమంత్రులం దగ్రేసరుండు
గదతునకతాకున గతప్రజ్ఞుఁడగుచు
మదమఱి నాలుగామడ పోయిపడియె

. . . . . . . .

అది దళాదమునీంద్రు నాశ్రమంబగుట
మదినెఱుఁగమి నయ్యమాత్యపుంగవుఁడు
ఆఁకటిపెల్లున నచటి కపిత్థ
మాకందకదళికామాతులుంగాది
ఫలములుగొని భుజింపఁగ నాకలవటుఁడు
దళభోజిశిష్యుఁ డుద్ధతి నందు వచ్చి

. . . . . . .

ఈపాపఫలమున నికఁ జిలకలతనము
ప్రాపించి తిరుగుము బహువత్సరములు
పారోరి యని కోపమున శాపమొసఁగ

నారాజమంత్రి భయభ్రాంతుఁ డగుచు

* * * *

అని వేఁడుకొన మంత్రి నతఁ డాదరించి
మనికితపడనేల మహానీయశీల

* * * *

నిన్ను నే నెఱుఁగుదు నేఁడాదిగాఁగ
నన్న యీరాజు హాయనములదాఁకఁ
చిలుకవై మెలఁగుము శ్రేయంబు మీఁదఁ
గలిగెడు నని భావికార్యము దెలిపి
శుకశాల్మలికిఁ బొమ్ము శుకరూప మూని
యిఁకఁ దామసం బేల యిచ్చోట ననిన

* * * *

నిన్నుఁ జంపెద నని నిర్బంధపఱుప
నన్నృపుఁ జూచి శుకాగ్రణి పలికె
ఓవెఱ్ఱి నను నొంప నాదవు నే మేలు
నీవేల బేలవై నేఁ డలిగెదవు

* * * *

అరుగు మింద్రావతి కమ్ము మచ్చోట
హారువొంద ధనదత్తుఁడను వైశ్యమణికి
నతఁడు నీకిచ్చు సహస్రనిష్కములు
మతినమ్ము మింక నామాట యటంచు
మదనసేనుం డొక మాపటిపూఁట
వదలని వేడ్కతో వాహ్యాళి వెడలి
ధనదత్తుకోడ లుత్తమవైశ్యకులజ
ధనదుఁబోలు కుబేరదత్తు నాలనుచు
విని రాజచంద్రుఁ డవ్విమలాంగియందు
మనసునాటఁగ నందు మసలక . .

* * * *

అనిన వైశ్యునిఁజూచి యచ్చిలుక పలికెఁ
గపటవర్తనుఁడు భూకాంతుఁడు నేఁడు
నెప మొకటి గణించి నిన్నుఁ బొమ్మనియెఁ
బొమ్మని దొరపలుకఁ బోకుండరాదు
కొమ్మను బాసి యేఁగుట తగదైన

నెన్నినాళ్లకు వత్తు విచటికిఁ దెల్పు
మన్న నెబ్బదినాళ్ల కరుదెంతు ననుచు
నతఁడు పలికిన మంచి దైన నేమాయె
నతివఁ గాపాడెద నందాఁక నేను
గడువు దప్పక రమ్ము గ్రక్కున ననుచు
నాడివిన వైశ్యుఁ డెంతో సంతసించి

* * * *

దైకొని మంచి లగ్నమ్మున వెడలి
యాకంథి తరియెక్కి యవ్వైశ్యుఁ డరిగె

* * * *

ఆ పుష్పమంజరి యనియె నో చిలుక
గూపురం బేలెడు నృపతి నన్నేమొ
చూచినాఁడఁట మొన్న చూచిన మొదలు
రా చిలుక మోహమ్మయి రౌతుచేఁ బడలి
నన్నుఁ బిల్చుక రమ్మనంగ వచ్చినది
యున్నాతి నీ వానతియ్య కేపనియు
నేము సేయముగదా యిఁక నాకు బుద్ధి
యేమి చెల్పు మటన్న నెల నవ్వునవ్వి
చిలుక యిట్లనియె రాజీవాక్షి నిజమె
పలికితి విది విన్నఁ బరితోషమయ్యె

* * * *

పతిఁ బాసి వేఱొకరి పతిఁ జేరుకెల్ల
సతుల కర్మమె యిది జాతిధర్మంబె
వనిత యెన్నఁడుఁ బతివ్రతల సత్కథలు
వినినదానవుగావు వినదు దూతికయు
నేనొక కథ మీకు నెఱిఁగింతు నిపుడు
వీనుల విందుగా విందురుగాక

**End :**

అని చిలుక చెప్పెనం చభవుండు దెలుప
వనజాక్షి గౌరి యవ్వలి కథయడిగె
నని శౌనకాదిమహామునీంద్రులకు
వినుపించె సూతుండు విపులవాక్ప్రౌఢి
సరస పతివ్రతా చరితంబునందు
వరుస ముప్పదిరెండవకథ చెన్నొందె.

(వి-వి.)—

అసమగ్రము. ముప్పది రెండు కథ లిందు గలవు. ఇంకెన్ని కథ లుండవలెనో. వ్రాంత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు. పెక్కుచోట్ల బ్రౌను దొర గారి యింగ్లీషు వివృతులున్నవి. విషయసూచిక గ్రంథారంభపత్రమునం గలదు.

శివుండు పార్వతికిం జెప్పినట్టుగా అరుంధతి, సావిత్రి, నాలాయని మొదలగు పతివ్రతల పాతివ్రత్య ప్రభావ ప్రఖ్యాపకములయిన పౌరాణిక కథ లిందు గలవు ఈ ప్రశస్త ద్విపద కృతికిం గర్త యెవ్వరో తెలియంగ రాదు. ఈ గ్రంథము డెబ్బదికథలు గలిగియుండునట్లు అవతారిక వలనం దెలియనగును.

---

## No. 1105. పతివ్రతా చరిత్ర.

## PATIVRATĀ CARITRA.

Substance, palm-leaf. Size, $14\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 525 Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత యొకమాదిరిగా నున్నది. తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె.

---

## No 1106. పరమయోగి విలాసము.

## PARAMAYŌGI VILĀSAMU.

Substance, paper. Size, $12\frac{5}{8} \times 8$ inches. Pages, 648. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Complete in eight Āśvāsas.

A poem in the Dvipada metre, giving a short account of the lives of the well-known Śri-Vaiṣṇava saints also known as Āḷvārs who are twelve in number. The author Tiruvēṅgalanātha of Tāllapāka composed also Uṣāparinaya, Astamahisikaḷyāṇa, etc , and dedicated this work to Alamēlmaṅgā and Vēṅkaṭēśa worshipped at Tirupati.

The following note by C. P. Brown is found at the beginning of the MS.—

"This book is intended to teach the principles of the Vishnu creed. It is the life and adventures of *Namm Alwar* who is also called *Shatha gopulu*. He appeared in an age preceding that of the celebrated Ramanujachari. The doctrine herein taught is not according to the creed of Sancar Achari. There is a manuscript of this in the Bodleian Library at Oxford.

Transcribed from a volume in the E. India House Library and sent to me by Professor Wilson. The various readings found in a MS procured at Madras are inserted."

**Beginning :**

ద్విపద. శ్రీయలమేల్మంగఁ జిరకృపాపాంగఁ
దోయజదళనేత్రి తోయధిపుత్రి
* * * *
శ్రీవేంకటాధీశుఁ జిరకృపావేశు
దేవాధిదేవు సందీప్తప్రభావుఁ
దలఁచి భూనీళలఁ దడవి యాచక్ర
జలజకౌమోదకీశార్ఙ్గఖడ్గములఁ
దిరమొందు భక్తి నుతించి యనంత
గరుడవిష్వక్సేన కరుణ నూఁ బడసి
శ్రీకరవైష్ణవసిద్ధాంతవిభవ
పాకశాసనుఁ దాళ్లపాకశాసనుని
నాచారవిజితామరాచార్యుఁ దిరుమ
లాచార్యు ఘను మదీయాచార్యుఁ దలఁచి
పరమార్యు వాధూలపతి నప్పగారి
గురుతరులగు మహాగురువరేణ్యులను
రామాంఘ్రికమలాభిరామ తాత్పర్యు
రామానుజాకారు రామానుజార్యు
నమలునిఁ బరమదయాకరమూర్తి
నమితవిద్యాపూర్ణుఁ డగు మహాపూర్ణు
మందారహారణనిర్మలపాదపద్మ
వందారు మా యాళవందారుఁ బొగడి
యామోదభరకీర్తితాబ్జనేత్రాభి
రామమిశ్రాఖ్యుని రామమిశ్రాఖ్యు
మండితనిజచిత్తమందిరనిహిత

పుండరీకాక్షునిఁ బుండరీకాక్షు
నమలుని మునినాథు నానాథమౌనిఁ
గుమతభంజననిరంకుశుఁ బరాంకుశుని
త్ర్యానుతద్రావిడాగమసార్వభౌము
లైన మావారల నాళువారులను
నిఖిలముక్తౌఘంబు నిత్యవర్గంబు
నఖిలభాగవతుల నాత్మలోఁదలఁచి
హారితాతయగు వేంకటాచలపూర్ణు
హరిపూజనాడంబియగు గుర్వనంబి
నిరవొంద శ్రీవేంకటేశ్వరుచేతఁ
గరమొప్ప శంఖచక్రము లందినట్టి
చిరకీర్తివైష్ణవసేవానువర్తి
స్థిరమూర్తి నల తొండమాన్ చక్రవర్తి
సతతవేదామృతశరధిదాశరథి
నతికృపావరు భట్టరాచార్యవర్యు
సిరివరునిజశిష్యుఁ జేసికొన్నట్టి
హరిభక్తిపరు ననంతాళువారులను
శఠమతరాద్ధాంతసంహారియైన
శఠగోపమునిఁబోలు శఠగోపమౌని
వేదంబు తెనుఁగుగావించి సంసార
ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు
ఘనతరపంచమాగమ సార్వభౌము
నఘు శ్రీతాళ్లపాకాన్నమాచార్యుఁ
దలఁచి యంజలిచేసి తత్ప్రసాదంబు
కలిమిని బంచమాగమసార్వభౌమ
హరిసేవకాశ్వలాయనసూత్ర నంద
వరవంశభవ భరద్వాజసగోత్ర
పావన శ్రీతాళ్లపాకాన్నయార్య
ధీవిశారదసూను తిరుమలాచార్య
వినుతనందన తిరువెంగళనాథుఁ
డను పేరియేను గావ్యం బొందు సేయఁ

దలపోయుచున్న యత్తఱిఁ గరుణించి
కలలోన వైష్ణవాకారంబు దాల్చి
యేతెంచి శ్రీవేంకటేశుండు తనదు
చేతఁ దా నారగించిన ప్రసాదంబు
కృపసేసి పరమయోగివిలాస మనఁగ
నిపుడు కాసారయోగీంద్రాది కథలు
జానుగా సిరికిని సపరివారుండ
నైనట్టి తనకు నీ వంకితంబుగను
బనుపడ ద్రవిడ ప్రబంధంబు చూచి
తెనుఁగున గవియింపు ద్విపదరూపమున
నన విని మేల్కాంచి యలమేలుమంగ
ననుపమ శ్రీవేంకటాధీశుఁ దలఁచి

* * * *

వేదాంతవిదులు కోవిదులునైనట్టి
గురుతరులగు పరాంకుశ ముఖ్యయోగి
వరుల వైభవము కావ్యము చేసినట్టి
యలఘుపూర్వాచార్యులగు వారియెదు-
నిల నితరుఁడు కావ్య మెట్లు చెప్పెడిని
గావునఁ దత్పాదకమలసేవకుఁడఁ
గావున వారి మార్గంబున నేను
జలజాతవాసిని చనుఁబాలపుష్టిఁ
బలికెద నానేర్పు పరిపాటి నిపుడు
అలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్య భక్తసంతతికిఁ
గనకచేలునకు శృంగారలోలునకు
వినమితేశునకు శ్రీ వేంకటేశునకు
నంకితంబుగను గావ్యంబు గావింతు
నింకఁ దత్ప్రారంభ మెట్టిదియనిన.

**End :**

ఉరుభక్తితోడ నయ్యోగీంద్రవరుల
చరిత మొక్కొకమారు జను లెవ్వరేని

వినిన వ్రాసినఁ జదివినఁ బేరుకొనిన
నెనలేనియిష్టంబు లొసఁగించుననుచు

**Colophon:**

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
నతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్య భక్తసంతతికి
నంకితంబుగను శ్రీ హరిభక్తనికర
పంకజార్యముతాళ్లపాకాన్నయార్య
తనయ తిమ్మార్యనందనరత్నశుంభ
దనుపమశ్రీవేంకటాధీశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువెంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితంబుగ నష్టమాశ్వాస మయ్యె.

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పన్నిద్దరాళ్వార్లనఁబడు విష్ణుభక్తవరేణ్యుల చరిత్రము లీప్రబంధమున వర్ణితము లయినవి. తాళ్లపాక తిరువేంగళనాథుఁ డీకృతికిఁ గర్త. ఈతఁడు, ఉషాపరిణయము, అష్టమహిషీకల్యాణము, మొదలగు కృతుల రచియించినాఁడు. వీరి వంశవృత్తాంతమునుగూర్చి ఆర్. నె 595 రు చూచునది. ఇందు వేదమును దెలిగించిన కవియని కృష్ణమాచార్యుఁడు స్తుతింపఁబడెను. నాలాయిర మను ద్రావిడవేద ప్రబంధము నాతఁడు తెలుఁగునఁ బరివర్తించియుండును. "కృష్ణమాచార్య సంకీర్తనములు" అని తెలుఁగునఁగల స్తుతిగ్రంథమునకుఁ గర్తయగు కృష్ణమాచార్యుఁడే యేమో యిందుఁ బ్రస్తుతుఁడగు కృష్ణమాచార్యుఁడు. ద్రావిడ గ్రంథము ననుసరించి యీ తెలుఁగుకృతి రచితమయ్యెనట! తిరుపతి యలమేలుమంగా వేంకటేశ్వరస్వాము లేతత్కృతిపతులు.

## No. 1107 పరమయోగి విలాసము.

## PARAMAYŌGI VILĀSAMU.

Substance, palm-leaf. Size, 14½ × 1⅜ inches. Pages, 399. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes. Breaks off in many places.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లంతగాలేవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు.

పూర్వమువలె.

## No 1108. పరమయోగి విలాసము.

## PARAMAYŌGI VILĀSAMU.

Substance, palm-leaf. Size, 10 × 1¼ inches. Pages, 120. Lines, 5 on a page Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair and free from mistakes. Breaks off in many places.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. తొండరడిప్పొడియాళ్వార్ల చరిత్రముగల నాల్గవ యాశ్వాసము మాత్రము అసమగ్రముగాఁగలదు. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము మిక్కిలి హెచ్చు. గ్రంథపాతములు పెక్కులు.

పూర్వమువలె.

గ్రంథాంతమున సగము విఱిగిపోయినయాకులు గొన్నింట కుశలవోపాఖ్యాన ద్విపదభాగములు గలవు.

## No. 1109. పరమయోగి విలాసము.

## PARAMAYŌGI VILĀSAMU

Substance, palm-leaf. Size, 17⅛ × 1¼ inches Pages, 307. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair and free from mistakes. Breaks off n many places.

Wants the end of the eighth Āśvāsa ; otherwise complete
Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. అష్టమాశ్వాసము (తుదిది) మాత్రమే లేదు. వ్రాంత తిన్ననిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము మిక్కిలి కలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

## No. 1110. పరశురామాయణము.
## PARAŚURĀMĀYAṆAMU.

**Substance, palm-leaf. Size, 17¾ × 1⅝ inches. Pages, 288. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance very old. Mode of writing, fair but full of mistakes.**

Contains the first part only.

A Prabandha in the Mañjari metre describing the story of the defeat of Kārtavīryārjuna by Paraśurāma. The author Ulici Bhāvajña has dedicated this work to Kanakādri.

**Beginning:**

మం. శ్రీకరంబైనట్టి చెల్వంబుగాను
ప్రాకటంబుగ భువిని ప్రస్తుతించంగ
శ్రీరంగనాయకుల చెల్వంబుగాను
ఆకారదాంబకు నర్థితో మ్రొక్కి
గురుమంత్ర దేవతను కోరి ప్రార్థించి
కాళికాదేవికి కరములు మొగిచి
పంచకన్యల యిపుడు ప్రస్తుతి జేసి
పులచి భావజ్ఞుండు పున్నతంబరయ
గణుతించదలచియు గణికులలోను
పూర్వవృత్తాంతము పొలుపొందగాను
త్రేతాయుగంబున తెరగొప్పగాను
యిమ్మహిరేరెటి యినకులాధిపుల
వ్యాసవాల్మీకులు వసగంగ జెప్ప
దేవేంద్రుసభయెల్ల తెల్లమిగాను
వినుపింపదోణగిరి వుచితంబుగాను.

* * * *

అఖిలశాస్త్రములలో సంగ్రహకావ్యముగ
పరశురామాయణ పారంబుదెలియ
వులచి భావజ్ఞులు వున్నతంబుగాను
నిర్మించిచెప్పిన నిఖిలశాస్త్రమును
కమనీయగుణశాలి కనకాద్రిపేర
ఆచంద్రతారార్కమై యొప్పగాను
చేకొం చెప్పెను చరితంబుగాను

* * * *

**End:**

చిరినవ్వునవ్వియు శీతరామాడు
తండ్రిదశరథుకును తగ్రమొక్కి నిలచి
విల్లందివేగాన విల్లెక్కు బెట్టి
నడిమికితునియల్లై నదిపడ్డభువిని
పరశురాముఁడుదాను ప్రస్తుతిజేశి

* * * *

వాసంబుచేసుక వనరంగయుచటు
ఋషులతోగూడుక రూఢిగారాము.

**Colophon:**

వులిచి భావజ్ఞులు వుచితంబుగాను
పరశురామాయణ పారంబుగాను
యిహాజ . . లోపల యింపారగాను
పూర్వార్ధమంతయు పోడిమిగాను
యెల్లలోకంబుల యెనశినకవులు
మెచ్చంగజెప్పియు మేదినిలోను
విన్నవారికినెల్ల ఖహితంబుగాను
పాపదోషంబులు పాలుగాకుండ
యీపుణ్యచరితఁబు కెమెన్నికగాను
వ్రాశిన చదివిన విన్నవారికిని
సకలభాగ్యంబులు చాలగాగలిగి
యింపారుచుందురు యిహాములోపలను
పాడియు పంటయు ప్రజలకునెల్ల
యెల్లకాలంబును యెలమితోఁగలిగి
చెలరేగివుందురు చెన్నుమీరఁగను.

(వి-వి)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. శైథిల్య గ్రంథపాతములు గలవు. తప్పు లున్నవి. 23 మొదలు 66 వఱకు నుండవలసిన యాకులసలే కనుపించుటలేదు. కొన్ని యాకులు పుటసంఖ్యలు లేక యున్నవి.

ఈగ్రంథము రెండు భాగములుగా విభజింపఁబడినట్లు తోఁచుచున్నది. ఇందుఁ బూర్వార్ధము మాత్రము కలదు. కార్తవీర్యార్జున చరిత్రయుఁ బరశురాముని చరిత్రయు నిందు వర్ణితములు. గ్రంథకర్త ఉలిచి భావజ్ఞుఁడట! కనకాద్రి కంకితము చేయఁబడిన ట్లొకచోట తెల్పఁబడియున్నది.

---

## No 1111. పరశురామాయణము.

## PARAŚURĀMĀYAṆAMU.

Substance, paper. Size, $12\frac{3}{8} \times 8$ inches. Pages, 82. Lines, 25 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 149-*a*. The other works herein are Palnāṭivīracaritra, 1*a* Bālavikramārkunikatha, 91*a* Introduction to Palnāṭivīracaritra (English), 99*a* Cennamallusīsālu, 103*a* Vēmanapadyamulu, 115*a* Nṛsiṁhaśatakamu, 130*a* Vaijayantīvilāsamu (Saṭīkamu), 185*a* Vijayavilāsamu (saṭīkamu), 202*a* Nṛsiṁhaśatakamu, 217*a* Manuvaṁśapurāṇamu, 226*a* Palnāṭivīracaritra 267*a*.

Incomplete.

Same work as the above.

The following note by C. P. Brown is found in the beginning of the MS :—

" An abstract of this work, by Mr. Taylor is in the Madras Journal No. 19 (April 1838), p 353

This poem is mere rubbish and on perusing the beginning I desired the transcriber to desist. The illiterate comparer did not even know the laws of rhyme."

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఇది నె 1110 రున వర్ణితమైనదే. దానికిది పుత్రిక. ఈ గ్రంథమునుగూర్చి బ్రౌను దొరగారిట్లు వ్రాసియున్నారు :—

"దీనియొక్క మాతృక కుంపిణీవారు పెట్టుకొన్న చెన్నపట్ణం కాలీజులో మెకంజీ పొస్తుకాలలో వున్నది"

ఇందీ యితర గ్రంథములు గలవు. 1-*a* పల్నాటివీర చరిత్ర, 91-*a* బాలవిక్రమారుక్కనికథ, 99*a* Introduction to Palnāti Chronicle (English), 103*a* చెన్నమల్లుసీసాలు, 115*a* వేమనపద్యములు, 130-*a* and 217*a* నృసింహశతకము, 185*a* వైజయంతీవిలాసము (సటీకము), 202*a* విజయ విలాసము (సటీకము), 226*a* మనువంశపురాణము, 267*a* పల్నాటి వీరచరిత్రము (బాలునికథ).

---

## No. 1112. పల్నాటివీర చరిత్ర (కోళ్లపోట్లాట).
## PALNĀṬIVĪRA CARITRA (KŌḶḶA PŌṬLĀṬA).

Substance, paper. Size, 12½ × 7¾ inches. Pages, 128. Lines, 25 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, fair but full of mistakes. The variations in reading are noted throughout the MS.

Incomplete.

A treatise in the Mañjari metre describing the story of the heroes of the Palnādu. The story herein runs thus :—Kāmarāju, chieftain of Gurajāla and eldest son of Mailamma, first wife of Anugurāju, and Mallidēvarāju, chieftain of Mācerla and eldest son of Vijjaladēvi, third wife of Anugurāju were engaged in the cock fight at the instigation of Nāgama, minister of Kāmarāju. Brahmi Nāyuḍu, minister of Mallidēvarāju, represented the latter at the time of fighting. The cock of Brahmi Nāyuḍu was killed by black magic. According to the bet Mallidēvarāju had to vacate his capital for seven years and go away immediately, and he was ready to do so. In the meanwhile, his servant Gōpu began to censure Nāgama and Kāmarāju and killed many of their servants. At last Gōpu was killed by Āremu Jōganna.

The author was Mallaya, son of Amalāmbā and Rāmana Mantri of Kauṇḍinyagōtra. It is stated that Gauraya, grandfather of Mallaya wrote a work called Tattvasāramu in the Mañjari metre.

Date of transcription—19th December 1842.

**Beginning :**

అను ౧౦౧౪ సంవత్సరం శాలివాహన శకాబ్దః ౮౩ వ రక్తాక్షి నామ సంవత్సర శ్రావణ శు ౨ సోమవారం ఆరంభం ౹౹ లడాయి ఆకరు యేడు సంవత్సరములు.

శ్రీరఘునాయకు శ్రీమహాదేవు
దేవాసురార్చితు దివ్యప్రభావు

* * * *

మహిమీఁదఁ జెన్నారు మహాదేవిచర్ల
చెన్నని మదిలోనఁ జింతనచేసి

* * * *

పరమేష్ఠి సంతతిఁ బరగెడువాఁడ
వంశపారంపరి వర్ణింతుఁగోరి
తత్వసారంబెల్లఁ దలపోసికూర్చి
తేటతెల్లముగాను దెలుఁగువారలకు
స్వాగమంజరియనంగ జగములో వెలయఁ
జేసిన పుణ్యుఁడు శివపదార్చకుఁడు
కౌండిన్యగోత్రుఁడా గౌరయామాత్యుఁ
డభిమాని యతనికి నసుఁగు నందనుఁడు
రాజశేఖరపదరాజీవలోల
మధుకరుండైన రామనమంత్రిమణికి
కమలాంబికకును బరమానందసుతుఁడ
మల్లికార్జునదేవు మన్ననవాఁడ
మల్లయ యనుపేర మహిఁబరగువాఁడ

* * * *

నగరిలోనికి బ్రహ్మనాయఁడు పోయి
ఐజ్జలదేవికి వినయంబుతోడ
దండంబుపెట్టినఁ దత్పుత్రు కామ (మల్లి)
రాజులు మలిదేవ(నలగామ) రాజులు(ను) నీకు
వీరును వారును వినుమొక్కరూప
యని బుద్ధిగాఁజెప్పి యనుప నాయకుఁడు

**End :**

గోవుఁ జంపితి మంచు గుఱ్ఱంబుదళము
లార్చుచు బ్రహ్మపై నరుగుదేరంగ

నారవం బాలించి యాబ్రహ్మ నేఁడు
వెనుక నాఱ్ఱులుపుట్టె వెగ్గలం బగుచు
నని తలపోయుచు నంతటనుండి

(వి-వి.)—

అసమగ్రము. కోడిపోరు తర్వాతి పట్టుననుండి గోపు మృతిపట్టు దాఁకఁ గలదు. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు. మొదటినుండి తుదదాఁక పెక్కులు పాఠసంస్కారములు చేర్పఁబడినవి. పల్నాటనుండి పంపఁబడిన ప్రతిభేదపు పాఠభేదము లింకను 253 మొదలు 294 పుటలదాఁకఁ జేర్పఁబడినవి. సంపూర్ణముగా భేదించిన గ్రంథభాగము వేఱు ప్రతిలో వ్రాయింపఁబడినదట!

గురిజాల ప్రభువును, అనుగురాజు జ్యేష్ఠభార్యయగు మైలమ్మ పెద్ద కొడుకును, అయిన కామరాజునకును, మాచెర్ల ప్రభువును, అనుగురాజు తృతీయ భార్యయగు విజ్జలదేవి పెద్ద కొడుకును, అయిన మల్లిదేవరాజునకును, కామరాజు మంత్రియైన నాగమ దుర్బోధమువలన గురిజాలలో కోడిపోరు జరిగినప్పుడు మల్లిదేవరాజు పక్షమున నతని మంత్రియగు బ్రహ్మనాయఁడు వచ్చియుండెను. బ్రహ్మనాయని కోడి మంత్రతంత్రములచేఁ జంపఁబడెను. నిర్ణయముచొప్పున మల్లిదేవరాజు తన రాజ్యమును గామరాజునకు వదలిపెట్టి యేడేండ్లు పరదేశగతుఁడు గావలసెను. దర్మశీలుఁడగు బ్రహ్మనాయఁడాచొప్పున నడచుకొనుటకు వెడలుచుండగా నతని భృత్యుఁడగు గోపు, నాగమను గామరాజును నిందించుచు వారి నౌకరుల ననేకులఁజంపి తానును ఆరెము జోగన్నచే హతుఁడయ్యెను. ఇందున్న కథా భాగమిదియే.

కౌండిన్య గోత్రుఁడును, అమలాంబా రామన మంత్రుల కుమారుఁడును, అగు మల్లయ దీనిని మంజరిలో రచియించెను. మల్లయ పితామహుఁడగు కొరయ తత్త్వసారమని యొక గ్రంథమును మంజరిలోనే రచించెనట!

---

No. **1113**. పల్నాటివీర చరిత్ర (రాచమల్లురాయబారము).

PALNĀṬIVĪRA CARITRA (RĀCAMALLURĀYABĀRAMU).

Substance, paper. Size, $12\frac{1}{2} \times 7\frac{3}{4}$ inches. Pages, 42 Lines, 25 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes. The variations in reading are noted here and there.

Incomplete.

A treatise in the Mañjari metre describing the story of the heroes of Palnāḍu. The story runs thus :—Malidēvarāju with his subjects entered Mēḍapi and sent Rācamallu, son of Kommarāju, to **Kāmarāju** as an ambassador Rācamallu, while returning back, was killed by **means** of poison. Pēramma, wife of Rācamallu and daughter of Kāmarāju, committed *sati* at Mēḍapi. Afterwards Malidēvarāju and others declared war against Kāmarāju.

Date of transcription—24th December 1842.

**Beginning:**

మంజరి. సరగున గురజాల సాధింపఁగోరి
పంతమున వెంకన పగవచ్చెననుచు
బింత వేడుకతోడ వీరనందనుఁడు
మర్నాటి కొలువున మలిదేవరాజు
వంకిదేవరాజులు వాలునాయకులు
పీనులు నాయకు ల్వీరదళమెల్లఁ
గొలు వుండి రావేళఁ గొలువు దీపింప.

**End:**

చెలువుఁడు యాచౌలజెట్టన్న మెఱసి
సెలగోలగొల్లైన చెలఁగి యెత్తించెఁ
గొండబిండులవారు కొమరొప్ప నంతఁ
బారుటాకుగుడారు పరగ నెత్తించెఁ
బరువడిఁజే(శీ)లమ్మ బ్రహ్మనాయకుఁడు
సొంకుచక్రాల గొల్లైన చెలఁగియెత్తించెఁ
గణఁకతో గోసంగి కన్నమనేఁడు
పసుఁగు మొరగొల్లైన యొసఁగ నెత్తించె
నంతట బాలుఁడు అతిసంతసమున.

(బి-బి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లెక్కువ. పాఠ సంస్కారములు పెక్కుచోట్లఁ జేయఁబడినవి.

మలిదేవరాజు తన ప్రజలను దీసికొని మండాది వెడలి మేడపి ప్రవేశించుటయు, కొమ్మరాజు కుమారుఁడగు రాచమల్లును కామరాజు నొద్దికి రాయబారమంపుటయు రాచమల్లు తనపని తీర్చుకొని తిరిగి వచ్చునప్పుడు **వారిలో విషప్రయోగముచే నితఁడు చంపఁబడుటయు, కామరాజు కూ**

తురుసు, రాచమల్లు భార్యయునగు పేరమ్మ తన పెనిమిటితో మేడపికి వచ్చి సహగమనము సేయుటయు మలిదేవరాజాదులు యుద్ధ సన్నద్ధులగుటయు నీ గ్రంథ భాగమునఁగల కథ పట్టు. దీనికర్త పేరిందు లేదు. మంజరీరచనము.

---

## No. 1114. పల్నాటి వీరచరిత్ర (గురజాల యుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (GURAJĀLAYUDDHAMU).

Substance, paper. Size, 12½ × 7¾ inches. Pages, 92. Lines, 24 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes. The variations in reading are interlined.

Incomplete and imperfect.

A treatise in the Mañjari metre describing the story of the heroes of Palnāḍu. The story runs thus:—

Kāmarāju at the instigation of his minister Nāgama plundered the cattle of Malidēvarāja while the latter was engaged in the cock-fight. After hearing this, Brahmināyaḍu minister of Malidēvarāja became angry and sieged Gurajāla. At the request of the wives of Kāmarāju and others, he withdrew but on his way to his capital he killed a number of heroes and warriors, of the rival camp.

Date of transcription:—30th December 1842.

**Beginning:**

మంజరి. కాముని కిల నోడి కలహంబుమించి
రాముచంద్రునిగతి రాజులుఁ దాను
నుందాది సుండంగ మందఁ బోడిచినను
నిండినకోపమున నీలవర్ణుండు
శోధించి గురజాల చొచ్చి పొడిచెదను
అద్యముగా నేను అన్వయించెదను
తనమందపొడిచిన తలవంపులాయె
ననిబ్రహ్మినాయుండు నాత్మలోగుంది
తల్లికిమ్రొక్కఁడు తనమదిలోన
తలచఁడు చెన్నుని దనరాజుఁగొనఁడు
నడువఁడు శిలము నల్లనియన్న

కొడుకుబాలునిమీద గృపయింత లేదు
పల్లాన గుడువఁడు పగలును రేయి
పలుమారు వెంకను బలువరింపుచును
తనవెంక జచ్చెనని తగకోపమంది
గురుజాల బొడుతునని క్రోధంబుతోను
పట్టైనాయుం డెంత భారవ్రతంబు.

**End:**

పంతాలపలినేని పదిలముగ ద్రొక్కి
నరములతో శిరము నాయెడ బెరికి
యీవు కోరినకోర్కి యీడేరె ననుచు
నాగంగకడ కొచ్చి యర్పితంబయ్యె
ననుచు నాగంగను నతివేగదాటి
నిడుగంటిగంగకు నీమమున నివ్వ
నొకమున్కి కడమయ్యెనో బ్రహ్మయనిన
కలుపించి నాయుఁడు కల్లొత్తిజేసి
నీమున్కి గూడుకో నిడుగంటిగంగ
కరవాలు యెత్తిన గజగజ వణికి
పాదాలు పట్టుక పలెక్కి నొకమాట
భావజాకారుఁడ పాటించివినుము
బొంకితి నేనయ్య బొంకవు నీవు
ఆడి దప్పనియట్టి యాచారపరుఁడ
బొంకు లెన్నడు లేని పురుషరత్నమవు
నాకు భక్తిని బెట్టు నరలోకమందు
నన నవ్వి నాయుఁడు యాగంగ కనియె
కామరూపిణి నీవు కాదనరాదు
సహస్రరూపుల జనలోకమాత

* * * *

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. మొదటినుండి తుదిదాఁక పాఠసంస్కారము లనేకములు జరపఁబడియున్నవి.

కోడిపందెపు నిర్ణయము చొప్పున మలిదేవరాజాదులు మాచెర్ల పిడి మండాదిలోనుండఁగాఁ గామరాజు తన మంత్రియగు నాగమ ప్రోత్సాహముచే మలిదేవరాజు గోగణమును బందెఁబెట్టించెను. అది విని మహోగ్రుఁడై బ్రహ్మనాయుఁడు గుఱ్ఱాల నొంటరిగా ముట్టడించి యనేకుల దొరించెనుగాని కామరాజాదులను వారివారి భార్యలు ప్రార్థింపగాఁగరుణించి చంపకుండ విడిచెను. తాను మరలి మండాదికి వచ్చినపుడు పంతాలపలినేఁడు మొదలగువారి ననేకులఁ జంపెను. ఇకఁబూడగల గ్రంథభాగమున నీ కథపట్టు గలదు. నడుమ నింకఁ బెక్కు గాథలు గలవు. ఈ యున్నపట్టు యుద్ధ సన్నాహమని, యుద్ధమని రెండు విభాగములతో నున్నది. ఇందలిరచనము మంజరి. కర్త పేరిందుగాన రాదు.

---

## No. 1115. పల్నాటి వీరచరిత్ర (కల్లుప్రతిష్ఠ).

## PALNĀṬIVĪRACARITRA (KALLUPRATIṢṬHA).

Substance, paper. Size, 12⅛ × 7⅝ inches. Pages, 58. Lines, 22 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes. The variations in reading are noted throughout the MS.

Complete

A treatise in the Mañjari metre describing the story of the heroes of Palnāḍu. The story herein deals with the starting of Bāluḍu to the battlefield, while Nalagāmarāju accompanied by other kings declared war against Brahmināyadu who sent Bhaṭṭu as an ambassador to Nalagāmarāju to attend the ceremony of installing a stone pillar near Gangādhāramaḍugu.

**Beginning :**

శ్రీరఘునాయకుఁ జిత్తమం దుంచి
శ్రీకంఠుఁ బరమేశు శివు నాత్మఁ దలఁచి
పార్వతీదేవిని భావించి మ్రొక్కి
శివగణంబులనెల్లఁ జింతించి పొగడి
ప్రాకటంబుగ విష్ణుఁ బ్రార్థనచేసి
యిందిరాదేవిని యిచ్చలో నిలిపి

విష్ణుభక్తుల నెల్ల వినుతులు చేసి
జలజజుఁ గొనియాడి శారద నెంచి
నఖిలవిద్యల కెల్ల నాధ్యులై నట్టి
గజముఖు విఘ్నేశు ఘనతఁ గీర్తించి

* * * *

శ్రీగిరిలింగఁబు చెలఁగి సేవిఁచి
మాచర్ల చెన్నుని మదిలోన నుంచి
కవిసార్వభౌముఁడ ఘనతఁ గన్నట్టి
శ్రీనాథుఁ డనువాఁడ శివభక్తిరతుఁడ
వెలసిల్లుపల్నాటి వీరులచరిత
జనులెల్ల భక్తిచేఁ జదువుటకొఱకు
మంజరిద్విపదగా మహినొప్పఁ జేసె
శ్రీకరంబైనట్టి శ్రీవీరచరిత
ప్రకటితంబైనట్టి పలినాటిలోన
భావింపఁగా విష్ణుభక్తులు మెఱయ
నరనాథసింహాఁబు నలగామరాజు
మహితచారిత్రుఁడౌ మలిదేవరాజు
కారెమపూఁడి శ్రీకలనిమధ్యమున

**End :**

అంతటవీరులు ఆలంబులోన
ఆనందమునఁబొంది యట్లుండి రంత
భూసురుల రప్పించి భూమీశ్వరుండు
చెలఁగి యుద్ధమునకుఁ జెప్పుడా యనిన
వారియును బ్రహ్మయు సభవుఁడైనట్టి
క్షీరాబ్ధిశయనుండు శ్రీలక్ష్మీవరుఁడు
వారించి నీదయ వచ్చుచున్నాఁడు
మాసద్వయమునకు మనలఁ జేకెడిని.

**(వి-వి.)**—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యః గ్రంథపాతములు లేవు. పెకుఁచోట్ల పెన్సిలుతో సంస్కారము జరపఁబడినవి.

గ్రంథాంతమందు కథాసార మిట్లు వ్రాయఁబడియున్నది.

" కార్యమపూడి తాలూకే పలినాటిలో సీలం బ్రహ్మినాయడు గారు యుద్ధం చేయగలందుఃకు ఆకాశగంగను ప్రార్థనచేసి పూర్వమందు ఆ ప్రదేశమందున అనేకముగా రాజులు యుద్ధసన్నద్ధులై హాతము కాబడి నారు గనుక స్థలం పవిత్రతచేసి ఆ సామీప్యమందున గంగధారమడుగు వుద్ధారణచేసి స్తంభం ప్రతిష్ఠచేయించి కల్లుపాటుకు స్థలం నిరూపణచేసి తదనంతరమందు నలగామరాజు వద్దికి భట్టును రాయబారంపంచినంతలో ఆరువెల్లి నాగమ అనే ప్రధాని సలహాకారు గానివ్వక భట్టుమీద కోపం చేసి సమస్తదేశాధిపతులైన రాజులను రప్పించి యుద్ధానకు ఉద్యుక్తులై చింతపల్లి ప్రవేశంఅయినారు గనుక వీరిని హాతంశాయగలందులకు బాలుడు రెండు నెలలకు వస్తున్నాడు. "

దీని రచయిత పేరెఱుఁగరాదు.

---

## No. 1116. పల్నాటివీరచరిత్ర (బాలునికథ).

## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

Substance, paper. Size, 12¼ × 7¾ inches. Pages, 48. Lines, 22 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, good Contains mistakes The variations in reading are noted throughout the MS

Incomplete.

A historical treatise in a metre called Mañjari, relating to the heroes of Palnāḍu. The story contained herein deals with the starting of Bāluḍu to the battle field after Malidēvarāju and others were killed in the way by the enemies.

**Beginning:**

అంతట మేడపి నైన వార్తలను
సంతోషమున బాలచంద్రుఁ డావేళ
ప్రాణసంగడమైన బాలులు గొలువ
రాణించుచున్నట్టి రాచిలుక చదువు
వినుచు వేడుకపుట్టి విష్ణుని సుతుఁడు
సంగడీలును దాను సరసవైఖరుల
కోరి గుమ్మడికాయ కొంతసేపాడి
పరగఁ జెఱకుఁగోల పందెంబు నఱికి

బ్రహ్మన్న తనయుఁడు బాలుల కిచ్చి
తననగరికే తెఁచి తమ్ములుఁ దాను
తల్లికి మ్రొక్కిరి తనయు లెనమండ్రు

**End:**

అట్టహాసముఁ జేసి యనుజులమీఁద
తడయక బాలుఁడు తమ్ములఁ జూచి
చిటచిట మంటలు చెదరంగఁ బలికె
నిక్క యనుజులమీఁద నీలావుజూఁప
తుక్కువట్టినయలుగు పుయ్యాటగలదె.

"ఇక్కడ పడిపోయిన గ్రంథం కడప గ్రంథములో 242 సైడులో ఉన్నది." "పై గ్రంథంబు నె 285 రు సైడు 102 చూడు."

(వి-వి.)—

అసమగ్రము వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. పెన్సిలుతో పెక్కు సంస్కారములు జరపఁబడినవి.

బాలుఁడు సహోదర సహితుఁడై కారెమపూఁడి కలనికి భార్యయగు మంచాల యిలుపిడి వెడలు కథాభాగమువఱకు నిందుఁగలదు.

---

No. **1117.** పల్నాటివీరచరిత్ర (బాలునియుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (BĀLUNIYUDDHAMU).

Substance, paper. Size, 12½ × 7¾ inches. Pages, 98 Lines, 24 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Wants the introductory portion, otherwise complete.

A treatise in the Mañjari metre describing the story of the heroes of Palnāḍu.

Similar to the work described under No. 1139.

**Beginning:**

మంజరి. శ్రీవీరప్రముఖులు శ్రీకలనిలోన
వీరపురుషుల మహిమ విన్నవించెదను

మెరయించి లోకములు మేలుమేలనుచు
నాలుగు యుగములు నాల్గునామముల
చేసిన యుద్ధంబు చెప్పగోచరము
చెప్పెద వీరులు చేకొనివినుఁడు
ఖండించి మదిలోన కయ్యంబుగోరి
పాలనైకె తొల్లి రేపల్లెలో దిరుగు
బాలునిబోలిన బాలయ్య ఘనుఁడు
ఘనమైన పతిభక్తి కలిమి నీక్షించి
ననుసాయకంబోలు నెలమినాయకుఁడు
ఉవధారుజనవేల అవనీశ నాకు
చెలువుగా వాల్మీక సంయమి బలుక
ప్రాకటంబైనట్టి పలనాటి వీర్ల
యాకథ వృత్తాంత మిదియెట్టిదనిన
బ్రహ్మపుత్రుండైన బాలయ్య ప్రెుకిర
బ్రహ్మనాయునితోడ బలికె నిట్లనుచు
వైరిరాజులజంప వచ్చి యిచ్చోట
నాకరికనందరు నున్నారటంచు
నెచ్చరించిన నాయుఁ డిట్లనిపలికె.

**End:**

ఆవీరులందరు అపుడు చూడంగ
బాలుఁడు నాకాశపథమునకు నేగె

* * * *

ఆకాశవీరుఁడై ఆడుచునుండె
సంగడీలందరు సయ్యనవెచ్చి
స్థిరమొప్పకంభము దిగిరానుంచి
శంఖుతీర్థము బెట్టి స్థిరముగానపుడు
హరిపథమేగిరి ఆటుముందుగాను
యీ వీరచరితంబు యీ భువిలోన
వ్రాసిన చదివిన విన్నవారలకు
ఐశ్వర్యభోగము లమరంగ గలుగు
సౌభాగ్యభోగములు సంపదలు గలుగు
వల్లనై యుండుదురు జగతిలోపలను.

**Colophon :**

వలను భరద్వాజ వంశవర్ధనుఁడ
మారయపుణ్యాక్షీమాంబ కడుపునను
స్థిరముగా గలిగిన తైజంబు ఘనుఁడ
గారవంబైనట్టి ఘనుఁడ శ్రీనాథు
శేవట్టి వీరుల చరితమంతయును
తగజెప్పె నాచంద్రతారార్కముగను

(వి-వి.)——

సమగ్రమే కాని, అవతరణిక లేదు. వ్రాఁత చక్కగానున్నది. తప్పులు గలవు. గ్రంథపాతములు గలవు. శైథిల్యము లేదు.

రచనము వేఱయినను నెం 1139 రున వర్ణితమగు గ్రంథము నందలి బాలుని యుద్ధకథయే యిందును గలదు కాని యిందుఁగొంత విశేషముగలదు. మలిదేవరాజాదులు కారెమపూఁడి ప్రవేశించినపిదప నందఱు శివలింగ ప్రతిష్ఠలు సేయుటయు యోధు లందఱు రాజున్నకై మృతి వాంఛట్టైన వేఱవక యుద్ధము చేయుదుమని ప్రతినలు పూని రాజును రాజనాలపాటి కంపుటయు, మలిదేవరాజాదులు రాజనాల పాటికిఁ బోవుచుండ వైరివీరుఁలడ్డగించి వారి యోధులచే హతులగుటయు, బాలుఁడు యుద్ధమారంభించుటయు, ననుకథాంశములిందు విశేషముగాఁ గలవు. బాలుఁడు వీరస్వర్గమందుటతో నిందలి కథ ముగిసినది.—— దీని రచయిత శ్రీనాథుఁడని యిం దనన్వితముగాఁ గలదు.

ఈ కథతో సంబంధముగలవె యీ సంపుటమందేయున్న రచనములు వేఱు, ఇదివేఱు.

---

## No. 1118. పల్నాటివీరచరిత్ర (కన్నమనేనియుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (KANNAMANĒNIYUDDHAMU).

Substance, paper. Size, 12½ × 7¾ inches. Pages, 31. Lines, 26 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Incomplete and imperfect.

A treatise in the Mañjari metre describing the story of the heroes of Palnāḍu. The story contained in this work under notice deals with the

fight of Kannamanāyuḍu after the fall of Gōpu; Kannamanāyuḍu accompanied by Brahmināyuḍu is said to have entered the battle field, killed many warriors, took away the dead body of Gōpu and burnt it.

**Beginning:**

గోపుచికరాఁడుగదా గోసంగికన్నము
యటు విచారింపుమా యని నను వాఁడు
త్యాగఘనుం డారె జోగనచేత
గోపు స్రుకురాట విని గొనకొనియుండెఁ
ప్రకటకోపాటోపబలయుతుండగుచు
వడివచ్చి మొసలుదా వారించి నిలిపి
శోణిత రోషంబున దురములోఁ జెవుల
గోపుఁ జంపినవానిఁ గొట్టంగఁదలఁచి
పాంజులలో నెల్ల బలవంతుఁడారె
వారి జోగన కొంతు వడిఁకూడఁగదిసె.

**End:**

అప్పుడు గోపుకు నగ్నిసంస్కార
ములుచేసిరందరు పొగడుచునుండ
మీఁదటి క్రియలను మిగులఁ బెంపొంద
జూచుచు నుందురు శుభకరమగుచు
నీ వీరచారిత్ర మెవ్వరేనియును
జదివిన వ్రాసిన సద్భక్తివినిన
నాయువు శ్రీయును నైశ్వర్య విజయ
సౌభాగ్యభోగము ల్సంపదల్గలిగి
చల్లనై యుందురు జగములోపలను.

**Colophon:**

వలన భరద్వాజవంశవర్ధనుఁడు
మారయ (మల్లయ్య) పుణ్య భీమాంబకడ్పునను
స్థిరముగాఁగలిగిన తేజాఢ్యు ఘనుఁడు
గౌరవంబైనట్టి ఘనుఁడు శ్రీనాథు
చేపట్టి వీరుల చరిత మంతయును
జగఁజెప్పె నాచంద్రతారార్కముగను.

(వి-వి.)—

అసమగ్రము ఆరంభము లేదు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. మొదటినుండి తుది దాఁక ననేక సంస్కారములు జరపఁబడినవి.

గోపు రణనిహతుఁడైన పిమ్మట బ్రహ్మనాయని యనుమతి చొప్పున కన్నమనేఁడు రణరంగమునకుఁ జొచ్చి గోపును జంపినవారిని జోగన్న మొదలగు యోధులను గూల్చి గోపు శరీరమును దీసికొని బ్రహ్మనాయనితో నింటికేఁగుటయు నచట గోపున కగ్నిసంస్కారాదికమును జరపుటయు నిందలి కథపట్టు. ఇది 1112 నెంబరున వర్ణితమైన గ్రంథము తరువాతి భాగమే. కాని అక్కడ గ్రంథకర్త పేరు మల్లయ యని, ఇక్కడ శ్రీనాథుఁడని కలదు. ఇక్కడ గ్రంథకర్తృనామాంకనముగల రచనము సరియయినదిగాఁ దోఁపదు. ఇదికూడ మల్లయ కృతికాఁదగును. ఇది మంజరీ రచనము.

---

## No. 1119. పల్నాటివీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU).

Substance, paper. Size, 12¾ × 7¾ inches. Pages, 16. Lines, 30 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes. The variations in reading are noted in pencil throughout the MS

Incomplete and imperfect.

Same work as that described under No. 1141. As the MS. under notice happens to be incomplete and imperfect, full description is not given.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు గ్రంథము మొదటినుండి తుదిదాఁక ననేక సంస్కారములు చేయఁబడినవి.

కొమ్మరాజు యుద్ధసన్నద్ధుఁడై యెదుర రమ్మని తనకుఁబంపిన రాయబారమునుగూర్చి కొమరాజు నాగమతోఁజెప్పు కథాఘట్టముమాత్ర మిందుఁగలదు.

ఇది నెం 1141 రున నిది వర్ణితమగును. అసమగ్రముగా నుండుటచే నిక్కడ విడువఁబడెను.

## No 1120. పల్నాటివీరచరిత్ర (బ్రహ్మినాయనివిఱుగు).

## PALNĀTIVĪRACARITRA (BRAHMINĀYANIVIṞUGU).

Substance, paper. Size, 12½ × 7¾ inches. Pages, 15. Lines, 30 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes. The variations in reading are made in pencil throughout the MS.

Incomplete.

Same work as the above.

The story contained herein deals with the killing of Paccakulabrahma, Cintapallireḍḍi, etc., by Brahmināyudu in the battle field after the death of Adapakēśavadāsi. It is stated that Kāmarāju and Nāgamaya ran away from the battle field and that Brahmināyudu followed and caught hold of them but advised them and gave their kingdom back to them.

**Beginning:**

మంజరి. అడపకేశవదాసి యాలంబులోనఁ
బడుటయుఁ జూచి యా బ్రహ్మినాయండు
కడు నుగ్రుఁడై మండెఁ గార్చిచ్చు మాడ్కిఁ
గడువడితో లయకాలునిమాడ్కిఁ
గలితవిక్రమకళాకాంతేయుఁ డనఁగఁ
బలియుండు పచ్చకుల బ్రహ్మన్నఁ జూచి
దడగషి యారము ల్తడయించి మీరు
తనుఁ జాల మన్నించి తద్దయుఁ బ్రీతి
బలపరాక్రముఁడైన బ్రహ్మన్నతోడఁ
జెలఁగి యుద్ధముసేయ సెలవు వేఁడుటయు
నుత్తమాశ్వము నెక్కి యురికించుకొనుచు
బాహువిక్రముఁడైన బ్రహ్మినాయండు
తరిమి బత్తీసాయుధముల వేడుటయుఁ
గరివైరిమూర్తి యా కమలనాభుండు
ఖవరానఁ జెగటార్చఁ బచ్చకులబ్రహ్మఁ
గదలి నాయఁడురాఁగఁ గనివాఁడు పలికె ॥

**End:**

నీమన్నెనాయకు ల్నీసేనలెల్ల
మడిసిరి యాకలన మఱి సమముగాను
నినుఁ దోలి పట్టంబు నిలిపితి నేఁడు
రాజ్యంబు వొందాడగా(?) యిట్లని పలికె

విజయంబు నీదేను వినుము బ్రహ్మన్న
అని చెప్ప రాజుచే నంపించుకొనియెం
గడ వేడ్క నాయఁడు కలని మధ్యమున
కాకల నట్లంచె నమరులు పొగడ ॥

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు వ్రాఁత చక్కనిది గాని తప్పు లెక్కువ. మొదటినుండి తుదిదాఁక పాఠసంస్కారము లనేకములు చేయఁబడినవి.

అడపకేశవదాసి చనిపోయిన తర్వాత బ్రహ్మనాయఁడు రణరంగము ప్రవేశించి పచ్చకులబ్రహ్మ, చింతపల్లిరెడ్డి మున్నగు వీరాగ్రేసరులను వధించెను. కామరాజును నాగమయు యుద్ధభూమి వదలి పాఱిపోయిరి. బ్రహ్మనాయఁడు వారిని వెన్నాడి పట్టుకొనెనుగాని ప్రాణహత్య చేయక, మీ రాజ్య భాగ మేలుకొండని బుద్ధి చెప్పి విడిచిపుచ్చెను. ఇందుగల కథాభాగమిది. దీనితోఁ బల్నాటివీరచరిత్ర కథ ముగియును గాఁబోలును.

---

No. 1121. పల్నాటివీరచరిత్ర (కోళ్లపోట్లాట).

PALNĀṬIVĪRACARITRA (KŌḶḶAPŌṬLĀṬA).

Substance, paper. Size, 12¾ × 8¾ inches. Pages, 113. Lines, 19 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Incomplete and imperfect.

Same work as that described under No. 1112 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొకమాదిరిగానున్నదిగాని తప్పు లెక్కువ. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది నెం 1112 రున వర్ణితమైనదే. దానికి మాతృకగూడ నగును.

---

No. 1122. పల్నాటివీరచరిత్ర (రాచమల్లురాయబారము).

PALNĀṬIVĪRACARITRA (RĀCAMALLURĀYABĀRAMU).

Substance, paper. Size, 12⅞ × 8¾ inches. Pages, 43. Lines, 17 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Incomplete.

Same work as that described under No. 1113 ante.

(ఏ-ఏ.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాఁత యొకమాదిరిగా నున్నదిగాని తప్పు లెక్కువ. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1113 రున వర్ణితమైనదే.

---

No. **1123**. పల్నాటివీరచరిత్ర (గురజాలయుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (GURAJĀLAYUDDHAMU).

**Substance, paper. Size, 12⅞ × 8¾ inches. Pages, 86. Lines, 18 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes and breaks off in some places.**

**Wants the beginning and the end.**

**Same work as that described under No. 1114 ante.**

(ఏ-ఏ.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదే కాని తప్పు లెక్కువ. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1114 రున వర్ణితమైనదే.

---

No, **1124**. పల్నాటివీరచరిత్ర (కల్లుప్రతిష్ఠ).

PALNĀṬIVĪRACARITRA (KALLUPRATIṢṬHA).

**Substance, paper. Size, 12⅞ × 8¾ inches. Pages, 56. Lines, 18 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes and breaks off in some places.**

Same work as that described under No. 1115 ante.

(ఏ-ఏ.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1115 రున వర్ణితమైనదే.

---

No. **1125** పల్నాటివీరచరిత్ర (బాలునికథ).

PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

**Substance, paper. Size, 12⅞ × 8¾ inches. Pages, 38. Lines, 19 on a page. Character, Telugu. Condition, injured. Mode of writing, good but contains mistakes and breaks off in many places.**

**Same work as that described under No. 1116 ante.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది నె 1116 రున వర్ణితమైనదే.

---

No. 1126. పల్నాటివీరచరిత్ర (బాలునియుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (BĀLUNIYUDDHAMU).

Substance, paper. Size, 12⅞ × 8⅜ inches. Pages, 84. Lines, 16 on a page. Character, Telugu Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes. Breaks off in some places.

Complete, but not perfect.

Same work as that described under No 1117 ante.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఇది నె 1117 రున వర్ణితమైనదే.

---

No. 1127. పల్నాటివీరచరిత్ర (కన్నమనేనియుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (KANNAMANĒNIYUDDHAMU).

Substance, paper. Size, 12⅞ × 8⅜ inches. Pages, 36. Lines, 16 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete and imperfect.

Same work as that described under No. 1118 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది నె 1113 రున వర్ణితమైనదే.

No. **1128**. పల్నాటివీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU).

Substance, paper Size, $12\frac{1}{2} \times 8\frac{3}{4}$ inches. Pages, 15. Lines, 21 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.,—

అసమగ్రము వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇది నె 1119 రున వర్ణితమైనదే.

---

No. **1129**. పల్నాటివీరచరిత్ర (బ్రహ్మనాయనివిఱుగు).

PALNĀṬIVĪRACARITRA (BRĀHMINĀYANIVIRUGU).

Substance, paper. Size, $12\frac{1}{2} \times 8\frac{3}{4}$ inches. Pages, 15. Lines, 21 on a page. Character, Telugu. Condition, injured Appearance, old Mode of writing, good but not free from mistakes

Incomplete.

Same work as that described under No. 1120 ante.

(వి-వి )—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది నె 1120 రున వర్ణితమైనదే.

---

No.. **1130** పల్నాటివీరచరిత్ర (కోళ్లపోట్లాట).

PALNAṬIVĪRACARITRA (KOḶḶPAOTLĀṬA).

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{1}{2}$ inches. Pages, 155. Lines, 22 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, fair but not free from mistakss. Notes in English by C. P. Brown are found throughout the MS.

Incomplete and imperfect.

Same work as that described under No. 1112 ante.

**Date of transcription--12th August 1842.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదేకాని నిర్దుష్టముగాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు. బ్రౌను దొరగారి యాంగ్ల టిప్పణులు పెక్కుచోట్లఁ గలవు. పుస్తకము మొదటి నాల్గు పుటల మీఁదను బ్రౌను దొరగా రింగ్లీషున పీఠిక వ్రాసిరి. అది ఈ సంపుటమున కెల్ల సంబంధించినది

ఇది నెం 1112 రున వర్ణితమే.

---

No. **1131**. పల్నాటివీరచరిత్ర (రాచమల్లురాయబారము).

PALNĀṬIVĪRACARITRA (RĀCAMALLURĀYABĀRAMU).

**Substance, paper. Size, 12½ × 7½ inches. Pages, 47. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Short notes by C. P. Brown are found in many places.**

**Wants the beginning and the end.**

**Same work as that described under No. 1113 ante.**

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాంత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్య మంతగా లేదు. గ్రంథపాతములు లేవు. బ్రౌను దొరగారి యింగ్లీషు టిప్పణులు పెక్కుచోట్లఁగలవు.

ఇది నెం 1113 రున వర్ణితమైనదే.

---

No. **1132**. పల్నాటివీరచరిత్ర (గురజాలయుద్ధము).

PALNĀṬIVIRACARITRA (GURAJĀLAYUDDHAMU).

**Substance, paper. Size, 12⅝ × 7⅝ inches Pages, 101. Lines, 22 on a page. Character, Telugu Condition, slightly injured. Appearanc, very old. Mode of writing, good but full of mistakes. English notes by C. P Brown are found in the margin throughout the MS.**

**Incomplete and imperfect.**

**Same work as that described under No. 1114 ante.**
**Date of transcription—26th December 1843.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత చక్కనిది. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు. బ్రౌను దొరగారి యింగ్లీషు టిప్పణులు పెక్కుచోట్లఁ గలవు

ఇది నెం 1114 రున వర్ణితమైనదే.

### No. 1133. పల్నాటివీరచరిత్ర (కల్లుప్రతిష్ఠ.)

### PALNĀṬIVĪRACARITRA (KALLUPRATIṢṬHA).

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{7}{8}$ inches. Pages, 61. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good, but not free from mistakes. Short notes in English by C. P. Brown are found throughout the MS.

Incomplete.

Same work as that described under No. 1115 ante.

The MS. is dated 7th October 1812.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. బ్రౌను దొరగారి యింగ్లీషు టిప్పణులు పెక్కు చోట్ల గలవు.

ఇది నెం 1115 రున వర్ణితమైనదే.

---

### No. 1134 పల్నాటివీరచరిత్ర (బాలునికథ).

### PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{7}{8}$ inches Pages, 49. Lines, 22 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes

Brown's notes in English are found here and there.

Same work as that described under No. 1116 ante.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. పెక్కు సంస్కారములు ఇంగ్లీషు వివరణములు వ్రాయఁబడియున్నవి.

ఇది నెం 1116 రున వర్ణితమే.

---

### No 1135. పల్నాటివీరచరిత్ర (బాలునియుద్ధము)

### PALNĀṬIVĪRACARITRA (BĀLUNIYUDDHAMU).

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{7}{8}$ inches Pages, 105 Lines, 22 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. English notes by C. P. Brown are frequently found throughout the MS.

Wants the introductory portion ; otherwise complete.

Same work as that described under No. 1117 ante.

Date of transcription —9th December 1842.

(వి-వి)—

సమగ్రము కాని అవతారిక లేదు వ్రాంత చక్కగానున్నది. తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు గలవు. బ్రౌను దొర గారి యాంగ్లేయటిప్పణి పెక్కు పట్టులఁ గలదు.

ఇది నెం 1117 రున వర్ణితమైనదే.

---

## No. 1136. పల్నాటివీరచరిత్ర (కన్నమనేనియుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (KANNAMANĒNIYUDDHAMU).

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{7}{8}$ inches. Pages, 41. Lines, 21 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete and imperfect.

Same work as that described under No. 1118 ante.

Date of transcriptio —15th December 1842.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి. బ్రౌను దొరగారి యింగ్లీషు టిప్పణి పెక్కుచోట్ల గలదు.

ఇది నెం 1118 రున వర్ణితమైనదే.

---

## No. 1137 పల్నాటివీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU).

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{7}{8}$ inches Pages, 22. Lines, 21 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as that described under No 1119 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్య మంతగా లేదు. గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1119 రున వర్ణితమైనదే.

## No. 1138. పల్నాటివీరచరిత్ర (బ్రహ్మినాయనివిఱుగు).

## PALNĀTIVĪRACARITRA (BRAHMINĀYANIVIṚUGU).

Substance, paper Size, 12⅝ × 7⅞ inches Pages, 19. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured Appearance, old. Mode of writing, good but not free from mistakes. Brown's notes in English are found throughout the MS.

Wants the beginning and the end
Same work as that described under No. 1120 ante.
Date of transcription—17th December 1842.

(వి-వి.)—

అనుక్రమము. ఆద్యంతములు లేవు. వ్రాంత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము. గ్రంథపాతములు లేవు. బ్రౌను దొరగారి యింగ్లీషు టిప్పణి అక్కడక్కడ గలదు.

ఇది నె 1120 రున వర్ణితమైనదే.

---

## No. 1139. పల్నాటివీరచరిత్ర (బాలునికథ).

## PALNĀTIVĪRACARITRA (BĀLUNIKATHA).

Substance, paper. Size, 9⅞ × 7½ inches. Pages, 300. Lines, 20 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Similar to the work described under No. 1116 ante It is stated that the author of this work was Śrīnātha

**Beginning:**

ద్విపద. శ్రీవారపుత్ర యాశ్రిత పుణ్యగాత్ర
మహిత నిర్మలరూప మాతంగవర్ణ(క్త్ర)

* * * *

అని మ'. విఘ్నేశు కతిభక్తి మ్రొక్కి
వినయాన మాచర్ల విభునిఁ బ్రార్థింతు
శ్రీరఘునాయకు శ్రీమహాదేవు
నారదసన్నుతు ననవిల్తు జనకు

* * * *

నిన్నుఁ బ్రార్థనసేయ నే నెంతవాఁడ
నిన్నుఁ బ్రార్థనసేయ నేర నేఁజేయు
తప్పులొప్పులుగాఁగ దయఁజూచి నన్ను

నెప్పుడు నెడఁబాయు కేంద్రారవణ

*          *          *          *

అని చెన్నరాయని కందండ మ్రొక్కి
యనయంబుఁ ద్రిపురసంహారు మదిఁ దలఁచి
కమలాసనుని వేడి కమలాక్షియైన
రమ వాణిఁ బార్వతి రంగుగాఁ దలఁచి
వసుధాదికవులకు వర్ణన చేసి
బసవేశ్వరుని వేడి పలనాటిపట్ట
మను పుటభేదనమందు సద్ద్విజులఁ
గొనియాడ బ్రహ్మకుఁ గొలఁదియొుఁగాదు
వీరాధివీరులు వీరమాఘునులు
వారిధిఁ గలఁచెడి వడిగలవారు

*          *          *          *

పరనారిసోదరుల్ పరమవైష్ణవులు
హరివిక్రమాటోపు లలవదేగురిని
ననిశంబు నుతియించు నయ్యాల కొలుపు
వినవిన రుచియించు వీరసాగరము
వేమారుసుకవులు వినుతిసేయంగ
భూమి శ్రీనాథుడు పుణ్యుఁడోయనఁగ
పలను(న) భరద్వాజ వంశవర్ధనుఁడు
వలుమాల చెన్నుని భక్తిఁ బ్రార్థించి
పలినాటి వీరుల భాగవతంబు
లలిమీఱఁగాఁ గుశలత్వంబుతోడ
ననయంబుగా ధరణిఁ గాకయునుచుఁ
చెనుఁగున ద్విపదగాఁ దెలుఁగొప్పఁజేసె ॥
శ్రీకరమైనట్టి శ్రీ వీరచరిత
ప్రాకటంబైయొప్పఁ బల్నాటిలోన
నీవిధంబున నింత యిల యెల్లనిండ
భావింపఁగా విష్ణుభక్తుల మహిమ
ధారుణి యేలుచుఁ దమలోనఁబోరి
శౌరిమపూఁడి శ్రీకలని మధ్యమున

నరకుంజరుండను నరనాథు కొఱకు
వెలవొప్పఁ జెలరేగి వీరనాయకుల
పంపున బాలుండు పరదళంబులను
గుంపులుగాఁ జేసి కో యనియార్చి

* * * *

పొడిచి యా నరసింగ భూపతిఁగలన
మడియించి కొలఁగెల్చి మడిసిన మహిమ
పచరింతు వీనుల పండువుగాను
వచియింతు శృంగారవార్థియో యనఁగ
నాకథాలక్షణం బది యెట్టి దనిన-
జేకొని వినరయ్య చెలువు దీపింప
అంతఁ గారెమపూఁడి యాకల్విలోన
సంతోషచిత్తులై సమరవిక్రములు
వినువీధి దేవత ల్వెలుఁగంది చూడ
రణబలోద్ధతులై రాజశేఖరులు
ఎలమి మాన్నెల్లపదేను దినాలు
చలపట్టియున్నారు సమరంబునందు ॥

**End :**

మంజరి. మెచ్చుచు దుల్పుచు మింటికిఁజనుచుఁ
గూడిపర్వులు పెట్టు కొఱవిదయ్యములు
పొదిగొని రణరంగ భూతలమందు
నీరీతి విహరించి రింపు సొంపలరఁ
దెగుతోఁ బూర్వాద్రిఁ దెలుపు పోఁచంగఁ
దమ పొందుపట్లకుఁ దర్వాతఁ జనిరి
సకల భూజనములు సంతోషమంద
భానుఁడు పూర్వాద్రిపై నెక్కి నిలిచె

**Colophon :**

ఘనుఁడైన శ్రీనాథ కవిరాజరాజు
చెన్నుని కృపచేతఁ జిత్తము ప్పొంగి
బాలుని విక్రమప్రౌఢియంతయును
విరచించె జనులకు విదితంబుగాను ॥

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు. ఇతర ప్రతిలోని పాఠభేదము లిం దెక్కింపఁబడినవి.

పల్నాటి వీరచరిత్రములోని కండవట్టనఁదగు బాలుని చరిత్రమునకు మేలయిన ద్విపదరచన మిది. కాని యిందలి తుదిపట్టు ద్విపదరచనము లుప్తమగుటచేఁగాఁబోలును దానికి బదులు మంజరీ రచనము చేర్పఁ బడినది ఆ మంజరీ రచనము ద్విపద రచనమునకు దీసి కట్టుగా నున్నది. పై ద్విపద రచనకు కర్త శ్రీనాథ కవిరాజని కలదు. పాఠకులయు లేఖకులయుఁ బారంపర్యమువలన ననేక పాఠములు చెడి వికారము చెందినను నీద్విపద రచన శ్రీనాథరచనము కాఁదగు ననిపించు చున్నది. ఇందువర్ణితమైన బాలుని చరిత్రము కథాసంగ్రహ మిది:——

మలిదేవరాజు సేనాసమేతముగా కారెమపూఁడిచేరి మూన్నెల్ల పదునేను దినము లయ్యెను. ఈ నడిమికాలమున మేడపిలో బాలుఁడు బొంగరము లాడుచుండ నొకనాఁడు ప్రామాదికముగా బొంగరపువ్రేటు అచ్చమ్మయను వైశ్యస్త్రీకిఁ దగిలెను. ఆమె యాఁడువారిని గొడుకుడు పుటకంటె నీ తండ్రులు యుద్ధము సేయుచున్న కారెమపూఁడికిఁబోయి సంగరమునఁ జావరాదా యని బాలుని దిట్టెను. దానఁ బౌరుషము రేఁగి బాలుఁడు తన తల్లియొద్దను సాని సబ్బాయియొద్దను, భార్య మంచాల యొద్దను, సెలవు పుచ్చుకొని సోదరసహితముగా కారెమపూఁడి చేరెను. (ఈ సోదరులు నిజమునకు మిత్రులుగాని సహోదరులుగారు వారు పలుకులములవారు.) అప్పుడక్కడ జరగుచున్న సంధి యేర్పాట్లు కెట్టకేలకు బాలుఁడు సమ్మతించెనుగాని, తాను యుద్ధమునకు వచ్చునపుడు తన భార్య మాటచే వెంటగొని రాకుండ విడిచివచ్చిన తన యగ్రసోదరుఁడు (ఈతఁడు బ్రాహ్మణుఁడు) అనపోతు ప్రాణత్యాగముచేసెనన్న వార్త విని సంధిపొసగించనొల్లక యుద్ధమునకు దిగి కామరాజు తమ్ముఁడగు నరసింగరాజు తలతెగి కొమ్మరాజున కర్పించి తన యిల్లడ తీర్చికొనెను. తరువాత బాలుఁడు భ్రాతృసహితముగా వీరస్వర్గమందెను.

కొమ్మరాజు కొమారుఁడగు రాచమల్లు తన మామయగు కామరాజు నొద్దకు రాయబార మరుగఁగా కామరాజు మంత్రియగు నాగమ రాచమల్లును విషప్రయోగముచేఁ జంపించెను. రాచమల్లును రాయబార

మంపినది బ్రహ్మనాయఁడు గాన బ్రహ్మనాయఁడు తన కుమారుఁడగు బాలునిఁ గొమ్మరాజున కిల్లడగా నిచ్చెను.

గ్రంథారంభమున బ్రౌనుదొరగారు యింగ్లీషున కొంత విమర్శ వ్రాసిరి.

---

No. 114( పల్నాటివీరచరిత్ర.

PALNĀṬIVĪRACARITRA.

Substance, paper. Size, 9¾ × 7½ inches. Pages, 127. Lines, 21 on a page. Character Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but full of mistakes

Incomplete.

Similar to the work described under Nos. 1113, 1118, 1145, 1146 ante.

**Beginning:**

శ్రీవిష్ణునాభిని జెలు వగ్గలించి
భావిఁ జతుర్ముఖబ్రహ్మ జనించె

* * * *

మనుమలు పదికోట్లు మహిని శోభిల్ల
ఘనగర్వమునఁ బొంగి కార్తవీర్యుండు
మదగర్వమున నుండి మర్యాద దప్పి
పదపడి జగమెల్ల బాధఁ బొందింప
భూదేవి కోపించి పోయి విష్ణునకు
నాదరంబున మ్రొక్కి హస్తము ల్మోగిచి

* * * *

అవనిభారము మాన్పుఁడని విన్నవింప
భువనేశుఁడది విని భూదేవి నంపి
యమరంగ నామాట యాత్మలో నుంచి
జమదగ్నిరాముఁడై జయ్యనఁబుట్టి

* * * *

సోమవంశాధీశు సుతుమనుమలను
వేమారు జగమెల్ల వెదకి చంపంగ
వెఱచి యప్పుడు కార్తవీర్యుని మనుమ
లురవడిఁ బరతెంచి యొక పెద్దరెడ్డి

మఱియు చేరఁగ వెంట మందు చువచ్చు
పరశురామునిఁ జూచి పరగ నా రెడ్డి
పొందుగా గర్భిణిఁ బూఁబోణిఁదెచ్చి
ముందర నిలిపిన మొనసి కోపంబు
నాపఁజాలక స్త్రీనికనటు నద్దు దునుగ
నేపున ఖండించి యేఁగుచుండంగఁ
దెరవ గర్భంబునఁ దేపడ్డ శిశువు
పరశురామునితోడఁ బగచాటి పలికె
నోరపుగా నీపగ యొకచోటఁబోయె
నిరవంద నాపగ యీపాపలె నీవు
అని బాల పలికిన యాపలుకు లెల్ల
విని భార్గవుఁడు పల్కె విస్మయం బంది
పలుకు సత్యము మాకుఁ బగ మోచి వినుము
కలియుగంబున నేను గడువేడకఁ బుట్టి
నలినాక్షి నే బ్రహ్మనాయండ నగుదు
వెలనాయురాల్వై వేతెత జన్మించు
పలనాటి సీమలోఁ బ్రమథవర్గంబు
కలఁగక వీరులు కాఁగలవారు
ఆనాఁడు పగయిత్తు నతివ పొమ్మనుచుఁ
బూని రాముఁడు నిజపురము కేతెంచె.

**End :**

పంచెంబు నోడినఁ బదివేలుగొమ్ము
చెంది నీకును నింత చిన్నఁబోనేల
ఘలసాని సబ్బాయ యలిగి నీతోడఁ
బలుకదాయెనో నేఁడు బాలచంద్రుండ
నాతోడఁ జెప్పరా నా ముద్దులయ్య
నాతోడఁ జెప్పరా నా కన్నతండ్రి
యనియని మైతమ్మ యడలుచుఁ బలుక
విని పల్కె బాలుండు వివరంబుగాను.

**(వి-వి.)**—

అసమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. నె 184a రు ఆకులో మాత్రము గ్రంథమసమన్వితముగా నున్నది. కొంత గ్రంథపాత మేర్పడియుండును.

పల్నాటివీరచరిత్ర మానుపూర్వితోనున్న గ్రంథ మిది యొకటి కాం దగును. ఇందు పల్నాటి యుద్ధమునం బ్రసక్తులగు నిరువాగుల వీరుల యొకరియుం బూర్వ జన్మవృత్తాంతములతో కథారంభము గలదు. 1112, 1118, 1113, 1145, 1146, నెంబరుల వర్ణితములయిన గ్రంథములలోని కథాంశములెల్ల నిందు సంగ్రహముగాం గలవు. అనంగాం బల్నాటివీరచరిత్రము కథారంభమునుండి బాలుని కథలో, బాలుండు బొంగరా లాటలాడి యింటికి వచ్చునంతదాంకం గలదు. ఇది యింతకుముందు వర్ణితములైన రచనములకంటె వేఱయిన రచనము. ఇతర మంజరీ రచనలకంటె నీ రచనము మేలైనది. ఇందలిదేకాక బాలుని కథకు వేఱొక ద్విపద రచనముగూడం గలదు. అది నెం 1139 రున వర్ణితము.

---

No. **1141.** పల్నాటివీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU).

**Substance, paper.** Size, $9\frac{7}{8} \times 7\frac{1}{2}$ inches Pages, 65. **Lines, 22 on a page** Character, Telugu. Condition, fair. Appearance, old. **Mode of writing, fair but full of mistakes The variations in reading are noted throughout the MS**

Complete.

**Similar to the work described under No. 1119 ante**

**Beginning:**

శ్రీరమ్యవక్షుం డాశ్రితవత్సలుండు
వారిజనేత్రుండు వనజనాభుండు

* * * *

సొరిది నెల్లపుడు దాసులం బ్రోచు నేల్పు
గిరిధైర్యుండగు చంద్రగిరి రంగఘనుని
వేంకటేంద్రునకుసు విమలాత్మునకును
శంకలే కరులను సాధించువాండు
నరుదార బలశాలులై వన్నెకెక్కు
నటువదేగురికీర్తి నలరువానికిని
ధరలోన దాతలదాత గాయనికి
సరవితో రణవైరిసాహసాంకునకు
నలరాజు బాగున నవతారమంది
మలసి నూటొకరి బొమ్మల పెంపెరంబు

చెలఁగి డాకాల నుంచిన వాని కెపుడు
నిలువేలు పై కోరుకు లిచ్చెడివాఁడు
చేకొని మాచర్ల చెన్నకేశవుఁడు
నాకలలో వచ్చి నయ మొప్పఁ బలికె

* * * *

పలినాటివీరుల భాగవతంబు
చెలువారఁ గృతులుగాఁ జేసియు వేడ్క
నాకంకితముసేయు నలువొప్ప ననుచు
శ్రీకాంతుఁ డపుడు విచ్చేసిన పిదప
మెలకువ నేనంత మేలొందితి ననుచుఁ
జాల నాశ్చర్యంబు సంతోష మంది

* * * *

నాకు వరం బిచ్చి నను దాసుఁగాఁగఁ
జేకొన్న చే(మాచె)జెర్ల చెన్నుని మొదలు
సన్నుతిగావించి శంకరు నెంచి
వన్నెగా బ్రహ్మకు వందనం బొసఁగి

* * * *

గురజాల గంగకు గుఱుతుగా మ్రొక్కి
పరికించి గోవుల భైరవుఁ దలఁచి
కఱువేడ్కఁ బోతలింగముఁ గొనియాడి
విడువక పల్నాటివీరుల నెంచి
నీలమేఘశ్యామ నిజమూర్తియైన
శీలమనాయనిఁ జిత్తమం దుంచి
సుకవులఁ గొనియాడి సొంపు పెంపొప్పఁ
గుకవుల దూషించి కొల చెన్నగాని
సంగీతసాహిత్యచాతుర్యకవితఁ
జెప్ప నేర్చినవాఁడఁ జేజర్ల చెన్న
రాయని శ్రీపాదరాజీవమత్త
భృంగమానసమహిమఁ బెంపొందువాఁడ
శ్రీవిలసిల వెలసిన రామిసెట్టి
సర్వనార్యసుతుఁడ సత్కవిప్రియుఁడ
పరసమయమదగజపంచాననుండ
వరగొండ నాహ్వయుండను ధాత్రి వెలసి

చెలువొందు వేద సమ్మతముగా మున్ను
ఆదిసత్కవివరు లరయ దీపింప
రమణీయ మాపిర రామాయణంబు
కవితాచమత్కృతు ల్గావింప నట్టి
వారల కృపవడసి పరపుణ్యమహిమ
నొప్పార చరితంబు లూహించి నేను
సామజంబులు పోవు జాడను చిన్న
చీమలు సంచరించిన విధంబునను
రాయబారము కకొ రాజులు మెచ్చఁ
జెప్పిర ద్విపదగాఁ జేసితి మున్ను
మఱియొకటి కథ యేను మదిఁ దలపోసి
చెప్పఁబూనితి మనసు చెలరేగి యిపుడు
ఆ కథ యెట్లన్న నయ్య లందరును
వెలలేని ప్రేమతో వినుఁడు చెప్పెదను
గొమ్మభూపాలుని ఘోరయుద్ధంబు
స్వరమంజరిగఁ జేసి సరసులు మెచ్చ
వినుపింతు నేజగద్విఖ్యాతిగాను
ఘనమైన యీకథాక్రమ మెట్టిదనిన

**End:**

కొమ్మభూపతిచేయు ఘోరయుద్ధంబు
బ్రహ్మనాయుం డపుడు బహువిధంబులను
అందరియొరుగులు నరులవిరుగులును
దనరార నది సవిస్తారంబుగాను
దెల్పుచుండెను నంతఁ దేటతెల్లమిగ

**Colophon:**

ద్విపద. అని కృపాంభోనిధి యగువాని పేర
వనజగర్భునిఁ గన్న వరదుని పేర

* * * *

గిరిధైర్యగరిమతో ధరవె(రం)గఘనుని
వేంకటవిభునకు విభవంబు లొసఁగు
పంకజాక్షుని పేరఁ బరమాత్మ పేరఁ
గొమ్మరాజేంద్రుని ఘోరయుద్ధంబు
ప్రేమతోఁ జరితమై ప్రస్తుతికెక్క

చెలరేగి మాచెర్ల చెన్నకేశవరము
హారువునఁ జేసెను నతులితంబైన
పాండిత్యమహిమల బలురామిసెట్టి
కొండనాహ్వయుఁడు సద్గురుకృపాశ్రయుఁడు
ఆచక్రవాళశైలావనిదనుక
నాచంద్రతారార్కమై యొప్పుచుండ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పులు హెచ్చుగాఁ గలవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. పెక్కుపట్టుల పెన్సిలుతో సంస్కారములు చేయఁబడినవి.

బాలుఁడును బాదరాజును నిహతులయిన పిదప కొమ్మరాజు సోదరసహితముగా జోదుల సోమశేఖరుఁడు మున్నగు యోధుల ననేకులఁ బరిమార్చి నిరాయుధుఁడై యొంటినున్నప్పుడు పగబలముచేఁ బరిమార్పఁబడుట యీ గ్రంథమునఁగల కథాభాగము. ఈ గ్రంథము ప్రతులు భిన్నవిధముల నున్నవి. మంజరీరచనములో నున్న యీగ్రంథము కృత్యవతరణికయు నవసానమును ద్విపదరచనముతో నున్నవి గ్రంథకర్త పేరొకను పట్టు రచనము సంకర మయినది ఇక్కడ నున్నవిధము సరియయినదిగాఁ దోఁచదు. రామిసెట్టి సర్వనార్యుని కుమారుఁడయిన కొండన దీనికిఁ గర్తయని యిందున్న విధమునుబట్టి తెలియనగును. ఆతఁడు దీనికిఁ బూర్వము రామబారముకథను ద్విపదకృతిగా రచించినాఁడట! ఈ గ్రంథము చంద్రగిరి వెంకటవిభునకు అంకితముసేయఁబడినది. విశేషముల కుదాహృత గ్రంథభాగముఁ జూచునది

---

## No. 1142 పల్నాటివీరచరిత్ర (బాలునికథ).

## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

Substance, paper. Size, 9¼ × 7¾ inches. Pages, 219. Lines, 18 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Incomplete.

Same work as that described under No. 1116 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నె 1116 రున వర్ణితమైనదే.

## No. 1143. పల్నాటివీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU).

Substance, paper. Size, $9\frac{5}{8} \times 7\frac{5}{8}$ inches. Pages, 78. Lines, 16 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete

Same work as that described under No. 1141 ante.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నె 1141 రున వర్ణితమైనదే. ఇది సంస్కరింపబడిన శుద్ధప్రతియని వ్రాయఁబడినది. అవతారిక మిక్కిలి తాఱుమాఱుచేయఁబడినది. అవతరణికలో గ్రంథకర్తృత్వము శ్రీనాథునిదిగా మార్పఁబడినది. అవసానమున గ్రంథకర్త రామిసెట్టి కొండనయనియే కలదు. ఈ తాఱుమాఱులు నె 1128 రు ప్రతిలో జరపఁబడినవి. దానిఁబట్టి వ్రాయఁబడినదగుటచే నవి యిందు నెలకొన్నవి.

---

## No 1144 పల్నాటివీరచరిత్ర (బ్రహ్మినాయనివిఱుగు).

## PALNĀṬIVĪRACARITRA (BRAHMINĀYANIVIṞUGU).

Substance, paper. Size, $9\frac{5}{8} \times 7\frac{5}{8}$ inches. Pages, 26. Lines, 16 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes

Incomplete and imperfect

Same work as that described under No 112) ante

Date of transcription – 21st February 1850.

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. గ్రంథపాతములును గలవు.

ఇది నె 1120 రున వర్ణితమైన గ్రంథమే

---

## No. 1145. పల్నాటివీరచరిత్ర (కల్లుప్రతిష్ఠ).

## PALNĀṬIVĪRACARITRA (KALLUPRATIṢṬHA)

Substance, paper. Size, $9\frac{5}{8} \times 7\frac{5}{8}$ inches Pages, 104. Lines, 18 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Similar to the work described under No. 1115 ante.

**Beginning :**

శ్రీకరంబైనట్టి శ్రీవీరచరిత
ప్రకటితంబైనట్టి పలినాటిలోన
భావింపఁగా విష్ణుభక్తిని మెఱయ
నరనాథసింహంబు నలగామ రాజు
మహితచారిత్రుఁడౌ మలిదేవరాజు
కారెమపూఁడి శ్రీకలనిమధ్యమున
నరకుంజరుం డల్లు నరనాథుకొఱకు

**End :**

క్షీరాబ్ధిశయనుండు శ్రీలక్ష్మివరుఁడు
అసురులగర్వంబు లణఁచెడువాఁడు
దాసరక్షణమందు దయగలవాఁడు
ఇలువేలుపై మిమ్ము నెప్పుడుగాచు
చెన్నుఁడు మీవెంటఁ జేరియున్నాఁడు
సకలకార్యంబులు సమకూరుచుండు
నని చెప్పి దీవించి యరిగిరి వారు.

(వి-వి.)—

అసమగ్రము. అవతరణిక, ముగింపు, లేవు. వ్రాఁతచకరునిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది నె 1115 రున వర్ణితమైనదానితోఁ గొంత రచనాపా మ్యముగల గ్రంథాంతరము. కథసరిగా నందలి కథయే.

---

## No. 1146. పల్నాటివీరచరిత్ర (బాలుని కథ).

## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

Substance, paper. Size, $9\frac{5}{8} \times 7\frac{3}{4}$ inches. Pages, 214. Lines, 18 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Wants the introductory portion ; otherwise complete.

Similar to the work described under No. 1115 ante.

(వి-వి.)—

సమగ్రము. అవతరణిక లేదు. వ్రాంత చకరానిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది 1116 రున వర్ణితమైన గ్రంథమును బోలినదే కొంత సామ్యముగూడఁ గలదు గాని తుదముట్ట రచనము భేదించుచునే యున్నది. కథాంశము రెండింటను నొక విధముగా నున్నది.

---

No. 1147. పల్నాటివీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU)

Substance, paper. Size, 9⅞ × 7¾ inches. Pages, 76. Lines, 18 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as that described under No. 1143 ante.

(వి-వి.)—

సమగ్రము వ్రాంత మిక్కిలి చకరాఁగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది నె 1143 రున వర్ణితమైనదే.

---

No. 1148 పల్నాటివీరచరిత్ర (బ్రహ్మినాయనివిఱుగు).

PALNĀṬIVĪRACARITRA (BRAHMINĀYANIVIṞUGU).

Substance, paper. Size, 9⅞ × 7¾ inches Pages, 23. Lines, 17 on a page. Character, Telugu. Condition, injured. Appearance, new. Mode of writing, good but not free from mistakes

Incomplete and imperfect.

Same work as that described under No. 1120 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత చకరానిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఇది నె 1120 రున వర్ణితమైనదే.

## No. 1149. పల్నాటివీరచరిత్ర (కోళ్లపోట్లాట).

## PALNĀṬIVĪRACARITRA (KŌḶḶAPŌṬLĀṬA).

Substance, paper Size, $9\frac{3}{4} \times 7\frac{3}{4}$ inches. Pages, 187. Lines, on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete and imperfect.

Same work as that described under No 1112 ante.

The following note in the hand of C. P. Brown is found on the fly-leaf of the MS :—

"New Edition prepared under my orders 1850 by Vira Bhadraya."

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు. సి. పి. బ్రౌను దొరగారి యానతిని, 1850 వ సంవత్సరమున వీరభద్రయ్య యీ పుస్తక సంపుటమును వ్రాసెనట !

ఇది నె 1112 రున వర్ణితమైన గ్రంథమే. ఇందు వ్రాయసకాఁడు వచనమున మూఁడు పుటలలో కథోపోద్ఘాతము వ్రాసెను.

---

## No 1150. పల్నాటివీరచరిత్ర (రాచమల్లురాయబారము).

## PALNĀṬIVĪRACARITRA (RĀCAMALLURĀYABĀRAMU).

Substance, paper. Size, $9\frac{3}{4} \times 7\frac{3}{4}$ inches. Pages, 62. Lines, 15 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as that described under No. 1113 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులు, గ్రంథపాతములు గలవు. శైథిల్యము లేదు

ఇది నె 1113 రున వర్ణితమైనదే.

---

## No. 1151 పల్నాటివీరచరిత్ర (గురజాలయుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (GURAJĀLAYUDDHAMU).

Substance, paper. Size, $9\frac{3}{4} \times 7\frac{3}{4}$ inches. Pages, 134. Lines, 16 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete and imperfect.

Same work as that described under No. 1114 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లెక్కువగాఁ గలదు.

ఇది నెం 1114 రున వర్ణితమైనదే.

---

## No. 1152. పల్నాటివీరచరిత్ర (కల్లుప్రతిష్ఠ).

## PALNĀṬIVĪRACARITRA (KALLUPRATIṢṬHA).

Substance, paper. Size, $9\frac{3}{4} \times 7\frac{3}{4}$ inches. Pages, 103. Lines, 17 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Wants the beginning and end; otherwise complete.

Same work as that described under No. 1145 ante.

(వి-వి.)—

అసమగ్రము. అవతరణిక, గ్రంథావసానము లేవు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది నెం 1145 రున వర్ణితమైనదే.

---

## No. 1153. పల్నాటివీరచరిత్ర.

## PALNĀṬIVĪRACARITRA.

Substance, paper. Size, $9 \times 7\frac{1}{2}$ inches. Pages, 67. Lines, 24 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Incomplete.

Same work as that described under No. 1140 ante.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1140 రున వర్ణితమైనదే.

## No. 1154. పల్నాటివీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU).

**Substance, paper. Size, 9 × 7$\frac{1}{4}$ inches. Pages, 43. Lines, 22 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.**

Begins on Fol. 120*a*. The other works herein are Palnātivīracaritra (Bālunikatha) 1*a*, Palnātivīracaritra (Bālunikatha by a different author) 86*b*. Prabhulingalīla 148*a*.

Complete.

Same work as that described under No. 1141 *ante*.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇది నె 1141 రున వర్ణితమైనదే. $1_a$ పల్నాటి వీరచరిత్ర (బాలుని కథ), 86*b* పల్నాటి వీరచరిత్ర, $148_a$ ప్రభులింగలీలయను నీయితర గ్రంథములునుగలవు

---

## No. 1155. పల్నాటివీరచరిత్ర (భాలునికథ).

## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

**Substance, paper. Size, 9 × 7$\frac{1}{4}$ inches. Pages, 171. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes.**

Incomplete.

Same work as that described under No. 1139 *ante*.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములుగలవు.

ఇది నె 1139 రున వర్ణితమైనదే.

---

## No. 1156. పల్నాటివీరచరిత్ర (బాలునికథ).

## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

**Substance, paper. Size, 12$\frac{5}{8}$ × 8 inches. Pages, 172. Lines, 26 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but full of mistakes.**

The variations in reading are interlined throught the MS. Fol. 99 contains introduction in English by C. P. Brown.

Begins on Fol. 1*a*. The other works herein are;—Bālavikramārkuni Katha 91*a*, Cennamallu Sīsālu 103*a*, Vēmanapadyamulu 115, Nrsiṁhaśatakamu 130*a*, Paraśurāmavijayamu 139*a*, Vaijayantīvilāsamu 185*a*, Vaijayantīvilasamu 202*a*, Nrsimhaśatakamu 217*a*, Vijayavilasamu 226*a*, Manuvamśapurānamu 262*a*, Palnāṭi Bālunicaritra 267*a*, Kalāpūrnōdayamu 282*a*, Cārucandrodayamu 306*a*, Sānandacaritra 331*a*, Prabhulingalīla 353*a*.

Complete

Contains the further portion of the work described under No. 1145 *ante*.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదే. ఇరుజెఱంగుల నున్నది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. పాఠభేదములు సంస్కారములు పెక్కులు చేర్పఁబడినవి.

ఇది నెం 1145 రులో వర్ణితమయినగ్రంథమున తుదిభాగము నుండి నెం 1146 రు గ్రంథము తుదిదాఁక గలదు అనఁగా, బట్టు రాయబారము తర్వాత యుద్ధసన్నాహము చేయుమని కామరాజు నాగమతోఁ జెప్పుట మొదలుగా బాలుసికథ తుదిదాఁకఁగలదు.

మఱియు, బ్రౌనుదొరగారు పల్నాటి చరిత్రవిషయమై ఇంగ్లీషులో వ్రాసిన యుపోద్ఘాతము ఈ సంపుటము 99 పత్రమునఁగలదు. అది అసమగ్రము.

ఇందీ ఇతర గ్రంథములున్నవి:—91*a* బాలవిక్రమార్కుని కథ, 103*a* చెన్నమల్లుసీసాలు, 115*a* వేమనపద్యములు, 130*a* నృసింహశతకము, 139*a* పరశురామవిజయము, 185*a* వైజయంతీవిలాసము, 202*a* వైజయంతీవిలాసము, 217*a* నృసింహశతకము, 226*a* విజయవిలాసము (సటీకము), 262*a* మనువంశపురాణము, 267*a* పల్నాటిబాలునిచరిత్ర, 282*a* కళాపూర్ణోదయము, 306*a* చారుచంద్రోదయము, 331*a* సానందచరిత్ర, 353*a* ప్రభులింగలీల.

---

No. **1157.** పల్నాటివీరచరిత్ర (బాలునియుద్ధము).

PALNĀṬIVĪRACARITRA (BĀLUNIYUDDHAMU).

Substance, paper. Size, $12\frac{5}{8} \times 8$ inches. Pages, 12. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes.

English notes by C. P. Brown are found throughout the MS.

Incomplete.

Contains a portion of the work described under No. 1139 *ante*.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. బ్రౌనుదొరగారి యింగ్లీషుటిప్పణులుగలవు.

ఇది బాలుఁడు బొంకరాలాడు ఘట్టకుసందలి యల్పభాగము ఇది TE నె 297 రు సంపుటము 28 మొదలు 38 వఱకునుగల పత్రములనుండి యెత్తి వ్రాయఁబడినదట! ఇది కొన్ని శుద్ధప్రతులందు పొరపాటునవిడువఁబడినదట! ఈ గ్రంథభాగముండవలసిన నె 1139 రుగల గ్రంథమై యుండవచ్చును.

---

### No. 1158. పల్నాటివీరచరిత్ర (కన్నమనేనియుద్ధము).

### PALNĀṬIVĪRACARITRA (KANNAMANĒNIYUDDHAMU).

Substance, paper. Size, 9¾ × 7¾ inches. Pages, 49 Lines, 17 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Breaks off in some places.

Incomplete.

Same work as that described under No 1118 *ante*.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఇది నె 1118 రున వర్ణితమైనదే.

---

### No. 1159. పల్నాటివీరచరిత్ర (కల్లుప్రతిష్ఠ).

### PALNĀṬIVĪRACARITRA (KALLUPRATĪṢṬHA).

Substance, paper. Size, 12½ × 7¾ inches. Pages, 68. Lines, 24 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

Complete.

Same work as that described under No. 1145 *ante*.

**Beginning:**

శ్రీరఘునాయకుఁ జిత్తమందుంచి

. . . . . .

శ్రీకరంబైనట్టి శ్రీవీరచరిత
ప్రకటితంబైనట్టి పల్నాటిలోన

**End:**

చెన్నుఁడు మావెంట చేరియున్నాఁడు
సకలకార్యంబులు సమకూరునింక

అని చెప్పి దీవించి యరిగిరివారు
అంతటమేషప్పినైన వార్తలను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నె 1145 రున వర్ణితమైనదే.

---

## No. 1160. పల్నాటి వీరచరిత్ర (బాలునికథ).

## PALNĀṬIVĪRACARITRA (BĀLUNI KATHA).

Substance, paper. Size, 12⅝ × 7¾ inches. Pages, 73. Lines, 24 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, good and free from mistakes.

Complete.

Same work as that described under No. 1117 *ante.*

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది నె 1117 రున వర్ణితమైనదే.

**Beginning :**

---

## No 1161. పల్నాటి వీరచరిత్ర (కొమ్మరాజుయుద్ధము).

## PALNĀṬIVĪRACARITRA (KOMMARĀJUYUDDHAMU).

Substance, palm-leaf. Size, 17¼ × 1¼ inches. Pages, 46. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes.

Complete.

Same work as that described under No. 1141 *ante.*

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు.

ఇది నె 1141 రున వర్ణితమైనదే.

## No. 1162. పల్నాటివీరచరిత్ర (బాలునికథ).
## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA).

Substance, palm-leaf. Size, $17\frac{1}{2} \times 1\frac{5}{8}$ inches. Pages, 49. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes.

Incomplete.

Same work as that described under No 1139 *ante*

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు

ఇది నె 1139 రున వర్ణితమైనదే.

బాలుఁడు యుద్ధరంగమునకుఁ బోవుచు అనపోతును దామఱచి వచ్చిన వస్తువులను దెచ్చుటకై వెనుకకుఁ బంపు ఘట్టమునుండి తుది దాక నిందు గలదు.

---

## No. 1163. పల్నాటివీరచరిత్ర (బాలునికథ.)
## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA.)

Substance, paper. Size, $12\frac{5}{8} \times 8$ inches. Pages, 260. Lines, 22 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Wants the introductory portion ; otherwise complete.

Same work as that described under *No.* 1139 *ante*.

(వి-వి.)—

అవతరణిక తక్కఁ దక్కిన దెల్లఁ గలదు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు . శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది నె 1139 రున వర్ణితమైనదే.

---

## No. 1164. పల్నాటివీరచరిత్ర (బాలునికథ).
## PALNĀṬIVĪRACARITRA (BĀLUNIKATHA.)

Substance, paper. Size, $13\frac{5}{8} \times 8\frac{3}{4}$ inches. Pages, 140. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as that described under No. 1139 ante

Date of transcription :—24th August 1844.

(వి-వి.)—

అసమగ్రము. మంచాలయను నామె యత్తయును సంభాషించు ఘట్టముదాఁకఁ గలదు. వ్రాఁత మంచిది. తప్పులంతగాం లేవు. శైథిల్యమువించుక గలదు. గ్రంథపాతములు లేవు

ఇది నెం 1139 రున వర్ణితమే. కదిరినుండివచ్చిన దగుటచేఁ గాఁబోలునుఁ దీనిని సి. పి. బ్రౌనుదొరగారు కదిరి కావ్యమని పేర్కొనిరి.

---

## No. 11.5. భల్లాణచరిత్ర.

## BHALLĀṆACARITRA.

Substance, paper Size, $11\frac{5}{8}\times 7\frac{1}{8}$ inches Pages, 59. Lines, 22 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes

Begins on fol. 229*a*, the other works herein are Vīrabhadravijayamu 1*a*, Sūryatanayāpariṇayamu 123*a*, Sārangadhara caritra (dvipada) Tīka.

Complete.

Same work as that described under R No. 280 ante.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. కాని తప్పు లెక్కువ. పాఠభేదములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఆర్. నెం 280 రున వర్ణితమైన గ్రంథమే యిది. సింధు కటకాధీశ్వరుఁడగు భల్లాణుఁడను రాజు జంగమారాధన తత్పరుఁడై యుండుటయు, శివుఁడు జంగము రూపధారియై వచ్చి తద్భార్యచే నర్పితుఁడగుటయు, దానికి భర్త సమ్మతించుటయు. శివుఁడు ప్రత్యక్షమై యనుగ్రహించుటయు నను కథ యిందుఁగలదు. దీని కర్త చిత్తారు గంగాధరయ్యయను జంగముదేవర మల్లమాంబకు వీరయ్యకుఁ గుమారుఁడు. ఈ గ్రంథము రాచవీటి వీరభద్రస్వామి కర్పింపబడినది. బ్రౌను దొరగారీ గ్రంథమును గూర్చి యీ క్రింది వాక్యములు వ్రాసిరి :—

“ఈ కావ్యము జబ్బుగా నున్నది. యతులు ప్రాసలను గురించి మాత్రం తెలియని కవి చెప్పినది. పనికిరాదు.”

ఇందు 1 a వీరభద్రవిజయము, 123 a సూర్యతనయా పరిణయము, 264 b సారంగధర చరిత్ర (ద్విపద) టీక గలవు.

## No. 1166. భల్లాణచరిత్ర.

## BHALLĀṆACARITRA

Substance, palm-leaf. Size, $10\frac{1}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 112. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1167. భల్లాణచరిత్ర.

## BHALLAṆACARITRA.

Substance, palm-leaf. Size, $16\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 85. Lines, 4 on a page. Character, Telugu Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1168. భల్లాణచరిత్ర.

## BHALLĀṆACARITRA.

Substance, palm-leaf. Size, $16\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches. Pages, 31. Lines, 8 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె

---

## No. 1169. భల్లాణచరిత్ర
## BHALLĀṆACARITRA.

Substance, paper. Size, $9\frac{7}{8} \times 7\frac{5}{8}$ inches. Pages, 71. Lines, 19 on a page. Character, Telugu. Condition, fair Appearance, old. Mode of writing, good but not free from mistakes

Begins on fol. 161 a. The other work herein is Sārangadhara-charitra 1 a.

Complete.

Same work as the above.

Date of transcription :—4th September 1843

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కగానున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు

పూర్వమువలె.

ఇందు 1 a సారంగధర చరిత్ర (ద్విపద) కలదు.

---

## No. 1170. భల్లాణచరిత్ర.
## BHALLĀNACARITRA.

Substance, paper Size, $9\frac{7}{8} \times 7\frac{5}{8}$ inches. Pages, 78. Lines, 19 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Begins on fol 209 a The other work herein is Sārangadhara-charitra 1 a.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కగానున్నది. తప్పులు కలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

ఇందు 1 a సారంగధర చరిత్ర (ద్విపద) కలదు.

## No. 1171. భల్లాణచరిత్ర.

## BHALLĀṆACARITRA.

Substance, palm-leaf. Size, $13\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches. Pages, 26. Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత చకరిని. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1172. భల్లాణచరిత్ర.

## BHALLĀṆACARITRA.

Substance, palm-leaf. Size, $11\frac{7}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 47. Lines, 8 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1173. భల్లాణచరిత్ర.

## BHALLĀṆACARITRA

Substance, palm-leaf. Size, $15\frac{7}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 35. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

Date of transcription :—Thursday in the bright fortnight of the lunar month Mārgaśira in the year Nala Name of the scribe :—Mayinampāṭi Kēśavulu.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమందిట్లు గలదు :—

" నలనామ సంవత్సరం మార్గశిర శు॥ గురువారం వరకు మయినం పాటి కేశవులు వ్రాశియిచ్చిన భల్లాణ చరిత్ర సంపూర్ణం."

---

No. **1174.** భల్లాణచరిత్ర.

BHALLĀṆACARITRA.

**Substance**, palm-leaf. Size, $11\frac{1}{8} \times 1\frac{1}{8}$ inches. Pages, 146. Lines, 3 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మిక్కిలి వికృతముగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్య మున్నది. గ్రంథపాతము లున్నవి.

పూర్వమువోలె.

---

No. **1175.** భల్లాణచరిత్ర.

BHALLĀṆACARITRA.

**Substance**, palm-leaf. Size, $17\frac{1}{8} \times 1\frac{1}{8}$ inches. Pages, 12. Lines, 5 on a page. Character, Telugu Condition, much injured Appearance, very old. Mode of writing, good but full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

## No 1176. భాను కళ్యాణము.

## BHĀNUKAḶYĀṆAMU

Substance, paper. Size, 10 × 7½ inches. Pages, 32. Lines, 28 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes.

Begins on fol. 1*a*. The other works herein are Sundarīmaṇiśatakamu 19*a*, Paramabhāgavatavilāsamu 30*a*, and Airāvatacaritramu 43*a*.

Complete.

A poem in the Dvipada metre describing the story of the marriage of the Sun god with Samjñā, daughter of Brahman. The author Candraśēkharakavi was the son of Kañcarlayya and grandson of Pramathayācārya of Viśvabrahma race

**Beginning :**

శ్రీరాజమౌళిని చిన్మయాకృతిని
గౌరీ సమేతుని కైలాసపతిని
పెనుబాముకవణమజ్జనశాలువాని
నునుగాలిది డీ పాన్పునసుండువాని
జెడఁగుపుకిరీట పసిబిడ్డ నేల్వాని
కడుపు బంగారు బొకరీసమైనవాని
అలఘువిభూతి దయామేధలకును
తలఁతు సేవింతు సంతతముఁ బ్రార్థింతు

* * * *

ఓనరయ్య భూలోక విబుధేంద్రులార
ఘనవిరాణ్మయ విశ్వకర్మాన్వయమున
బరగుకిన్నెర బ్రహ్మవంశ జాతుండు
గురుఁడు సపర్ణ సగోత్రపాత్రుండు
వేదశాస్త్రి పురాణ విశదకోవిదుఁడు
ప్రోది మహారాజ పూజ్యచర్యుండు
గురు శిఖామణి నామగుణగరిష్ఠుండు
వరుస కంచర్లయ్యవారి పుత్రుండు
చంద్రద్యుతి స్ఫారసత్కీర్తిపరుఁడు
చంద్రశేఖర కవీశ్వరనామఘనుఁడు
భాసురంబుగఁ దేటముద్దు మాటలను

* * * *

భానుకళ్యాణ మేర్పరచి మోదమున
ద్విపద కావ్యంబుగా ధీవరుల్ మెచ్చ
నిపుణత్వముగఁ జేయు నిశ్చయంబుగను
అంకితంబుగఁ ద్రిపురారాతిచరణ
పంకేజముల కతి భక్తినర్పించి॥

* * * *

**End:**

అని పురాంతక కుపేర సభాపుని పేర
బ్రణుతింప విశ్వసుబ్రహ్మణ్యు పేర
పురణింపఁగా విరాట్పురుషుని పేర
ఘనతఁగాంచిన విశ్వకర్మాన్వయమున
బరగిన కిన్నెర బ్రహ్మవంశజుఁడు
గురుఁడు సుపర్ణసగోత్రపాత్రుండు

* * * *

సరససాహిత్య లక్షణ కవీంద్రుండు
సరసుఁడా బ్రమథయాచార్య పాత్రుండు

* * * *

చంద్రశేఖర కవీశ్వరనాముఁడగుచు

* * * *

ఘనతరంబుగ భానుకళ్యాణ చరిత
ననువొంద ద్విపద కావ్యంబుగాఁ జేసి
సంకల్పసిద్ధిగా సద్భక్తి నొనర
నంకితంబుగఁ ద్రిపురాంతకేశునకుఁ
గావించె నా పుణ్యకథ సంతసమున.

* * * *

వాచకులగుచున్నవారి జిహ్వాలను
నాచంద్రతారార్కమై యొప్పుఁగాత॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యంత మంచిది గాదు. తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

బ్రహ్మ పుత్రియగు సంజ్ఞాదేవిని సూర్యుఁడు వివాహమాడు కథ యిందు వర్ణితమయినది. విశ్వబ్రహ్మ వంశ్యుఁడు, ప్రమథ యాచార్య పౌత్రుఁడు కంచెర్లయ్యవారి పుత్రుఁడునగు చంద్రశేఖర కవి దీనికి గర్త.

ఇందియితర గ్రంథములు గలవు.

19*a* సుందరీమణి శతకము, 30*a* పరమ భాగవత విలాసము, **43*a*** ఐరావత చరిత్ర.

---

No. 1177. మైరావణ చరిత్ర.

MAIRĀVANACARITRA.

Substance, palm-leaf. Size, $16\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches. Pages, 31. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Similar to the work described under No. 650.

**Beginning:**

. . . సింహనాదములు తూర్యములు
నందందమెఱయంగ ననికి నేతెంచు
అనిపలికిభయమున నానిశాచరులు
వినియూరకున్న నవ్విధమువీక్షించి

*  *  *  *

. . . .

. . . .

అక్కటరావణుం డమితదానవులు
మొక్కలంబుగఁ జాల మడియుట మదిని
మునుకొనిశోకంబు మల్లడికొనఁగ
(ని)ననిచినవగలచే నిటూర్పుపుచ్చి
కడిమిచేనిఁక(గె)నిల్వఁగాదు రాఘవుల
నడరెడు కపటమాయలచేతఁగాని
యనియాత్మఁదలపోసి యక్షలమంత్రులను
[illegible]వరంగఁదనధూత నొండునేమించి

మారీచుశంబరుమయు నెంచి చూపుడు
మైరావణుఁడు పెక్కు మాయలు నేర్చు
నాని చేత నెగాని వారింపరాదు
పూని యామనుజుల పోఁడిమిపోగరు
నణిపిల్వనంపిన నతఁడును వచ్చి
దను జేశు పాదఁగాంచి తగ నిట్టులనియె.

**End :**

రావణుని రెండో యుద్ధం
నానాటికీభంగి నాఖిలంబెల్ల
హీనమయ్యెను భృత్యు లెల్లఁ జచ్చుటయు

*          *          *          *

నాకాధిపతినైననని కోర్చువారు
నాకునై పోలిసిరి నాగర్వ మడఁగె
నటుగాన శత్రుల నందఱఁదునిమి
పటుపరాక్రమమునఁ బగదీఁగువాఁడ

*          *          *          *

మగలు తనూజులు మాసహోదరులు
తెగి రింక నెవ్వరు దిక్కు మా కనుచు.

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాఁత మంచిదే. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది డి. నె 650 రున వర్ణితమైన కృతిని బోలినదే. అదే కథ యిందు ద్విపద రూపమున నున్నది. దీని కర్త పేరేమో యిందుఁ గానరాదు.

---

## No. 1178. యోగీశ్వర విలాసము.

## YŌGĪŚVARAVILASAMU

Substance, paper. Size, $12\frac{3}{4} \times 7\frac{1}{2}$ inches. Pages, 56. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair Appearance, new. Mode of writing, fair but full of mistakes

Begins on fol. 14*la*. The other works herein are Rāghava vāsudēvīyamu 1*a*, Bhallaṇa caritramu 73*a*.

Complete.

A poem in Dvipada metre narrating the principles of Śaiva Philosophy ; by Siddhēndrayōgin.

The following note in English by C. P. Brown is found at the beginning of the work :—

" The Parama Yōga Vilāsam " This is an explanation of the philosophical divinity—or Yoga Śāstram (quietism). It is written in the form of lectures delivered by Allama Prabhu and the disciple being a woman (Acca Maha Devi) the explanation is made as simple and easy as possible. Thus it is less dignified than the Rāmastava Rājam which is a work of more learning on the same topics.

In the Bodleian Library at Oxford I found a copy of this book.

**Beginning :**

శ్రీ రాజయోగ విశేషంబుగనిన
ధీరాత్ములకు దివ్యతేజంబు లొసఁగి

*      *      *      *

మృత్యుంజయునికీర్తి మెఱయించి కాంచి
నిత్యంబు శివయోగనిష్ఠలుపూని
యెలమి శ్రీ సిద్ధయోగీంద్రాహ్వయమునఁ
గలియుగంబందు విఖ్యాతివహించి
యోగీశ్వర విలాస ముర్విలో నేను
బాగైనద్విపద కావ్యంబు రచింతు

*      *      *      *

అక్కమహాదేవి యా ప్రభుస్వామి
చక్కికిఁ జనుదెంచి చరణముల్గాంచి

*      *      *      *

ఇకనైన నుపదేశమిచ్చి రక్షింపు
మకలంకగతిశివైక్యముఁ జూపుమనినఁ
జాతుర్యవాక్యముల్ సంధించి ప్రభువు
నాతికిట్లనియె డెందము తల్లడింప

**End :**

మదిరాక్షియల్లమ ప్రభు స్వామి చరణ
పద్మముల మస్తకమునంటఁ జొనిపి(?)

*      *      *      *

నిర్వికల్పానంద నీరధిదేలి
యుర్విఁ జరింపుచునుండు నిత్యంబు.

**Colophon:**

అని యిట్లు శైవశాస్త్రానుసారంబు
మనెమహాదేవి సమత వహించి

* * * *

లీల బాలబ్రహ్మలింగవిగ్రహావి
శాలకృపాలబ్ధ సత్కవిత్వంబు
శ్రీమతిఁ గైకొని సిద్ధయోగీంద్ర
నామంబు నొందిన జనస్తోత్ర సరణి
రతిధాత్రియోగీశ్వర విలాసంబు
ధృతిఁ జెనుఁగున నేను ద్విపద కావ్యంబు
గూర్చి పలికితి దీనికొదువ లేమైనఁ
దీర్చి వ్రాసి సుఖాబ్ధిఁ దేలి సంతతము
జనులకు బోధించి సావధానముగ
ఘనమోక్షపథముడగ్గఱఁ జేర్పవలయు
నదిగాక భువి నెవ్వరైన నీద్విపదఁ
జదివిన వ్రాసిన సద్బుద్ధి వినిన
నామర్త్యులకును గల్యాణంబు లొసఁగి
యామోదమున నుందు రఖిల కాలంబు॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు హెచ్చు. అధిక పాఠములు వ్రాసిన కాగితపు ముక్కలు కొన్ని పుస్తకము నడుమ నక్కడక్కడ నదికింపఁబడినవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

అల్లమ ప్రభుఁడు అక్కమహాదేవికి బోధించినట్లుగా శివయోగసంప్రదాయమిందు వివరింపఁబడినది. రామస్తవ రాజమును బోలిన యీ గ్రంథము మాతృక ఆక్స్ఫర్డు బాడ్లియన్ లైబ్రరిలో గలదని, బ్రౌను దొరగారు వ్రాసిరి. దీనికర్త సిద్ధేంద్రయోగి. అతఁడు బాలబ్రహ్మలింగ (బాల బ్రహ్మేశ్వరము శ్రీశైల పాదక్షేత్రము) కృపాలబ్ధ కవితాసంపన్నుఁడఁట.

ఇందే యితర గ్రంథములు గలవు.

a రాఘవ వాసుదేవీయము. 73a, భల్లాణ చరిత్రము.

## No. 1179. యోగీశ్వరవిలాసము.

## YÔGÎŚVARAVILĀSAMU.

Substance, palm-leaf. Size, 14⅜ × 1⅛ inches. Pages, 40. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు కడుహెచ్చు.

పూర్వము వోలె.

---

## No. 1180. విక్రమార్కుని కథలు.

## VIKRAMĀRKUNI KATHALU.

Substance, paper. Size, 9⅜ × 6¼ inches. Pages, 419. Lines, 16 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Complete.

A poem in five chapters in the Dvipada metre describing the valorous deeds of the well known King Vikramārka. The author Koṇḍaya, son of Timmayakavi, wrote this work at the instance of Peddayamantri, son of Dēvayāmātya, and didicated it to God Venkaṭeś-vara worshipped at Tirupati For other particulars see the extracte given below.

**Beginning·**

శ్రీనిత్యవక్షునాశ్రితలోక రక్షు
భానుశశాంకాక్షుఁ భాదాంతరిక్షు

*　　*　　*　　*

గోపికావల్లభు గోపాలకృష్ణు
మాపాలి వేల్పును మదిలోన నిల్పి

*　　*　　*　　*

శివభద్రు నుతియించి క్షితిలోనఁ దెనుఁగు
కవితకు గురుభీమకవినన్నయార్యు

నవనిగీష్పతినిర యాదునిఁబొగడి
ఘనతరమున మెచ్చుగండపట్టణము
చెనమల్లికసవయ చిట్టయామాత్య
తనయుమజ్జనకుని దత్తార్థ (విదుని)
. . . . సముచ్చయకృతికి(ని?)

* * * *

తెనుఁగున రచియించి దిగ్భాగములను
(దనకీర్తి) చంద్రికఁ దనరించినట్టి
తిమ్మయకవి (లోక) దేవేంద్రుఁ దలఁచి
సమ్మతి నొక కథ సాభాగ్యమొదవఁ
జెప్పెద ననుచు నేఁ జింతింపుచుండ

* * * *

కాశ్యపగోత్రాబ్ధి కంజాప్తహితుఁడు

* * * *

ఐనదేవయమంత్రిరాజ (యాత్మ) సంభవుఁడు

* * * *

. . సమాచనకరణంబు మల్లు
పైకొన్న కీర్తులు పైకొన్నవాఁడు

* * * *

అంగనాపాంచాలుఁ డలికాతుభక్తి
సంగుఁడు పెద్దయసచివశేఖరుఁడు

* * * *

ఒకనాఁడు సుఖగోష్ఠినుండి చిత్తమున

* * * *

ఇట సప్తసంతతు లిందులోఁ గృతియె
ప్రవిమలంబై జగత్ప్రఖ్యాతి నొందు
నన్ని (నియు ?) సేయించి మహాకావ్యచింత
వినుతోత్తమ ప్రౌఢి విరచించువాని
ఘనతతోఁ దనమెచ్చుగండపట్టణము
చెనమల్లికసవయ చిట్టయామాత్య
తనయు తిమ్మయకవితనయుఁడౌవాని
(ననుఁగొండనా) వ్యాఖ్యానానార్థవేది
రప్పించి కనకాంబరంబులు కరుణ

నిప్పించి కరుణతో నిట్లని పలికె
(హారి)(ని ?) విభుండగు విక్రమార్కుని కథలు
సరవి ద్వాత్రింశక సాలభంజికలు
చెలఁగుభోజనరేంద్రు చెవిసోకు (జోఁపు ?) కథలు
చలికొండపట్టికి శంకరుం డర్థిఁ
దెలిపెనుగ్రమమెల్ల ధీరులుమెచ్చఁ
దెలుఁగునందును రసోద్దీపితంబుగను
గలుగఁజెప్పెదను సత్కవులును మెచ్చ
ఘనతతో(డ) ద్విపదకావ్యంబు చేసి

*   *   *   *

పంకజభవపురీతి భవ్యప్రబంధ
సంకల్పనా ప్రౌఢి సహజంబు నీకు.

**End :**

చిరకీర్తిభోజుండా సింహాసనమునఁ
బరమేశ్వరుని నిజబహులోత్సవమునఁ
బూజసేయుచు రాజ్యభోగసంపదల
తేజంబుతోడధాత్రీ తలమునను
సాలభంజికభోజ సంవాదమునకు
అలర ముప్పదిరెండు(?) విక్రమార్కుని కథలు
విన్నవించితి నీకు వేంకటనాథ
యున్నతోన్నత మహాయోగీంద్రనాథ
దేవయపెద్దన ధీజనవర్య
భావంబులోఁ గలఁ బాయనివేల్పు

**Colophon :**

ఇది చెన్నమలికార్జు నరేంద్రునిపౌత్ర (నేంద్రప్రపౌత్ర ?)
సదమలచారిత్ర సత్కవిమిత్ర
చిట్టయప్రభుతిమ్మశేఖరపుత్ర
ఘట్టితసదబంధకావ్యవైచిత్ర
జయవాక్యహారితల్ప సద్గుణానల్ప
నయరోహిణ్ణేయ కొండయనామధేయ
విరచితంబైమహావిభవ సౌభాగ్య

కరమహీయాన్వితి కాదికారణంబైన
యనఘాత్ముఁడగు విక్రమార్కునికథల
ననువొందు నిది పంచమాశ్వాస మయ్యె.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు కాని గ్రంథపాతములు చాలఁ గలవు. అవి వ్రాఁతలోనే విడువఁబడినవి.

విక్రమార్కుని కథలు సాలభంజికల కథలు అను పేళ్ల వాడుక తెలుఁగున నున్నట్టి కథలకే యిది నైదాశ్వాసముల ద్విపద రచనము. గ్రంథకర్త కొండయ ; తిమ్మయకవి కొడుకు ; దేవరామామాత్యుని కొడుకగు పెద్దయమంత్రి ప్రేరణమున నీకృతి తిరుపతి వేంకటేశ్వరస్వామి కంకితము సేయఁబడినది. విశేషముల కుదాహృత భాగములు చూచునది.

---

## No. 1151. విక్రమార్కుని కథలు.

## VIKRAMĀRKUNI KATHALU.

Substance, palm-leaf Size, 14¾ × 1¼ inches. Pages, 230. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. కన్నడ మోడిగలది. తప్పులు లేకపోలేదు. శైథిల్యము గలదు. గ్రంథపాతము లధికముగాఁ గలవు.

పూర్వమువలె.

పూర్వవర్ణితమున కిది మాతృక.

గ్రంథాంతమం దిట్లుగలదు :—

"క్రోధినామ సంవత్సరద కార్తీక బ ౧౦ దివసం పరాశర బ్రమ్మరుషి గోత్రుంస్థైన పోచా మల్లయ కొమారుండైన కొమారస్వామి వ్రాశిన విక్రమార్కుని కథ సంపూర్ణం".

## No 1182. విష్ణుభక్త చరిత్రము.

## VISṆUBHAKTA CARITRAMU.

Substance, palm-leaf. Size, 17½ × 1⅝ inches. Pages, 188 Lines, 6 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes

Complete.

A poem in Dvipada metre narrating the stories of Ālvārs and other devotees of Visnu The author Cakrapuri Rāghavācārya has dedicated this work to God Nrsimha worshipped at Ghatikācalaksētra. It is stated that he also composed Nalacaritra in Dvipada metre.

**Beginning**:

శ్రీకమలాధారు జిరకీర్తిహారు
పాకారిపుశిక్షుఁ బద్మపత్రాక్షు
భూరికృపాలోలుఁ బుణ్యసంశీలు
మారారినుతరూపు మహితప్రతాపు

* * * *

ఘనరూపసంకాశు ఘటికాచలేశు
సేవించి పూజించి చెలఁగి కీర్తించి
శ్రీవనితాదేవి సిరులపూతావి

* * * *

అలరు బంగరుబొమ్మ నమృతవల్లమ్మ
నాతతభక్తితో నర్చించి మ్రొక్కి
భూతిమించిన భూతపురికిహారుండు
ఆసూరిగురు కేశవాచార్యసుతుండు
భాసురరూప ప్రభావిశేషితుండు
కాషాయవస్త్ర సంకలితధారుండు
శేషత్వచరమ విశేషాన్వితుండు
తామసభయద త్రిదండహస్తుండు
కామాదిదోష భీకరమంత్రవాది
పాషండమదగర్వ భావభంజనుండు
దూషకజనవాది ధూమకేతుండు

* * * *

సోమాన రర భాసుర తేజుఁడైన
రామానుజుని నంతరంగమందునిచి

* * * *

వాధూలగోత్ర పావనపుణ్యమూర్తి
సాధుసజ్జన పారిజాతభూజంబు

* * * *

సిరులొందఁ గందాళ సింహాసనస్థుఁ
డరయంగఁ గులగురుండగు దేశికార్యుఁ
డతికృపాంబుధి యప్పళాచార్యసుతుఁడు

* * * *

నగు మాకులస్వామి నర్చించి మొక్కి

* * * *

వలనొప్ప ఘుటికాద్రి వాసుఁడైనట్టి
నళినాక్షుఁ డోంకార నారసింహునికి
వెలయ సంకితముగా ద్విపదరూపమున
బలువైన శ్రీవిష్ణు భక్తచరిత్ర
విరచింతు నానేర్చువిధమెల్లఁ దెలియ
కరమొప్ప తత్కథా క్రమ మెట్టిదనిన.

**End:**

అని శౌనకాదుల కతిభక్తితోడ
వనజోదరుని భక్తవరుఁడైన యట్టి
మునివరేణ్యుఁడు సూతముని సెప్పెననుచు
ఘనకృపాపరుఁడైన కందాళదొడ్డ
యాచార్యునకు శిష్యుఁడైనట్టి వైష్ణ
వాచారమునఁ బూజ్యుఁడైనట్టివాఁడు
పొలుపుమీఱిన చక్రపురిదొడ్డఘనుఁడు
ఎలమి నగ్రతనూజుఁ డీరంగయార్యుఁ
డాతనిసోదరుం డతికృపాశీలుఁ
డాతత తిరువేంగళార్యుఁ డాఘనుని
కనురక్తితనయుఁడనై ధరాస్థలిని
అనువొంద రాఘవాహ్వయుఁ డనువాఁడు
పరమపావనుల సప్తమునీంద్రవరుల

* * * *

పలుదెఱంగుల నాంధ్రభాషమై వెలయ
బలువైన శ్రీవిష్ణు భక్తచరిత్ర
గరిమ మీఱఁగ నలంకారవైఖరుల

*　　　*　　　*　　　*

తలఁచి చెప్పితిని నుత్తరభాగమేమి
పుడమిలోపలను నీపుణ్యచరిత్ర
విడువక చదివిన వినిన వ్రాసినను

*　　　*　　　*　　　*

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు నధికముగాఁ గలవు.

పూర్వోత్తర భాగములని విభాగముగల యీ నీగసద్విపద ప్రబంధమున ఆళ్వార్లు మొదలగు విష్ణుభక్తుల చరిత్రలు వర్ణితములయినవి. కర్త చక్రపురి రాఘవాచార్యుఁడు. ఘటికాచల నృసింహస్వామి కీకృతి సమర్పింపఁబడినది. ఈకవి నలచరిత్రనుగూడ ద్విపదగా రచియించెను.

---

## No. 1183. శృంగార విషయము.
## ŚṚṄGĀRA VIṢAYAMU.

**Substance, palm-leaf. Size, 15¼ × 1½ inches. Pages, 12. Lines, 4 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.**

Incomplete and imperfect.

A love message . ent through her maid servant, by a lady pining from the separation of her lover.

**Beginning :**

. . . నచ్చెలువుని యురము
కరితుండములు భవ్యకవ్యకాండములు
పవిచందములు వాని బాహుదండములు
అటువంటి సౌందర్యమతనిచాతుర్య
మటువంటిగాంభీర్య మవనిలోఁ గలదె
ఆమహారాజేంద్రు నాకాంతిచంద్రు
ఘామంజుగుణసాంద్రు నాకారచంద్రు

నెంతని వర్ణింతు నేమని యెంతు
కాంతరోమేలింత కన్పడినంత
విచుపింతు నొకకొంత వినుము సుస్వాంత
ఘనపాదరజమెంత తడుసోకెనంత
ఘనలీల నొకకాంతఁ గావించెఁ జెంత

**End:**

తేజంబుదళ్కొత్త తేజిపైనెక్కి
రాజమార్గంబున రంజిల్లువేడ్క
స్వారిగానేతేర సరసతమీఱ
నారీశిరోమణి నాళీకపాణి
సరసిజవదనభాస్వత్కుందరదన
వరరదచ్ఛదన లావణ్యైకసదన
మరువంపు . . . . ఘమము

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

విరహార్తయగు నొక (స్త్రీ) చెటిచేఁ దనవనటను నాయకునకుఁ దెలియఁజెప్పుటయుండుఁగలదు ఇది యొక రామాయణ గ్రంథములోని భాగమయియుండును.

గ్రంథాదిని విష్ణుస్తుతిసీసములు రెండున్నవి.

---

## No. 1184. సానంద చరిత్ర.

## SĀNANDA CARITRA

Substance, paper. Size, 8 × 6¼ inches Pages, 262. Lines, 13 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes. The variations in reading are interlined throughout the MS.

Complete.

Similar to the work described under No 866 ante.

The author Bhadrakavi Liṅgadhīra. son of Amalāmba, and Rāmaprabhu lived in a village called Arunādrimaṅgala near Tiruvaṇṇāmalai. He was the pupil of Sangamēśvara guru of Kāḷahasti Kṣētra and dedicated this work to Vīrabhadraya, son of Saṅgayadēva.

**Beginning :**

ద్విపద॥ శ్రీకరాకారు నాశ్రితజనాధారు
నాకాదిభువనేశు నమితలోకేశు
వాసుకిగ్రైవేయు వామార్ధకాయు
భాసుర సిత(చిర)కీర్తి పరతత్త్వమూర్తి

* * * *

పరమనిర్మలమనః పద్మంబున దుఁ
జిరమనోరథములు సిద్ధింపఁగొలిచి

* * * *

భద్రకాళీమనః పంకజమిత్రు
భద్రంబుగాఁ వీరభద్రేశుఁగొలిచి
చిరభవాంబుజహస్తి శ్రీకాళహస్తి
గురుసంగమేశ్వరుఁ గొనియాడిపాడి
దండితపుష్ప కోదండ ఖక్రముల
దండిగాఁ ఖండితత్రయముఁ గీర్తించి
సకలవేదపురాణ శాస్త్రేతిహాస
నికరార్థములఁ బ్రమాణించి సద్భక్తి
శ్రీమతి నుద్ధరించిన పాలకురికి
సోమనారాధ్యుల సొంపుతోఁ గొలిచి
రంగద్విశాలాంత రంగమధ్యమున

* * * *

రంగ(నాథుని)ధాముఁనిఁ గవిరాజన్యుఁదలఁచి
అసమానచరితుఁ బ్రత్యక్షకళ్యాణు
బసుకేశుఁబిడుపర్తి బసువేశుఁదలఁచి
శంకరదాసయ్య చరణ పద్మములు
సంకల్పసిద్ధిగా సన్నుతిచేసి
దేవరదాసయ్య దివ్యచారిత్ర
భావంబు నందు సంభావించి కొలిచి
చకరనిపద్మలోచను మాయలకును
జికరనిజలింగ చికరసిఁ గొల్చి
కిన్నరబ్రహ్మయ్యఁ గీర్తించిమించి
కన్నడబ్రహ్మయ్య కనిమదిగొల్చి

మడివాలు మాచయ్యమహిమవర్ణించి
అడవదరేచయ్య నభినుతిచేసి
ఘనుఁబురాతన గణములఁ గొల్చి
వినుతనూతనభక్త వితతిఁ బూజించి
జంగమకులవార్ధి చంద్రోదయుండు
లింగైకనిష్ఠావిలీనమానసుఁడు

*　　　*　　　*　　　*

వాసనగలపుణ్య వర్తనుం డనఁగ
భాసిల్లురామయ ప్రభువరేణ్యుండు
తనసుపాతివ్రత్య ధర్మమార్గమున
ననసూయ కెనయైన యమలాంబవలనఁ
గనినపుత్రుఁడు భద్రకవిలింగవిభుఁడు
వినుతభాసురకావ్య విద్యాధికుండు
సుకవీంద్ర లోక సంస్తూయమానముగ
నొకపుణ్యకృతి సేయ నున్నయత్తఱిని
అరుదొందశోణాద్రి కటనుత్తరమున
నరుణాద్రి మంగళం బనుపురంబునను

*　　　*　　　*　　　*

శ్రీరుద్రగణమూర్తి శివయోగి చెన్న
వీరభద్రేశ్వర విమలసద్గురుఁడు
మన్నింపనిజశిష్య మండలిలోన
సన్నుతికెక్కిన సత్యసంధుండు
అంగ గుణాతీతుఁడగు శివయోగి
సంగయదేవర సత్కుమారుండు
కలఁడు జంగమరూప కనకశైలంబు
విలసిల్లుశివయోగి వీరభద్రయ్య
ఆశివయోగికి ననుఁగుసోదరుఁడు
పాశముక్తి జ్ఞానపారాయణుండు

*　　　*　　　*　　　*

జితతనుత్రయుఁడు రాజితశివయోగ
రతుఁడుమహాంతయ్య రసికశేఖరుఁడు

*　　　*　　　*　　　*

ముదముతో నట్టి తమ్ముఁడుఁ దానుభక్తి
వదలక మహిమతో వర్తింపుచుండు
తనయింట నొక మహోత్సవవేళయందు
ఘన మహేశ్వరపూజ గావించి పిదప
సహజన్ముఁడును దాను శంకరభక్తి
సహితులై శివకథా సద్గోష్ఠినుండి
అనుపమ గుణధన్యుఁడగు మహాంతయ్యఁ
గనుఁగొని సంతోష కలితుఁడై పలికె
చరితార్థ సానందసమ్మ నీశ్వరుని
చరితంబు వినఁగ నాశ్చర్యమైయుండు
తెలుఁగున నాకథ ద్విపద గావింపఁ
గలకవీశ్వరుఁ డెందుఁ గల్గునో యనిన
భాసుర వినయసంపద సొంపుమెఱయ
నా సహోదరరత్న మన్న కిట్లనియె

*  *  *  *

కలఁడు జంగమపాద కమలసేవకుఁడు
విలసితగురుభక్తి విజ్ఞానధనుఁడు
రమణీయ శివకవి రాజన్యహృదయ
కమలమిత్రుఁడు భద్రకవిలింగవిభుఁడు
నెఱయ నాతనికంటె నేర్పరి గలఁడె
నెఱివెన్న చేఁబట్టి నెయ్యేలవెదక
కర్ణశోభితములౌ గాఁ గొన్ని కథలు
వర్ణించినాఁడు కావ్యప్రబంధముల

*  *  *  *

సతతంబు నివి సత్త సంతతులంద్రు
కృతకృత్య యిందులోఁ గృతి విశేషంబు
రప్పించి యతనిచే రమణ నీచరిత
చెప్పింపవలయు నీక్షితిమండలమున
అనినఁ దమ్ముని మాట లంగీకరించి
విని మమ్ము రప్పించి వేడ్క నిట్లనియె
అనఘాత్మ సానందుఁ డనుమహామౌని
ఘనపుణ్యచరితంబు కవులు గీర్తింప

వావిరి ద్విపదకావ్య ప్రబంధంబు
గావింపుమా పేరఁ గరమర్థిననుచు
శివయోగిరాయఁడా శ్రితరక్షకుండు
ప్రవిమలభూతి మత్ఫాలభాగమ్మున
ధరియించి కనకరత్న ప్రభాకలిత
వరభూషణాదులు వరుసతో నొసఁగి
ఘనసారతాంబూల గంధాక్షతములు
మునుకొని పాలించి ముదముఁతో ననుప
మనమున సంతోషమహిమశోభిల్ల
ఘనపుణ్యకృతి సేయఁగణఁగితి నేను

*　　　*　　　*　　　*

కమనీయజంగమాకార రుద్రునకు
విమలవిక్రమకళా వీరభద్రునకు
జగతిపై(కుజ)నైన వేశ్యాభుజంగునకు
నగణితజ్ఞానదయాంతరంగునకు
బంధునైశ్వర్య సౌభాగ్య సంపదలు
సంధిల్లునీకృతిస్వామికి ననుచు
నచలితప్రీతిసానంద చరిత్ర
రచియింతుఁ దత్కథారంభ మెట్లనిన.

**End:**

జ్ఞానప్రసూనవిజ్ఞానప్రదీప
శ్రీనిధియగు స్వస్తిశ్రీ కాళహస్తి
పురవాసుఁడైనట్టి భూతేశుపాద
సరసిజమకరంద సచ్చిదానంద
భ్రమరమై తగుళ్లపల్లి లింగార్యుఁ?
డమర వ్రాయింపఁజెల్వలరినయట్టి
యీ పుణ్య చారిత్ర మెవ్వరు వినిన
నేపారఁజదివిన నెలమి వ్రాసినను

*　　　*　　　*　　　*

మహిమశోభిల్లు నీ మహిమీఁదగంధ
వహమిత్రమిత్రజైవాతృకనేత్రుఁ
డగు శంభు కృపచేత ననిచెప్పె సూతుఁ
డాగిశౌనకాదులకోడఁబడనిట్లు

**Colophon :**

అని శివజ్ఞానరత్నాకల్పుపేర
పరిహృతాంతర్గత ప్రతిపీఠపేర

*　　　*　　　*　　　*

శ్రీరుద్రసంకాశ శివయోగి చెన్న
వీరసద్గురురాయ విమలపదాంబు
జాతగంధవిలోలషట్పదు పేర
నాతతగుణ ధన్యుఁ డగు శివయోగి
వీరేశ్వరుని పేర విశదకరాబ్జ
శారద కర్పూర సమకీర్తి పేర
నిది వీరభద్ర శ్రీహేలాప్రసాద
సదమలసత్కావ్య సందర్భకుశల
చిరపుణ్యశోభిత శ్రీకాళహస్తి
గురుసంగమేశ్వరకోమలచరణ
జలజాతగంధిపుష్పంధయమాన
కలితమానసభద్ర కవిలింగధీర
విరచితసానందవిమల చారిత్ర
మరుదైనభవలతాయతలవిత్రంబు
సకల పవిత్ర మీ సత్కథయందు
నకలంకగతిఁ దృతీయాశ్వాసమయ్యె

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. పాఠభేదములు బంతుల నడుమఁ జేర్పఁబడి నవి.

ఇది డి నె 866 రున వర్ణితమైనకథ గలదే. కథాకల్పనాదులలో నీ రెండు రచనలకును జాల సాదృశ్యము గలదు. భద్రకవిలింగ ధీరుఁ డను జంగముదేవర యీ గ్రంథమునకుఁ గర్త. అమలాంబా, రామప్రభు లకితఁడు కొడుకు. కాళహస్తి వాస్తవ్యుఁడైన సంగమేశ్వరగురుని కితఁడు శిష్యుఁడు. అరుణాచలమున కుత్తరమున నున్న అరుణాద్రిమంగళమను గ్రామమున నున్నవాఁడును, సంగయదేవర కొడుకు నగు వీరభద్రయ్య యను జంగముదేవర కీ గ్రంథ మంకితముసేయఁబడినది.

## No. 1185. సానంద చరిత్ర.

## SĀNANDA CARITRA.

Substance, palm-leaf. Size, 14 × 1¼ inches Pages, 124. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes.

Complete, but imperfect.

Same work as the above.

(ఇ-ఇ.)—

అసమగ్రము వ్రాంత మంచిది తప్పు లెక్కువ. శైథిల్యము. గ్రంథ పాతములు చాల హెచ్చు. పత్ర సంఖ్య సరిగా లేదు. పెక్కు పత్రములు పోయినవి.

పూర్వము వలె.

---

## No. 1186. సానంద చరిత్ర.

## SĀNANDA CARITRA.

Substance, paper. Size, 12⅜ × 8 inches. Pages, 40. Lines, 20 on a page. Character, Telugu. Condition, injured. Appearance, new. Mode of writing, good but full of mistakes.

Begins on fol 3 1*a* The other work herein is Palnātivīracaritra 1*a*. Contains a small portion in the first Āśvāsa.

Same work as the above

(ఇ-ఇ.) —

అసమగ్రము. ప్రథమాశ్వాసములోని కొంతభాగముమాత్రము గలదు. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె

ఇందు ఇతర గ్రంథమున్నది.

1- . పల్నాటివీరచరిత్ర.

---

## No. 1187 సానంద చరిత్ర.

## SĀNANDA CARITRA

Substance, palm-leaf. Size, 2¼ × 12⅜ inches. Pages, 120. Lines, 6 on a page Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Breaks off in many places.

Incomplete and imperfect.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము చాల హెచ్చు. ఎన్నో ఆకులు పోయినవి. తునిఁగిపోయినవి. గ్రంథ పాతములును జాల హెచ్చు. వీనిచే నీ పుస్తకము నిరుపయోగ మనఁదగును.

పూర్వమువోలె.

---

## No. 1188. సానందచరిత్ర.
## SĀNANDACARITRA.

Substance, palm-leaf. Size, 17¼ × 1⅝ inches. Pages, 102. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good, contains mistakes. Breaks off in many places.

Wants a small portion in the end, otherwise complete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. తుదఁగొంచెము కొఱఁత. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగాఁగలవు.

పూర్వమువోలె.

---

## No. 1189. సానందచరిత్ర.
## SĀNANDACARITRA.

Substance, palm-leaf. Size, 15½ × 1¼ inches. Pages, 169. Lines, 4 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes. Breaks off in many places.

Complete but imperfect

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యమ త్యధికము. గ్రంథపాతములు కడు హెచ్చు. వీనిచే నీ పుస్తకము నిరూపయోగముగ నున్నది.

పూర్వమువోలె.

## No. 1190. సానంద చరిత్ర.

## SĀNANDACARITRA.

Substance, palm-leaf. Size, 12⅝ × 1⅝ inches. Pages, 110. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. రెండవ యాశ్వాసము ఉండవలసిన పత్రములు 17 నుండి 28 దాఁకఁ బోయినవి. వ్రాఁత మంచిదే. తప్పు లెక్కువ. శైథిల్యము లేదు.

పూర్వమువోలె.

---

## No. 1191. సానంద చరిత్ర.

## SĀNANDACARITRA.

Substance, palm-leaf. Size, 14 × 1¼ inches. Pages, 115. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 1 a. The other works herein are Nācikētapurāṇamu 59 a, Śaṭhakōpavinnapamu 61 a.

Complete.

Same work as the above.

Date of transcription:—Wednesday, the full moon day corresponding to the second day of the solar month Āvani in the Year Prabhava. Name of the scribe:—Śēṣayya son of Muddayya, grandson of Kṛṣṇayya who was the son of Sōle Nāraṇayya.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు హెచ్చు.

పూర్వమువోలె.

గ్రంథాంతమున నీ వ్రాఁతగలదు.

"ప్రభవనామ సంవత్సరం ఆవణి నెల ౨ వ తేది పౌర్ణమి బుధ వారంనాడు ఉత్తరాభాద్రా నక్షత్రమందు యీ శుభదినమందు సోలె

నారణయ్య కుమారుడు కృష్ణయ్య కొడుకు మద్దయ్య కుమారుడు వ్రాశిన సానంద గణేశ్వరుని చరిత్రం సంపూర్ణం. శేషయ్య చైత్రాలు—"

ఇంకీ యితర గ్రంథములు గలవు :—

59-a నాచికేత పురాణము. 61-a శతకోప విన్నపము.

---

## No 1192. సానంద చరిత్ర.

## SĀNANDACARITRA.

Substance, palm-leaf. Size, 14½ × 1⅛ inches. Pages, 126. Lines, 7 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old Mode of writing, fair but full of mistakes.

Complete but very imperfect.

Same work as the above.

(బి-బి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లెక్కువ. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమునట్టె.

---

## No. 1193. సారంగధర చరిత్ర.

## SĀRAṄGADHARACARITRA.

Substance, paper. Size, 7⅝ × 6¼ inches. Pages, 164. Lines, 17 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Similar to the work described under D. No. 873 ante.

The author Bāṇāla Sambhudāsakavi was the son of Nāgāmba and Appaya of Gautama gōtra and belonged to Viśvakarma sect. For other particulars see the extracts given below. The following note appears at the beginning of the work :—

" The adventures of Prince Sarangadhara a popular Telugu Romance. A new Edition carefully revised and corrected. Prepared in the year 1827—The story in this poem closely resembles that of Phodra and Hippolitus—or that of Crispus son of the Emperor Constantine—or that

of Antheos and Cleoboa (Brunk 1 Anthol 419 V). In Byrons **Parisina** verse 255 is a similar tale. And the oldest is the one of **Joseph and Patippar's wife.**"

**Beginning:**

ద్విపద. శ్రీశైలవాసుని శివునిఁ దలంచి
కేశవు వైకుంఠ గేహునిఁ గొలిచి

*　　　*　　　*　　　*

వాలాయముగ బూదవాడనివాసు
నీలకంఠుని సేవ నిరతంబుఁ జేతు
శాశ్వతంబుగభూమి చక్రంబునందు
విశ్వకర్మాకృతి విజ్ఞానమూర్తి
తలఁపఁగా మేటి గౌతమ గోత్రజులకు
వలనొప్పుబాణాల వంశాబ్ధిచంద్రుఁ
డననొప్పు గురుమూర్తి యాతనితనయుఁ
డనఘుఁడౌ నయ్యప్పయను పుణ్యశాలి
యతనికిఁగులసతి యైననాగాంబ
పతిహితయట్టి దంపతులకిద్దరికి
శంభునివరమున జనియించినాఁడ
శంభునామకుఁడ సజ్జనమనోహరుఁడఁ
బరమాత్ముఁడగుకొండ పల్లిగోపాలు
వరలబ్ధమునఁగవిత్వ ప్రౌఢి మెఱసి
తగుభంగి సారంగధరుని చరిత్ర
జగములో ద్విపదగా సమకూర్తువినుఁడి
సంతత ఘనకీర్తి చంద్రవంశమున
శంతనుఁడను శౌర్యశాలి జన్మించె
నసమానగుణశాలి యగుశంతనునకు
వెసరాణ్మణి విచిత్రవీర్యుండు పుట్టె
నతనికిఁ బాండురా జను మేటి నృపతి
సుతుఁడయ్యె నతని కర్జునుఁడుద్భవించె
నలయర్జునునిసూనుఁ డభిమన్యుఁడమరఁ
జెలఁగి వానికిఁ బరీక్షిత్తు జన్మించె
నియతాత్ముఁడైనయా నృపశిరోమణికి
జయశాలియై పుట్టె జనమేజయుండు

గణుతింపనతనికిఁ గలిగెమహోగ్ర
రణజయుండై రాజరాజనరేంద్రుఁ
డేకచక్రంబుగా నిల నేలె నతఁడు

* * * *

నాజనాధిపుదేవి యయ్యె రత్నాంగి
ముకరంటి వరమునఁ బుట్టె వారలకుఁ
జకరాని పుత్రుండు సారంగధరుఁడు

**End:**

సదయుఁడై యాతని సామర్థ్యమునకు
మది నుబ్బి రాజ కుమారక నీదు
పుణ్యంబు సత్కీర్తి పూర్ణమై భువిని
గణ్యమౌ నెచ్చోటఁ గలకాల మిచట
నీసరివారు మన్నింపఁగాఁ గృత్తి
వాసుని దయనీవు వసియింపు మనిన
సిద్ధుఁడై యాగురుశేఖరునొద్ద
బుద్ధిమంతుండనఁ బొలుపొందుచుండె
నలమీననాథుండు నతనుకేతనుఁడు
నలచిఘుణికుఁడు (?) విరూపాక్ష సారంగి
నాగార్జునులు మేఘ నాథగోరక్ష
యోగీశ్వరులు శివయోగితో నిట్లు
నవనాథ శిద్ధు లనంగఁ బ్రసిద్ధి
నవని శోభిలి సిద్ధులైరి వేర్వేఱ
ధరణిలో సారంగధరు చరితంబు
కర మనురక్త్యుక్తి గలచేమకూర
యప్పనచెప్పిన యాప్రకారమున
నొప్పగాఁ జెప్పితి నుర్వి బాణాల
సరసాన్వయభవుండ శంభునామకుఁడ
విరచించితి జగ న్నివేశార్పణముగ
నిది ముదంబున లిఖియించిన వినిన
జదివినవారికి సకలసంపదల
జయసమాఖ్యల సుమాసహితుఁ డీశివుఁడు
దయసేయు నాచంద్ర తారార్కముగను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఈ గ్రంథము డి. నె 873 రున వర్ణితమైన గ్రంథములోని కథగలదే. గ్రంథకర్త విశ్వకర్మ వంశ్యుఁడు, గౌతమగోత్రుఁడు, నాగాంబకు అయ్యప్పకుఁ గొడుకు, బూదవాడ నీలకంఠేశ్వరస్వామి భక్తుఁడునగు బాణాల శంభుదాస కవి. కొండపల్లి గోపాలస్వామినిగూడ నీతఁడు స్తుతించినాఁడు. చేమకూర అప్పనకవి చెప్పిన గ్రంథము ననుసరించి తానీ గ్రంథమును రచించినట్లు గ్రంథకర్త చెప్పుకొన్నాఁడు. చేమకూర వెంకటరాజ కవి రచించిన సారంగధరచరిత్ర గలదుగాని, అప్పనకవి కృతి గానరాదు. వెంకటరాజకవి కృతికిని, ఈ కృతికిని గథలోఁ గొన్ని భేదములున్నవి. ఈ రచనమునకే యితర ప్రతులనుబట్టి చూడఁగా బహు పాఠ భేదములే కాక కథాంశభేదములును గానవచ్చుచున్నవి.

---

## No. 1194. సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA.

Substance, palm-leaf. Size, $11\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches. Pages, 112. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Wants a small portion in the end, otherwise complete.

Same work as the above.

(వి-వి.)—

తుదిపట్టు కొంచెము మాత్రము కొఱఁతగా గ్రంథమెల్ల గలదు. వ్రాంత మంచిది. తప్పు లెక్కువ. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

---

## No. 1195. సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA

Substance, paper. Size, $12\frac{1}{4} \times 8$ inches. Pages, 139. Lines, 19 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. The variations in the readings are interlined.

Begins on fol. 144 a. The other works herein are :—Śukasaptatikathalu 1 a, Dilārāmukatha 41 a, Śukasaptati 36 a, Kucēlopākhyānamu 97 a, Gurubōdha 225 a, Vedāntavārtīkamu 261 a.

Wants a small portion in the end, otherwise complete.

Same work as the above.

The following note in the hand of C. P. Brown appears at the beginning of the work :—

" Saranga Dhara Dwipada
New Edition.—1840."

" Founded on manuscripts recently obtained. The text is here given according to the edition prepared in 1827—The new Readings are interlined. Upon this the new Edition of 1840 was founded."

(వి-వి )—

సమగ్రము వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. పాఠ భేదములు బంతుల నడుమను ప్రక్కలను జేర్పఁబడినవి. పెద్ద పెద్ద యధిక పాఠములు 13 పుటలలో గ్రంథాంతమునఁ జేర్పఁబడినవి. శైథిల్యము, గ్రంథ పాతములు లేవు.

పూర్వమువలె.

ఇందీ యితర గ్రంథములు గలవు :—

I a శుకసప్తతి కథలు (వచనము) 41 a దిలారాముకథ, 36 a శుకసప్తతి (వచనము) 97 a కుచేలోపాఖ్యానము, 226 a గురుబోధ, 261 వేదాంతవార్తికము.

---

## No. 1196. సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA.

Substance, palm-leaf. Size, 12⅝ × 1⅜ inches. Pages, 135. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Mode of writing, good but full of mistakes.

Complete.

Same work as the above.

Date of transcription.—Sunday the fifth day of the dark fortnight of the lunar month Kārttika in the year Vijaya. Name of the scribe :— Paraṅgi Bābayya.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పు లెక్కువ. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

అయినను పాఠభేదములు, కథాంశ భేదములు గూడఁ గలవు.

గ్రంథాంతమున నీ వ్రాఁత గలదు :—

"విజయనామ సంవత్సర కార్తిక బ॥ ౫ ఆదిత్యవారం రోజుకు శ్రీభద్రకాళి సమేతా ఉప్మాంగల రామలింగార్పణంగా పరంగి బాబయ్య సారంగధరచరిత్ర సంపూర్ణంగా వ్రాసి సమర్పించెను."

---

## No. 1197. సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA

Substance, palm-leaf Size, 13⅝ × 1¼ inches. Pages, 133. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete.

Same work as the above

Date of transcription :—Sunday the tenth day of the bright fortnight of the lunar month Vaiśākha in the year Vikrti. Name of the scribe :—Sarvēsaliṅgam who copied from a Ms. at Pulicēri

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కంగా నున్నది. తప్పులు పెకురులు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దిట్లు గలదు:—

"వికృతినామ సం॥ వైశాఖ శు॥ ౧౦ లు ఆదివారం పులిచేరిలో ప్రతిలాచి మాజేటి సర్వేశలింగం వ్రాసుకొనెనూ."

---

## No 1198. సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA

Substance, paper. Size, 11¾ × 8 inches. Pages, 44. Lines, 24 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Begins on fol. 255 a. The other works herein are Dasāvatāracaritra 1 a, Mollarāmāyanamu 63 a, Bālabhāgavatamu 126 a, Balarāmacaritra (Prabandharājasirōbhūsanamu) 173 b, Sāmbavilāsamu 229 a, Guruparampara 280 a, Niyamanappadi 288 b, Gurunambicaritra 301, Lingadhāraṇaviṣayamu 419 a, Sugrīvavijayamu 325 a, Guruparamparāstōtra 280 a.

Complete.

**Same work as the above.**

The following note appears at the end of the work:—

"I am not acquainted with Telugu, but my Canarese Moonshee by whom the above copy was made assures me that it is correct and he understands Telugu and has taken some trouble, as he says, in examining and correcting the original. I have no doubt the above can be depended on—

Bangalore, 1st December 1841.

BENG RICE,
Missionary London
Missionary Socy.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత కన్నడపు మోడిగలది. తప్పు లెక్కువ. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువ్రాఁత.

ఇంకీ యితర గ్రంథము లున్నవి :—

1*a* దశావతారచరిత్ర, 63*a* మొల్లరామాయణము, 126*a* బాలభాగవతము, 173*b* బలరామచరిత్ర (ప్రబంధరాజ శిరోభూషణము), 229*a* సాంబవిలాసము, 280*a* గురుపరంపర, 288*b* నియమనప్పడి, 301 గురుసంబిచరిత్ర (యక్షగానము), 319*a* లింగధారణవిషయ చర్చ, 325*a* సుగ్రీవవిజయము (యక్షగానము), 280*a* గురుపరంపరాస్తోత్రమ్.

---

## No. 1199 (*a*). సారంగధరచరిత్ర.
## SĀRAṄGADHARACARITRA.

**Substance**, palm-leaf. Size, $15\frac{5}{8} \times 1\frac{1}{2}$ inches. Pages, 60. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old Mode of writing, good but full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొక తరబడిగా నున్నది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువ్రాఁత.

## No 1199 (*b*). సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA.

Substance, palm-leaf. Size, 10¾ × 1¼ inches. Pages, 14. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Incomplete.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

---

## No. 1200. సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA.

Substance, paper. Size, 12¾ × 8 inches. Pages, 136. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 108 *a*. The other works herein are: Totināmā (Kathalu) 1*a*. Sāmbasivavilāsamu 180*a*, Vēmanapadyamulu 195*a*

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత యొక మాదిరిగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఇందీ యితర గ్రంథము లున్నవి:—

1*a* తోతినామా (కథలు) 180*a* సాంబశివ విలాసము. (యక్షగానము), 195*a* వేమనపద్యములు.

---

## No. 1201. సారంగధరచరిత్ర.

## SĀRAṄGADHARACARITRA

Substance, paper. Size, 12 × 7¾ inches. Pages, 146. Lines, 19 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes

Begins on fol. 109*a*. The other works herein are: Vaijayantīvilāsamu 1*a*, Sōmavāramāhātmyamu 49*a*.

Complete.

Same work as the above.

The following note by C. P. Brown is found in the beginning of the work :—

" This poem, the Sarangadharacaritra, Dvipada, is merely a portion of the నవనాథచరిత్ర గౌరన చెప్పినది wherein the story is better told in a superior style: in the present volume it is much amplified and is less pleasing. Whole lines are borrowed from Gauranas poem నవనాథచరిత్ర without acknowledgment :—unless indeed that this name occurs in the last page of Sambhus poem—

*N.B.*—In the last page of the poem under notice, the author only acknowledges that he has compiled this in adaptation of Cēmakūra Appana's Sārangadharacaritra ; but does not at all mention anything about Gaurana or his poem.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఇ దీ యితర గ్రంథములు గలవు.

1*a*. వైజయంతి విలాసము, 49*a*. సోమవార మాహాత్మ్యము.

---

## No. 1202. సారంగధరచరిత్ర —సటీకము.

## SĀRAṄGADHARACARITRA : WITH COMMENTARY.

Substance, paper. Size, 9⅞ × 7⅝ inches. Pages, 398. Lines, 18 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. The variations in reading are interlined throughout the MS.

Begins on fol. 1*a*. The other work herein is Bhallāṇa caritra 209*a*.

Complete.

Same work as that described under No. 1203 ante which was transcribed from this MS.

Date of transcription :—Completed on 28th September 1843.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు. దీని వ్రాంత 1843 వ సంవత్సరము సెప్టంబరు 28 తేది నాంటికి ముగిసినది.

నె 1203 లున వర్ణితమగు దాని కిది మాతృక.
209$a$ భల్లాణచరిత్రమను కృత్యంతర మిందు గలదు.

---

No. **1203.** సారంగధరచరిత్ర—సటీకము.

SĀRAṄGADHARACARITRA—SAṬĪKAMU.

Substance, paper. Size, $9\frac{3}{8} \times 7\frac{5}{8}$ inches. Pages, 312. Lines, 22 in a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Begins on fol. 1$a$. The other work herein is Bhallāṇacaritra 161$a$. Complete.

A commentary on the Sāraṅgadharacaritra described under No. 1193 ante.

The name of the commentator is not given.

**Beginning :**

శ్రీశైలవాసుని శివునిఁదలంచి ॥ శ్రీశైలవాసుని। శ్రీగిరియందు నివాసము చేయుచున్నటువంటి । శివుని । పరమేశ్వరుణ్ని । తలంచి । స్మరించి ॥

కేశవు వైకుంఠగేహునిఁ గొలిచి ॥ వైకుంఠగేహుని । వైకుంఠమే గృహముగా గలిగినటువంటి । కేశవు । విష్ణువును । కొలిచి । సేవించి ॥

అజు సత్యలోకనాయకుఁ బ్రస్తుతించి ॥ సత్యలోకనాయకు । సత్యలోకమునకు ప్రభువైనటువంటి అజు । బ్రహ్మను । ప్రశంసించి । స్తుతించి ॥

గజముఖుశారదాకాంత నర్చించి ॥ గజముఖు । ఏనుగ ముఖము గల విఘ్నేశ్వరుణ్నిన్ని । శారదాకాంతను । సరస్వతీదేవినిన్ని । అర్చించి । పూజించి ॥

**End :**

ఇది ముదంబున లిఖియించిన వినిన ॥ ఇది । ఈ సారంగధర చరిత్రను । ముదంబున । సంతోషముచేతను । లిఖియించిన । వ్రాసినటు వంటిన్ని । వినిన । ఆలకించినటువంటిన్ని ॥

జదివిన వారికి సకలసంపదల ॥ చదివిన । పఠించినటువంటి । వారికి । వార్లకు । సకల సంపదల । సమస్తైశ్వర్యములనున్ను ॥

జయసమాఖ్యల నుమాసహితుఁడు శివుఁడు ॥ జయసమాఖ్యలను విజయకీర్తులను । ఉమాసహితుఁడు । పార్వతితో కూడుకున్నటువంటి శివుడు పరమేశ్వరుడు.

దయసేయు నాచంద్రతారార్కముగను । ఆ చంద్రతారార్కము గను అనగా శాశ్వతముగాను దయసేయును కృపజేసును.

(వి-వి.)—

సమగ్రము. ఏడు భాగములుగా విభజింపఁబడినది. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సారంగధర చరిత్ర ద్విపదకు (నె 1193 రు చూ) బ్రౌను దొరగా రెవరిచేతనో వ్రాయించిన టీక యిదియగును. దీని రచయిత పేరిందు లేదు.

ఇఁదీ గ్రంథాంతరము గలదు :—

161 a భల్లాణ చరిత్ర (ద్విపద).

---

## No. 1204. సారంగధర చరిత్ర.

## SĀRAṄGADHARA CARITRA

Substance, paper. Size, 11¾ × 7⅝ inches. Pages, 155 Lines, 9 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good, contains mistakes.

Complete.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 1205. సారంగధర చరిత్ర.

## SĀRAṄGADHARA CARITRA.

Substance, paper. Size, 9⅝ × 6⅝ inches. Pages, 195. Lines, 15 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begin on fol. 89*a* The other work herein is Kanyakāpurāṇamu 1*a*.

Complete.

Same work as in the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. "దిద్దిన ప్రతినిజూచి వ్రాసినది" అని కలదుగాని యిది నిర్దుష్టముగాదు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వకు వ్రాంతి.

ఇందు, 1 a కన్యకా పురాణము గలదు.

---

No. **1206.** సారంగధర చరిత్ర టీక.

SĀRAṄGADHARA CARITRA TĪKA.

Substance, paper. Size, 11½ × 7¼ inches. Pages, 98. Lines, 25 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes. Written on only one side of the paper.

Contains the commentary for 606 stanzas from the beginning of the work described under No. 1193 ante. The name of the commentator is not given.

**Beginning :**

శ్రీశైలవాసుని శ్రీశైలమే నివాసముగా కలిగినటువంటి శివుని సాంబశివుని తలంచి స్మరించి వైకుంఠగేహుని వైకుంఠమే నివాసముగా కలిగినటువంటి కేశవు శ్రీమహావిష్ణువును కొలిచి సేవించి సత్యలోకనాయకు సత్యలోకమునకు ప్రభువైనటువంటి అజు చతుర్ముఖబ్రహ్మను ప్రశంసించి స్తోత్రమును చేసి గజముఖు ఏనుగముఖముగల వినాయకునిన్ని శారదాకాంతను సరస్వతీదేవినిన్ని అర్చించి పూజించి. . . .

**End :**

గురుతులు నాల్గు అందుకు ఆనవాలు మొండెములు నాలుగున్ను కైకొనిరండటంచు తీసుకొనిరమ్మని ధరణీశ్వరుడుబలికి రాజు చెప్పి తర్వాత వ్రేలియుంగరంబు అటుపిమ్మట వ్రేలనుండే ముద్రికను ఆనవాలొసగిన గొనుచు గురుతు చూపించేటందుకు ఇస్తే తీసుకొని అంగంబులుపొంగ.

(వి-వి.)—

అసమగ్రము. ఇంచుమించుగా మొదటి 606 ద్విపదలకు వ్యాఖ్యానము గలదు. వ్రాంత మంచిది. పత్రమున కొకవైపుననే కలదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శంభుదాసుని ద్విపద సారంగధరచరిత్రమున కిది టీక. ఈ టీకను వాడుక భాషలో దాము వ్రాయించినట్లు బ్రౌనుదొరగారు వ్రాసిరి.

---

## No. 1207. సురాభాండేశ్వరము.

## SURĀBHĀṆḌĒŚVARAMU.

Substance, paper. Size, 9¾ × 7½ inches. Pages, 71. Lines, 19 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Complete.

Similar to the work described under No. 896 ante. The author Guravayya was the eldest son of Venkatanarasimhamu of Bādarāyana-gotra and belonged to Rāvulapuram. For other particulars see the extracts given below.

**Beginning :**

శ్రీగణనాథు నాశ్రితగణనాథు
నాగముగణనాథు నామరున్నాథు
నేమదిఁ గీర్తించి యొలమిఁబూజించి

*　　　*　　　*　　　*

రాముని సీతాభి రామునిఁ దలఁచి

*　　　*　　　*　　　*

కవితార్థధుర్యు వాగనుశాసనార్యుఁ
గవితావిరాజిఁ దిక్కనసోమయాజి
మొదలగు కవిరాట్సమూహంబుదలఁచి
పదపడి శ్రీగురు పదముల కెఱఁగి
లలిసురాభాండేశ్వ రంబును ద్విపదఁ
దెలుఁగుసేయఁగఁ గొంత తివిరియున్నంత

*　　　*　　　*　　　*

రాముఁడు సీతాభి రాముఁడు కరుణ
దామధి నెమ్మదిఁ దగనిట్టులనియెఁ

గలలోన వచ్చి నాకలలోనఁగల్గు
కళవళం బాపి నీకలవడఁబావ
నాయని కృతికి నేఁ డాయెఁగాతోడు
సేయఁగా నీచింత సేయఁగా నేల
పాలుపాండురావుల పురపౌరుషేయ
నలినారి వేంకట నరసింహ తనయ
అరయంగ బాదరాయణమునిగోత్ర
గురుతర సన్మిత్ర గురునామగోత్ర
సుకృతి నీకృతివేగ శోభితంబలరఁ
బ్రకృతంబు మదినెంచి బాగరచించి
మత్ప్రీతిగాఁజేయు మా ప్రీతిగాన
త్వత్ప్రసాదతను నిమ్మహానీయ చరిత
మనిననుఁగరపి తా నంతర్హితత్వ
మొనరిన మదిఁదోఁచియున్న చందమున
బాలుని వాక్కులు పరగ విన్నట్లు
లీల సత్కవులు నాలింతురుగాన

*          *          *          *

కుకవిస్వభావము లొక్కలఁడి పెట్టకను
ప్రకటంబుగా నేను పక్రమించితిని
బ్రమదంబుతో సురాభాండేశుకృతికిఁ
గ్రమమెట్లు . . . . .

**End:**

అని చెప్పి శివుఁడు గోవాయమును నెక్కి
తనవెంట దేవతాతతి నుతు లెసలఁగ
ఘనముగ శాంభవీగణ సమేతముగ
తన నిజ పుణ్యైకధామంబుకరిగె॥

**Colophon:**

అని కాశికాఖండమందొప్పియున్న
ఘనసురాభాండేశు కథయును ద్విపద
నల ఘుశ్రీబాదరాయణగోత్రవార్ధి
నళినారిరావులనగరాఖ్యపౌరు
షేయుండు వేంకటశ్రీ నరహరిసు

ధీయగ్రసుతుఁడు విధేయుండు . . .
అతి ప్రీతితో గురవయాఖ్యుండు ప్రీతి
వితతహృద్యంబుగా వేటుక రచించి
రహిమించు జానకీ రాముని పేర
నహిమాంశు పేరఁ గాత్యాయనీ దేవి
పతిపేర వేంకటపంచాస్యు పేర
నతిసదలంకారమతులితసరస
ముగఁ దోఁచినట్టు రాముని కృపావేశ
మగణితమైయొప్పునమర నీ చరిత
మెవ్వరు వ్రాసిన నెవరు చదివిన
నెవ్వరు విన్నను నెవరు విన్పింప
భాసురశ్రీపశుబహుధనధాన్య
శ్రీ సంపదలు గల్గి చెలఁగియుండుదురు
అవనినీకథ శివునాజ్ఞ సంతతముఁ
దవిలి వర్ధిల్లు నాతారార్కముగను॥

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత చక్కనిదే కాని తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది డి. నె 896 రున వర్ణితమైనదానిలోని కథ గలదే. కాని యిది యంతకంటెఁజాల నీరసము. ఇందించుమించుగా 220 ద్విపదల లోఁ గామశాస్త్ర విషయములు వివరింపఁబడినవి. రావులపురము గురవయ్య దీనికిఁగర్త. అతఁడు బాదరాయణగోత్రుఁడు వేఁకటనరసింహుని యగ్రసుతుఁడును. విశేషముల కుదాహృత గ్రంథ భాగములను జూచునది.

---

## No 1208. సురాభాండేశ్వరము.

## SURĀBHĀṆḌĒŚVARAMU.

Substance, palm-leaf. Size, 16 × 1⅜ inches. Pages, 26. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes. Breaks off in many places.

Complete.

Similar to the work described under 896 ante; the author Nāranamantri was the son of Ayyana of Puligaḍḍa.

**Beginning:**

శ్రీ పార్వతీనాథు శ్రీ విశ్వనాథు
శ్రీపాదములకు నేఁజేరి మ్రొక్కెదను
* * * *
పనివినియే సురాభాండేశ్వరంబు
వినుపింతు జగములో వినువారికెల్లఁ
బులిగడ్డవంశాబ్ధి పూర్ణచంద్రుఁడను
వెలయంగ నారనాభిఖ్య సత్కవిని
పరువొప్పనీ సురాభాండేశ్వరంబు
నిరవొందు శివకథ నీపుణ్యచరిత

**End:**

అనుచునంతర్ధానమయ్యె నీశ్వరుఁడు
ఎనసిన వేడ్కతో నీడిగెగాఁడు
పరగఁగానటు సురాభాండేశునకును
గరమొప్పఁగా గుడి గట్టించి యపుడు
నిత్యనైవేద్యంబు నిత్యభోగంబు
నత్యంత భక్తితో నభవున కొసఁగె

**Colophon:**

పులిగడ్డయయ్యన పుత్రుఁడైనట్టి
కలితంపు కవినొప్పు కవినార మంత్రి
కాశీ మహాత్మ్యపుఁగథయెవ్వరైన
వ్రాసిన విన్నను వడిఁజదివినను
విశ్వనాథుండిచ్చు విభవ సంపదలు
శాశ్వతంబుగ ధాత్రిజనకోటికెల్ల

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే కాని తప్పులు హెచ్చు. శైథిల్యము లేదుగాని గ్రంథపాతము లెక్కువగా నున్నవి.

ఇది పూర్వ వర్ణిత గ్రంథమును బోలిన వేఱొక రచనము. ఆ కథ అదే. పులిగడ్డయయ్యన్న కొడుకగు నారనమంత్రి దీనికిఁ గర్త.

## No 1209. హరిశ్చంద్రచరిత్ర.

## HARIŚCANDRACARITRA.

Substance, paper. Size, $11\frac{3}{8} \times 8\frac{1}{4}$ inches. Pages, 245. Lines, 23 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. The variations in reading are interlined.

Begins fol. 1*a*. The other works here in are :—Cikitsāsārasaṅgrahamu 124*a*. Dūtādhyāyamu 142*a* Vaidyāyogasangrahamu ; Vēmana padyamulu 274. Venkataramanaśatakamu 332.

Wants the colophon of the first Part and the introductory portion of the second Part ; otherwise complete.

A poem in the Dvipada metre describing the story of the well-known king Hariścandra as found in the Sanskrit Skāndapurāna. Śaṅkarakavi and Vīraśarabhakavi wrote their works after the model of this poem. The author Gaurana was the son of Pōcāmba and Ellamantri of Gautamagōtra. For other particulars see the extracts given below.

**Beginning :**

శ్రీగిరిజాధీశు శ్రీగిరినాథు
నాగచర్మాంబరు నాగకేయూరు

* * * *

మల్లికాకర్పూర మాలికాయశుని
మల్లికార్జునదేవు మహితప్రభావు
మాపాలనేపట్ల మమ్మేలువేల్పుఁ
బాపాళిఁబాప సద్భక్తిఁబూజించి

* * * *

కడునొప్పుభ్రమరాంబికామహాశక్తిఁ
దడయకవరములు దయసేయఁగొలిచి

* * * *

చెలఁగిఋగ్వేద ప్రసిద్ధుఁడైజగతి
వెలయుహరిశ్చంద్ర విభుపుణ్యచరితఁ
గవితాచమత్కృతి గాంచి హర్షించి
కవులందఱును శిరః కంపంబుసేయఁ
బచరించి వీనుల పండువుగాఁగ
రచియింతు మతుల క్రమమెట్టిదనిన
సింగనమాధవక్షితి పాలమణికి

మంగళమూర్తికి మంత్రియైజగతిఁ
బొగడొందుపెద్దన పోతరాజునకుఁ
దగినతమ్ముఁడు యశోధనుఁడెల్లమంత్రిఁ
జెట్టువట్టంగ నోఁచినభాగ్యవతికిఁ
జుట్టాలసురభికి సుందరీమణికి
ఘనుఁడు వల్లభమంత్రి గంగాంబగోరి
కనినపోచాంబకు గారాబుసుతుఁడ
ధరణి సమాత్యరత్నంబనఁబరగు
ధరణిమంత్రికిఁ గూర్మితమ్ముఁడ ఘనుఁడ
భూతనాయకపాద పూజాభిరతుఁడ
గౌతమగోత్రుండ గౌరనాహ్వయుఁడ
సరససాహిత్యలక్షణ చక్రవర్తి
బిరుదవిఖ్యాతిచేఁ బెంపొందువాఁడ
శ్రీకరంబుగ నే రచింపఁగఁగోరు
నాకథావృత్తాంత మది యెట్టిదనినఁ

**End:**

ఒనరఁజేతులు మోడ్చి యోహరిశ్చంద్ర
దినకరవంశ ప్రదీపక నీకుఁ
బ్రతిచేసికొనియాడ రాజులు గలరె
సతతసత్యవ్రతా చారసంపదలఁ
దొడరి వసిష్ఠునితో రాయిడించి
తడయక తనఘోర తపము పెంపునను
బడయ దుర్లభమైన బ్రహ్మఋషిత్వ
మడరంగఁగైకొని యఖిలలోకములఁ
బొగడొందుకౌశిక మునివెఱగంద
నెగడించి మించితి నీసత్యమహిమ
వసుమతీవల్లభ వన్నెరెట్టించె
నెగడె నీకతమున నీవంశమెల్ల
సన్నుతంబైన నీసామ్రాజ్యలక్ష్మిఁ
బన్నుగాఁగైకొని ప్రజలఁబాలింప
విచ్చేయుమా యని విన్నవించుటయు
నచ్చుగాఁ దరహాస మల్లననొలయ

*　　*　　*　　*

పురము ప్రవేశించి భూప్రజలెల్లఁ
బరువడిజయపెట్టఁ బార్థివేశ్వరుఁడు
వసుమతినిజరాజ్య వైభవలీల
యొసఁగంగఁజిరకాల మేలుచునుండెఁ

**Colophon:**

అనుచు మార్కండేయుఁ డాధర్మజునకుఁ
బెనుపొంద మున్ను చెప్పిన మార్గమునను
సత్యసంధుఁడు హరిశ్చంద్రుని చరిత
నిత్యసత్కీర్తులు నెగడ రచించె
భ్రమరాప్రసాద సంప్రాప్తకవిత్వ
సుమహితసామ్రాజ్య సుఖవరాయణుఁడు
చతురసాహిత్య లక్షణచక్రవర్తి
ప్రతివాదిమదగజ పంచాననుండు
మతిమంతుఁడెల్లన (డయ్యల) మంత్రిపుంగవుని
సుతుఁడు గౌరనమంత్రి సుకవిశేఖరుఁడు
కవులెన్న నుత్తర కథరచియించె
నెవరుపఠించిన నెవ్వరు వినిన
జనులకుఁ బుణ్యము ల్సమకూడు సిరులు
మనుముగా నాయుష్యములు గొనసాగుఁ
దాము పుత్రులు నన్న దమ్ములు సఖులు
తామరతంపరై ధరణిఁబెక్కేండ్లు
వేమాఱు నోములు వెలయఁబెండిండ్లు
క్షేమమేర్పడ నెందుఁ జేయుచుండుదురు ॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదేకాని తప్పు లున్నవి. కొన్ని సంస్కారములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

పూర్వ భాగమని, ఉత్తర భాగమని ద్విధావిభక్తమై 2,900 ద్విపదలతోనున్న యీ ప్రశస్త ప్రబంధమున హరిశ్చంద్రోపాఖ్యానకథ వర్ణితమైనది. స్కాందపురాణాంతర్గతముగా సంస్కృత భాషలోనున్న హరిశ్చంద్రోపాఖ్యానము ననుసరించి యీ ద్విపదరచనము జరపఁబడినది. శంకరకవి, వీరశరభకవి, యీ ద్విపదకృతి ననుసరించినవే తమ

పద్యకృతుల రచియించిరి. గౌతమ గోత్రుండైన గౌరనయే తత్కృతి కర్త. అతని వంశమిట్టిది.




I పెద్దన కొడుకగు పోతరాజు సింగయమాధవక్షితి పాలునకు మంత్రిగానుండెను. ఈ సింగయమాధవ, పెద్ద పోతరాజు లిర్వురును శక-1298 నలవత్సరమున నెలకొల్పిన శిలాశాసనము వెలుగోటివారి వంశ చరిత్రమునం బ్రకటింపంబడినది. పయి పోతరాజు తమ్ముని రెండవ కుమారుండగు నీగౌరన యింకను ముప్పదియేండ్ల తర్వాతి వాండు గా వచ్చును.

ఈకవి నవనాథ చరిత్రమని యింకొక ద్విపద కృతిని గూడ రచియించెను.

ఇండీ ఇతర గ్రంథములున్నవి:—124-*a* చికిత్సా సారసంగ్రహము, 142-*a* దూతాధ్యాయము (వైద్యము) 144-*b* వైద్యయోగ సంగ్రహము 274 వేమన పద్యములు. 332 వేంకటరమణ శతకము.

---

## No. **1210.** హరిశ్చంద్ర చరిత్ర.

## HARIŚCANDRACARITRA.

Substance, paper. Size, 12¼ × 8¾ inches. Pages, 240. Lines, 22 on a page. Character, Telugu Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Begins on fol. 1*a*. The other work here in :—Dharmāṅgada caritramu 123*a*.

Complete.

Same work as the above The variations in reading are interlined throughout the MS

The following note is found at th beginning of the MS.

" This rough manuscript is the foundation of the edition I printed in 1847, the lines of which are denoted in pencil at the top of each page in this volume. "

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు. పాఠభేదములు పెక్కులు బంతులనడుమఁ జేర్పఁ బడినవి. కొన్ని నిర్దుష్ట పాఠములు ప్రక్కలను వ్రాయఁబడినవి. 1841 వ సం॥ తాము ముద్రించిన గ్రంథమున కీప్రతియే మూలమని 1827 వ సం॥ బ్రౌను దొరగారిందు వ్రాసియున్నారు. అందలి పాద సంఖ్యలిందు పెన్సిలుతో సూచింపఁబడినవి.

పూర్వమువలె.

ఇందు 123-*a* ధర్మాంగద చరిత్రము గలదు.

---

## No. 1211. హరిశ్చంద్ర చరిత్ర.
## HARIŚCANDRACARITRA.

Substance, paper. Size, 8⅝ × 6¼ inches. Pages, 190. Lines, 16 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol. 1*a* The other works herein are —Vallabhāmbā pariṇayamu 91*a*. Paramabhāgavata vilāsamu 165*a*. Naukācaritra 185*a*. Vallabhāmbāparinayasūci 211*a*. Rādhāmādhava vilāsamu 222*a*. Kāḷahasti śatakamu 246*a* Kāñcipuspa mañjari 267. Aruṇācala mañjari278. Dāśarathi śatakamu 292.

Incomplete.

Same work as the above.

It is stated that this MS. was edited by Vēṅkatanarasayya.

(వి-వి.)—

అసమగ్రము. పూర్వ భాగమును, ఉత్తర భాగమున 190 ద్విప దలునున్నవి. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాత ములు లేవు. "ఇది వెంకటనరసయ్య తీర్పుచేసిన ప్రతి" వ్రాఁత కలదు. బ్రవును దొరగారు వ్రాయించి యుండవచ్చును.

ఇది నెం 1209 రున వర్ణితమైనదే.

ఇందీ యితర గ్రంథములున్నవి :—97*a* వల్లభాంబాపరిణయము, 165*a*. పరమ భాగవత మాసము, 185*a* నౌకాచరిత్ర 211*a* వల్లభాంబా పరిణయము సూచి, 222*a* రాధామాధవ విలాసము, 246*a* కాళహస్తి శతక. 267 కాంచీ పుష్పమంజరి, 278 అరుణాచల మంజరి, 292 దాశరథి శతకము.

## No. 1212. హరిశ్చంద్ర చరిత్ర.

## HARIŚCANDRACARITRA.

Substance, palm-leaf. Size, 8⅜ × 1⅛ inches. Pages, 348. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఉత్తర భాగాంతమున ఇంచుమించుగా 350 ద్విపదలు లేవు. వ్రాంత మంచిదిగాదు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇది నె 1209 దున వర్ణితమైనదే.

---

## No 1213. హరిశ్చంద్రచరిత్ర.

## HARIŚCANDRACARITRA.

Substance, palm-leaf. Size, 14 × 1⅜ inches. Pages, 104. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.

Contains the first part incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. పూర్వభాగమేని కడదాఁక లేదు. వ్రాంత తిన్ననిదిగాదు. తప్పులు హెచ్చు. శైథిల్యము, గ్రంథపాతములు గలవు. పూర్వమువలె.

---

## No 1214. హరిశ్చంద్రచరిత్ర.

## HARISCANDRACARITRA.

Substance, palm-leaf. Size, 15¾ × 1⅜ inches. Pages, 162. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Wants the introductory portion, dedicatory stanzas and the colophon.

Same work as the above.

Date of transcription —Monday the seventh day of the bright fortnight of the lunar month Jyēstha in the year Vibhava.

(వి-వి.)—

సమగ్రమే కాని కృత్యవతరణికయు, పూర్వోత్తరభాగముల సంధి పట్టును లేవు. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు హెచ్చు.

పూర్వమువలె.

గ్రంథాంతమందీవ్రాఁతగలదు.

"విభవ సంవత్సర జ్యేష్ఠ శు ౭ సో॥ సరిక్రి హరిశ్చంద్ర కథ వుత్తరభాగం సంపూర్ణంగాను కీర్తిరాజు తాళబత్తుని శంకరాయుకు వ్రాసెను."

---

## No. 1215. హరిశ్చంద్రచరిత్ర.
## HARIŚCANDRACARITRA.

Substance, palm-leaf. Size, 17 × 1 inches Pages 195 Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance very old. Mode of writing, fair but full of mistakes

Complete.

Same work as the above

(వి. వి.)—

సమగ్రమే. వ్రాఁత తిన్ననిదిగాదు. అమిత శైథిల్యముచేఁ బుస్తక మెల్లఁ జెడినది.

పూర్వమువలె.

---

## No. 1216 హరిశ్చంద్రచరిత్ర (సటీకము.)
## HARIŚCANDRACARITRA—SAṬĪKAMU.

Substance, paper. Size, 13 × 8¼ inches Pages, 164. Lines, 23 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Similar to the work described above

The name of the commentator is not given,

Date of transcription :—3rd September 1846.

**Beginning:**

శివుని కెంజడలలోఁ జెలఁగుజాహ్నవికి ॥ శివుని । పరమేశ్వరుని యొక్క । కెంజడలలో । ఎఱ్ఱనిజడలలోపలను । చెలగు : ప్రకాశించు చున్నటువంటి । జాహ్నవికి । ఆకాశగంగకు ।

సవతుసేయఁగఁదగు సరయువుపొంత ॥ సవతు । సామ్యమును । సేయదగు । చేయనొప్పినటువంటి । సరయువు । సరయు అనే పేరుగల నదియొక్క । పొంత । చెంతను ।

ధరణిదేవికిముఖ దర్పణంబనఁగఁ ॥ ధరణిదేవికి । భూదేవికి । ముఖ దర్పణంబు । అద్దమువంటిముఖము । అనగ । ఈలాగని పల్కగాను ।

పరులకసాధ్యమై పరగునయోధ్య ॥ పరులకు శత్రువులకు । అసాధ్యమై । సాధించకూడనిదై । పరగు । ఒప్పుచున్న । అయోధ్య । అయోధ్య యనేపేరుగల పట్టణము ।

**End:**

తొలఁగునెనాగన్న దుస్స్వప్నఫలము ॥ నాకన్న । నేనుపొందినటు వంటి । దుస్స్వప్న । చెడుకలయొక్క । ఫలము । ప్రాప్తి । తొలుగునె। తప్పునా ॥

కళవళించిననని కౌశికుఁజూచి॥ కళవళించినను । తొందరపడ్డాగాని ; అని । ఈలాగని । కౌశికుజూచి । విశ్వామిత్రునిజూచి ।

నీచపిసాళి యీ నెలఁతలనేలి ॥ నీచపిసాళి । హీనపుధూర్తురాండ్లైన । ఈనెలతలను । ఈస్త్రీలను । ఏలి । పాలించి ।

ఏచినరతికేళి నేప్రొద్దునేమి(?) ఏచినరతికేళిని । ఉద్రేకించిన మదన క్రీడలననుభవించి । ఏప్రొద్దు । ఎల్లప్పుడు. . .

(వి-వి).—

అసమగ్రము. అవతారిక లేదు. పూర్వభాగమున కొంత దాఁకఁ గలదు. వ్రాఁతచక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది నె 1209 రున వర్ణితమైన గౌరనమంత్రి హరిశ్చంద్రచరిత్రమునకు ప్రతిపదటీక. టీకాకారుని పేరెఱుఁగరాదు. నె 1221 రునకు దీనికి భేదముగలదు.

## No. 1217. హరిశ్చంద్రచరిత్ర (సటీకము.)
## HARIŚCANDRACARITRA SAṬĪKAMU.

Substance, paper. Size, $12\frac{3}{8} \times 7\frac{7}{8}$ inches. Pages, 571. Lines, 26 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. The variations in reading are interlined throughout the manuscripts. At the end of the text and commentary, 15 pages contain in the narration of the story, English by C P Brown.

Wants the introductory portion ; otherwise complete.

Same work as the above.

Date of transcription :—9th August 1846.

In the English summary by C P. Brown, it is stated that the work under notice and an extract from the third canto of the Navanāthacaritra were got printed in one volume by him.

(వి-వి).—

సమగ్రము. కాని గ్రంథావతారిక కొఱఁతగానున్నది వ్రాఁత తిన్ననిదే కాని తప్పులున్నవి. పెక్కుసంస్కారములు పంక్తులనడుమఁ జేర్పఁబడినవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. ఇది 1846 వ సం॥ ఆగస్టు 9 వ తేదికి వ్రాయింపఁబడినదట బ్రౌనుదొరగారు ఇంగ్లీషున 15 పుటలలో ఈగ్రంథములోని కథాంశములనెల్ల సంగ్రహించి వ్రాసియున్నారు. ఈ హరిశ్చంద్రచరిత్రను, తద్గ్రంథకర్తయే రచించిన వేఱొకగ్రంథమగు నవనాథచరిత్రలోని భాగమును ఇంగ్లీషున వానివాని కథాసంగ్రహములనుగూడ వ్రాసి బ్రౌనుదొరగారు ఒకటే సంపుటముగా అచ్చువేయించినట్లందుఁగలదు.

పూర్వమువలె.

---

## No. 1218. హరిశ్చంద్రచరిత్ర (సటీకము.)
## HARIŚCANDRACARITRA—SAṬĪKAMU.

Substance, paper. Size, $12\frac{1}{4} \times 8$ inches. Pages, 9. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old Mode of writing, fair but not free from mistakes

Contains a small portion in the first part.

Same work as the above.

(వి-వి).—

అసమగ్రము. పూర్వభాగమందలి కొంచెముపట్టే యుండున్నది. వ్రాఁతతిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

## No. 1219. హరిశ్చంద్రచరిత్ర—సటీకము.

## HARIŚCANDRACARITRA—SAṬĪKAMU.

Substance, paper. Size, $12\frac{5}{8} \times 8\frac{1}{8}$ inches. Pages, 500. Lines, 26 on a page. Character, Telugu. Condition, fair. Appearance, new. Mode of writing, fair but full of mistakes.

Begins on fol. 1*a* The other work herein :—Navanāthacaritra 251*a*.

Incomplete

Same work as the above

Date of transcription :—23rd August 1845.

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథావతరణిక లేదు. కథాదినుండి ఉత్తర భాగమునఁ గొంతదాఁక గలదు. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. ఇంచుమించుగా 620 ద్విపదలును వాని టీకయు నుండవలసిన పత్రము లిందు సంపుటీకరణముననే చేర లేదు. సంస్కారములు బంతుల నడుమఁ జేర్పఁబడినవి. ఈప్రతి 1845, వ సం॥ ఆగస్టు నెల 23 వ తేదికి ముగిసినదట.

ఇది నెం 1220 దున వర్ణితమైనదే.

ఇందు, 251*a* నవనాథచరిత్రము గలదు.

---

## No 1220. హరిశ్చంద్రచరిత్ర—సటీకము.

## HARIŚCANDRACARITRA—SAṬĪKAMU.

Substance, paper. Size, $12\frac{3}{4} \times 7\frac{3}{4}$ inches Pages, 688. Lines, 20 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Begins on fol. 1*a*. The other work herein :—Navanāthacaritra 346*a*.

Complete but wants the introductory portion and a few stanzas at the end of the first part.

Same work as the above.

Date of transcription :—26th May 1846.

(వి-వి.)—

సమగ్రమే కాని గ్రంథావతారికయు పూర్వ భాగాంతపు ద్విపదలు ను గొఱఁత. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రం

థపాతములు లేవు. ఈ ప్రతి 1846 వ సం॥ మే నెల 26 వ తేదికి ముగిసినదట.

ఇది నె 1217 రున వర్ణితమైనదే.

ఇందు, 346*a*. నవనాథచరిత్ర (ద్విపద) గలదు.

---

No. **1221.** హరిశ్చంద్రచరిత్రటీక.

HARIŚCANDRACARITRAṬĪKA.

Substance, paper. Size, 13 × 8½ inches. Pages, 273. Lines, 22 on a page. Character, Telugu Condition, fair. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Wants the commentary for the introductory portion; otherwise complete.

A commentary on Gauranaś Hariścandracaritra which work has been described under No. 1209 ante.

The name of the commentator is not given.

Date of transcription :—20th August 1851

**Beginning:**

శివుని పరమేశ్వరునియొక్క కెంజడలలో ఎర్రని జటలలోపలను జెలగు ప్రకాశించుచున్నటువంటి జాహ్నవికి గంగకు సవతుసేయుగదగు సరిపోల్చదగినట్టి సరయువు సరయూ అనే పేరుగల నదియొక్క పొంత చెంతను ధరణిదేవికి భూదేవికి ముఖదర్పణంబనగ ముఖముచూచుకొనే అద్దమో అన్నట్టుగాను పరులకు శత్రువులకు అసాధ్యమై సాధింపకూడనిదై అయోధ్య అయోధ్యయని యథార్థనామముగల పట్టణము అనగా సాకేతనగరమనుట పరగున్ ఒప్పును.

**End:**

పురముప్రవేశించి పట్టణముజొచ్చి భూప్రజలెల్ల భూజనులందరున్ను పరువడి అత్యంతమున్ను జయసెట్ట జయధ్వనిజేయగాను పృథ్వీశ్వరుడు హరిశ్చంద్ర మహారాజు వసుమతి భూమిని నిజరాజ్యవైభవలీల తన దొరతనపు ఐశ్వర్యవిలాసము ఎసగంగ ఒప్పునట్టుగాను చిరకాలము బహుకాలము ఏలుచుచుండెను పాలించుచున్నుండెను(?)

**Commentary on the Colophon of the Text:**

అనుచు ఈలాగని మార్కండేయుడు మృకండు పుత్రుడయిన మార్కండేయమహాముని ఆ ధర్మజునకు యమధర్మరాజు కొమారుడైన

యుధిష్ఠిరునకు పెనుపొందు అభివృద్ధిగాను మున్ను చెప్పిన మార్గము నను పూర్వము వచించిన రీతిగాను . . . . . . ప్రతి వాది విరోధులనే మదగజ మదించినయేనుగలకు పంచాననుండు సింహ మువంటివాడున్ను మతిమంతుండు బుద్ధిమంతుడైన అయ్యలమంత్రి పుం గవుని అయ్యలనే ప్రధాని శ్రేష్ఠునియొక్క సుతుడు కుమారుడైనటు వంటి గౌరనమంత్రి గౌరనమంత్రి యనే పేరుగల సుకవి శేఖరుడు సత్క విశ్రేష్ఠుడు కవులెన్నను కవీశ్వరులు నుతింపగాను ఉత్తరకథ రచియించె హరిశ్చంద్ర మహారాజుయొక్క వుత్తరకథ చేసెను (ఫలస్తుతి) యెవరు పఠించిన యెవ్వరు చదివినానున్ను యెవ్వరువినిన యెవ్వరాకర్ణించినప్ప టికిన్ని . . . . వేమారు పలుమారున్ను నోములు వ్రత ములు వెలయ దీపింపగాను పెండ్లిండ్లు వివాహములు సేమమేర్పడను క్షేమము కలిగేటట్టుగాను యెందు యెచటనున్ను . . . . . . . .

(వి-వి.)—

సమగ్రము. అవతారికకుమాత్రము టీక లేదు. వ్రాంత చక్కం గా నున్నదిగాని నిర్దుష్టముగాదు. ఈప్రతి వ్రాంత 1851 వ సం॥ ఆగస్టు నెల 20 వ తేదికి ముగిసినదట. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది గౌరనమంత్రి కృతికి ప్రతిపదటీక. ఈ వికారపుటీకకు కర్త యెవరో యెఱుగరాదు.

# GENERAL INDEX.

[ప-రా.—అడుగున గీతగీయఁబడిన పేర్లు గల గ్రంథము లీ కేటలాగునందు వర్ణింపఁబడినవి.]